# ధర్మపాల విజయము

అను

## (కాంస్యకార వీరచరిత్రము)

*

శ్రీ బొమ్మకంటి ప్రభాకరకవి

ప్రణీతము

*

ప్రకాశకులు:

**పొతకమూరి సుబ్రహ్మణ్యము**

పురాతన గ్రంథ పునరోద్ధరణ కార్యస్థానము

నిడుబ్రోలు (గుంటూరు జిల్లా)

1959

1959 జూలై
వికారి, విజయదశమి




1000 ప్రతులు
మూల్యము 2=00 న.పై.
ఆఫ్ క్యాలికో 2=50 న.పై.

ప్రతులకు
పాతకమూరి సుబ్రహ్మణ్యము, 1వ వార్డు, నిడుబ్రోలు (పోస్టు.)

# తొలిపలుకులు - గ్రంధలభ్యత

ఈ ధర్మపాల విజయమను గ్రంథము ఇప్పటికి నలువదిసంవత్సరములనాడు విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమ గ్రంథకర్తలును, కవిశేఖరులు నగు శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు నేనును వారింట విశ్రాంతిగా నున్నసమయమున, నేను వారిని – తాము దేశములు పర్యటించి యనేక గ్రంథములఁ బరిశోధించియుంటిరిగదా! విశ్వబ్రాహ్మణులు శిల్పాదికృత్యముల యందేకాక ప్రభువులై రాజ్యపాలనాది కృత్యములయందు శౌర్యప్రతాపాదుల యందునను దక్షులైయున్నట్లు మన పూర్వచరిత్రల యందున్నదా–యని ప్రశ్నించితిని. వారంతట జిరునగవుతో నన్నుజూచి మనువులందరు విశ్వకర్మవంశీయులే. వీరు పరిపాలనాధర్మపరులైన వారిని క్షత్రియులనుట సహజముకదా. ఇటీవల నాలుగువందల సంవత్సరములకుఁ బూర్వము ధవళేశ్వరపు మార్కండేయాచార్యులు, వారి వంశమువారును బెజవాడదుర్గమును బాలించినటులను, పాటూరు వంశీయులుకూడ బరిపాలనాదక్షులైనట్లును, నాగరఖండ, విశ్వకర్మ పురాణ కృతులయందు గలదు. ప్రస్తుతమొక వీరచరిత్రము ప్రబంధ రూపమున తాళపత్ర ప్రతి నావద్దనున్నది. అది "ధర్మపాలవిజయ" మను మాళవదేశ విశ్వబ్రాహ్మణుల వీరగాథ. నా పరిశోధనాసమయమున కృష్ణాజిల్లా బందరువాస్తవ్యులు గోనుగుంట్ల కోటయ్యశాస్త్రిగారు నాగపూరుప్రాంతమున దమకు లభించినదనియును, నాకిచ్చి దీనిని మీరొకపర్యాయము చూచిన మీ సంశయములన్నియు దీరగలవు. ఎటులైనను మీరీవీరచరిత్రను ముద్రింపజేయుడని శ్రీవారు నాకొసగిరి. గ్రంథము మహాత్మ్యమైనదైనను, శ్రీవారి యానతి జవదాటరానిదైనను, వెంటనే యచ్చొత్తింపలేక పోయితిని. కృష్ణా, గుంటూరు మండల స్వసంఘ కార్యనిర్వాహక సంఘపక్షమున శిల్పవిద్యాప్రబోధమునకై బందరుపట్టణమునకు వెళ్లి, యచటనే యారుసంవత్సరములుండుట సంభవించినది. అపుడు గుడివాడవాస్తవ్యులు తెనాలి శ్రీ ఆంజనేయులుగారు పనిగలిగి నాకడకు వచ్చినప్పుడు ధర్మపాల

విజయములోని కథను, సంగ్రహముగా వినిపించి ముద్రణమునకు ధన సహాయమొనర్ప గోరితిని. వారు దానిని జదివి సంతసించి, దీనిని నేనే యచ్చొత్తింతుననిరి. వీరీకార్యమును నిర్వహింతురనితోచి తాళపత్ర ప్రతిని వారికొప్పగించితిని. కొన్ని దినములకు ఆంజనేయులుగారు మంచి కాగితములపైవ్రాసి నాకు తెచ్చిచూపిరి. తదుపరి పూర్వకాల గ్రంథ మగుటచేతను వ్రాతప్రతులు మారుటచేతను గలిగిన యక్షరస్ఖా లిత్యముల సరిచూచితిననియుఁ జెప్పిరి. తదుపరి బందరునుండి మాస్వగ్రా మమైన పొన్నూరునకువచ్చి, మరికొంతకాలమునకు గుంటూరునకుఁ జేరితిని. అచట నాస్వంతపనులతోను, స్వసంఘ సంస్కారకార్యముల తోను దీకిలేక ఈ గ్రంథవిషయమును గుర్తింపలేనైతిని. అటుల చాల కాలము గడచినతరువాత నేను గ్రంథమిచ్చినఆంజనేయులుగా రంతరించి రని వింటిని. వారి మరణమునకు వగచితినిగాని, గ్రంథమేమయియుండు నని తోచినను, గుడివాడ వెళ్లి విచారించుటకు సాధ్యమైనదికాదు. అటు తరువాతను కీర్తిశేషులైన శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిలవారి పాఠశాల సంఘసమావేశమైనప్పుడు, ఈ గ్రంథవిషయము ప్రస్తావనకు వచ్చి,గ్రంథము తెనాలి ఆంజనేయులుగారికుమారుడువీరేశలింగముగారి వద్దనున్నదని శ్రీ కోలవెన్ను పరబ్రహ్మముగారు నాకు తెల్పిరి. వినిన వెంటనే వెళ్లి శ్రీ వీరేశలింగంగారితో నీవిషయము ప్రస్తావింపగా, వారు నాకీగ్రంథము నిచ్చుచు మాతండ్రిగారీగ్రంథము ముద్రణకానందు లకు విచారించుచు ప్రాణములగోల్పోయిరి. పుత్రుండనై నేనొనర్పలేని యీముద్రణకార్యమును మీరు నెరవేర్చి మాతండ్రిగారి కాత్మశాంతి గలిగింపుడని ముద్రణసహాయమునకు ఏబదిరూప్యములనొసగెదమని, తదుపరి మనియార్డరుగా బంపిరి. తిరిగి దాదాపు ముప్పదియైదేండ్లకు నాచేతికీ గ్రంథములభించినందులకు సంతోషముకలిగినను, సంఘమునకై సర్వశక్తులుధారపోసి ముసలితనములో డస్సిన నేనీకార్యము నిర్వహింప గలనా యను విచారము రెండును నాకపుడు గలిగినవి. ముద్రణకు [illegible] తాళగర్భములో గలసిన యిట్టిగ్రంథములెన్నియున్నవో [illegible] ఉపలభ్యమైన ఈ మహావీరచరిత్ర

మును బుణ్యపురుషుల సహాయముతో ప్రకటించుటచే నాజీవితము సార్థకమగునని త్రికరణశుద్ధిగా నమ్మి నేను కార్యమునకు బూనుకుంటిని.

ఆ తదుపరి దీనినెట్లు పూర్తియొనర్తునా యని కడువిచారించి మహోదారులుగల "అంగలకుదురు" గ్రామమునకు వెళ్లితిని. అందు బ్రహ్మశ్రీ కొండూరు భ్రమరాచార్యులవారు దీనిపుట్టుపూర్వోత్తరముల నెల్ల విని, నాచే కథావస్తువును సంగ్రహముగా విని, మహానందముతో మహారాజపోషకులుగా మును ముందుగా ఏబది రూప్యముల నొసంగి, ముద్రణకార్యమును నిర్విఘ్నముగా నిర్వహింపగలరని దీవించిరి. వారి యాశీర్వాదబలమే యీనాడిట్టిరూపముదాల్చినదని నావిశ్వాసము. తదుపరి యుత్సాహపరులందరు వారి వారికి తోచినట్లు మహోదారముగ ధనసహాయ మొనర్చిరి.

గ్రంథముద్రణకు ధనసహాయముతో బాటు బండిత సహాయము నవుసరమైనదని నాకు తోచినది. అందులకై ప్రయత్నింపు చుండగా, నిరంకుశోపాఖ్యాన వ్యాఖ్యానకర్తలును, విమర్శకాచార్యులునగు శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారేదియో కార్యాంతరమున పొన్నూరుకు వచ్చిరి. వారికీ గ్రంథము సరిచూడనీయ బహుకాలమునుండి వ్రాతప్రతియందుండుటచే వచ్చిన యక్షర స్ఖాలిత్యములనెల్ల బరిశోధించి, గ్రంథరచయిత సామర్థ్యమును వేనోళ్ల గొనియాడి తిరిగినాకొసగిరి. ఇక ముద్రణాదికార్యము లొనర్పుడని ప్రోత్సహించిరి. తెనాలిలో భారతీ ముద్రణాలయము చక్కగ ముద్రింతురని మిత్రులవలన తెలిసి తెనాలికి వెళ్లి, అందు కాలేజీపండితులును, విద్వత్కవులును దర్శనాచార్యులునగు బ్రహ్మశ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారితో నీవిషయము లెల్ల నివేదించితిని. వారును సంతసించి భారతీప్రెస్‌లో ముద్రణము బాగుగా నుండుననియు, నేనును కావలసిన సహాయమును జేయుదుననిరి. అంతట వ్రాతప్రతిని ప్రెస్‌వారు చూచి ముద్రణ కనుకూలముగ వ్రాయించిన బాగుండునని సలహాయిచ్చినందుచేతను కవి, శేఖర పులికొండ పరబ్రహ్మకవిగారు లేఖకులుగాను, శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారి

పర్యవేక్షణమున శుద్ధప్రతి వ్రాయించి ప్రెస్సువారి కప్పగించితిని. వారు కావ్యమును మాత్రము ముద్రణమును పూర్తి యొనర్చిరి.

అంత పూర్వశాసనాదుల పరిశీలించుట మంచిదని యెంచి శ్రీ రాఘవాచార్యులు గారికి దెలుపగా వారు శ్రమకోర్చి తిరుపతి, కంచి, మద్రాసులకు వెళ్ళి పరిశోధన మొనర్చిరి. వారీ గ్రంథమునందెట్టి ముద్రణ లోపములు రాకుండ ఏతద్గ్రంథ రచయిత భావములను యథాతథముగ నుంచుటయే పరమలక్ష్యముగా నిడుకొని, ఈ గ్రంథమును కాపాడిన శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులవారి కృషికి నా కృతజ్ఞతాభి వందనములు. మూల గ్రంథమగు ధర్మపాల విజయమును పరమ పవిత్రా శయములతో రచించిన శ్రీ బొమ్మకంటి ప్రభాకరకవి శేఖరులకు నా హృదయ పూర్వకనమశ్శతము లర్పించితిని.

అహమహమికతో ఈ గ్రంథమును శ్రమయనక సరిచూచి యిచ్చిన స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారికిని, దీని ముద్రణమునకు ఉత్సాహ ముతో ముందుకువచ్చిన వదాన్యులైన ధనదాతలకును నమశ్శతములు.

ఈ కార్యమునకు నన్నివిధముగ ప్రథమమున ప్రోత్సహించిన కొండూరి భ్రమరాచార్యులుగారు ముద్రణమైన గ్రంథమును చూచు కొనకయే స్వర్గస్థులైనందుకు కడుంగడు విచారము.

ఈ గ్రంథము ముద్రణకార్యమున నాకెంతయో ఆదరణ పూర్వ కముగా తోడ్పడి సహాయమొనర్చిన శ్రీ వానపాముల రత్తయ్యగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

ఈ చరిత్ర కాంచీపురమునందు జరుగబడినదని ఇందు చెప్పి యుండుటయు, చరిత్రకు సాదృశ్యముగ శ్రీ కామాక్షీదేవి సన్నిధిన గాన్పించుటంబట్టియు ఈ కామాక్షీదేవి రూపమును, ఆమె నివసించి యున్న పీఠమందున్న శీర్షత్రయముతో సహా, ప్రతిబింబమును ఛాయా పటము తీయించి, ఆ పటమును ఈ గ్రంథమున చేర్చి గ్రంథమును ప్రక టింపదలచి, నేను చిత్రకారునితో కంచికేగ, యా యాలయము అప్ప టికి కొద్దికాలముక్రితమే ఎండోమెంటువారి అధీనమైనదని తెలిసి

ఆ ప్రయత్నము సాధ్యముకాలేదు. అంతట శివకంచి యందున్న తార కేశ్వర శిల్పనిలయ అధిపతులైన శ్రీ ము. వేణుగోపాలాచార్యస్థపతి గారిని దర్శించి నా ప్రయత్నము వారితో విన్నవించి చరిత్రను సంగ్రహముగా వినిపింపగా, ఈదేవి రూపమును పూర్తిగా చిత్రించి మీా కిత్తుమని దయతో వాగ్దానము చేసిరి. ఆవెంటనే వారు ఆ యాలయ మందు ప్రకాశించుచున్న శ్రీ కామాక్షీదేవి రూపమును, ఆమె అధిష్ఠించి యున్న పీఠమందు ప్రకాశించుచున్న త్రిశీర్షములు సహా, యథాతథంగా ఆలయమందున్నటుల స్వయముగా చిత్రించి నేను కోరిన ప్రకారము మద్రాసు వాస్తవ్యులయిన శ్రీ కె. నాగేశ్వరరావు ఆర్టిస్టు డైరక్టరుగారికి తాము స్వయముగ అందజేసిరి. అంతట వారు యీచిత్రమును సరి చూచి, ఆదరణతో దానిని ముద్రణానుకూలముగ బ్లాకు చేయించి నాకు బంపినారు. ఈదేవి చిత్రపఠమును ఈ చరిత్రకు నిదర్శనముగా ఇందు జేర్చుటకు చేసిన నా ప్రయత్నమునకు నాకెంతయో తోడ్పడిన శ్రీ వేణుగోపాలాచార్యులుగారికిని ఈ చిత్రపఠమును గ్రంథమునందు చేర్చి ముద్రణార్హతను సమకూర్చి నాకొసంగిన శ్రీ కె. నాగేశ్వరరావు గారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనశతములు.

కొన్ని కారణాంతరమువల్లను దేవి చిత్రపఠమును సమకూర్చు కొన రెండు పర్యాయములు కంచికి వెళ్ళిన సందర్భముననూ, గ్రంథమును చాలా ఆలస్యముగా తమకు అందజేయవలసివచ్చినందుకు దాతలను మన్నింపవేడితిని.

ఇంకను యోగసత్తాపరిణయము, నాగరఖండము మొదలగు నముద్రిత గ్రంథములు, మూలస్తంభము మొదలగునవి శిథిలప్రాయమై పునర్ముద్రణ కావలసియున్నవి. సావిత్రి పీఠాధ్యక్షులును శ్రీ శ్రీ శ్రీ కనుపర్తి బసవాచార్య జగద్గురుస్వామివారి కృతమగు విశ్వవిద్యాభరణమను సంస్కృత గ్రంథ మెంతకాలమునుండియో అముద్రితముగా నుండి యున్నది. ఈ గ్రంథము సిథిలమై హరించక పూర్వమే దానిని ముద్రణ

మొనర్చుట అవుసరమై యున్నది. ఈ ధర్మపాలవిజయమును విక్రయించిన వచ్చు ద్రవ్యముతో పైగ్రంథములను ముద్రింపజేయుచు నా జీవిత శేషమును సారస్వత సేవయందుపయోగింప సంకల్పించు కొంటిని గనుక, సారస్వతాభిమానులెల్లరు యిటులే ఆదరించినచో, ఈ కార్యము సులభముగా సాగగలదు. ఉదారులైన పుణ్యపురుషుల ధనసహాయమున నేటికి గ్రంథము ప్రచురింపగలిగినందులకు నేనెంతయు ధన్యుడను.

ఈ గ్రంథముద్రణకు ఉదారులైన పండితుల సహాయముండిన గాని వేగిరముగా ఈ కార్యము కొనసాగజాలదు.

శ్రీ రాఘవాచార్యులుగారు పరిశోధనకు వెళ్లివచ్చి కంచిలో కామాక్షీ దేవి సన్నిధిలో రుద్రసేనాదుల శీర్షత్రయము లేదనియు ఆ యాలయమునకు సామీప్యములోనున్న కాళికాదేవి నివసించియున్న పీఠమందున మూడుశిరములు కనుపించుచున్నవి, అవియే మన ఈ చరిత్రకుసంబంధించిన రుద్రసేనాదుల శీర్షత్రయమని నాకు తోచినదని తమపీఠికయందువ్రాసినారు. అది ముద్రణఅయినతరువాతను నేను చూచితిని. కామాక్షీ పీఠమందుననే ఈ శిరములున్నవని చరిత్రయందున్నది. పీఠాటులవ్రాయుటకు కారణమేమయియుండవచ్చునని నాకు సందేహముకలిగి, వెంటనే ది 2-2-58 తేదీన కంచికివెళ్లి ఆ శివకంచియందున్న దేవిఆలయములను విచారించిచూచితిని. ఆగ్రామములో కామాక్షీదేవి ఆలయములు మూడున్నవి. ఒకటి శ్రీ ఏకాంబరేశ్వరాలయములో దేవి శ్రీ కంచికామాక్షియే. రెండవది గ్రామమధ్యనున్న కామాక్షిఆలయము. ఆదేవిసన్నిధిన శ్రీ శంకరాచార్యుల వారు తమకామకోటిపీఠమును ప్రతిష్ఠించుకొని యున్నారు. రాఘవాచార్యులుగారు ఈ కామాక్షీదేవి సన్నిధిన చూచిరికాబోలును. అచట మూడుశిరములు లేవనివ్రాసిరి. అది శంకరపీఠ సాంప్రదాయమని వారికి తెలియదు గనుక అచట లేవని వారు వ్రాసినారు. ఆ గ్రామములో కామాక్షీదేవిఆలయము ఇదిఒక్కటేనని వారనుకున్నారు.– ఈ యాలయము శంకరాచార్యులవారి యాజమాన్యముననే జరుగుచున్నదట.

తదుపరి మూడవ కామాక్షిఆలయము దానికిసమీప్యమునున్నది. ఆ దేవిని కాళికాదేవియని, ఆదిపరాశక్తియనియు పిలుచుచుందురు. ఆ దేవిపాదపీఠమునందు మూడుశిరములున్నవని వారువ్రాసిన ప్రకారము మానవాకారములతో వెలసియున్నవి. ఆ శిరములు శిఖలెగయగట్టి శిరములర్పింపనున్నవా యనునటుల గానిపించుచున్నవి. ఈ చరిత్రను చదివినవారు ఈదేవి సన్నిధిని దర్శించినచో ఈచరిత్ర యొకప్పుడు ఈ కంచిపురమందు జరిగినదేనని, ఈ శిరములు రుద్రసేనాదుల శిరములేనని తప్పక అభిప్రాయపడగలరు. మిగతా రెండాలయములలో నున్న అమ్మవార్లను కామాక్షి యను ఒక్క పేరుతో పిలుచుచున్నారు. ఈ మూడవ ఆలయమున నున్న దేవిని కాళి యని పిలుచుటకు కారణమే మనగా: విశ్వబ్రాహ్మణ శిల్పులు కామాక్షి నామమున ఇష్టకామ్యముల కొరకును వీరి శిల్పకార్యము లనుశ్రుతములు గావున ఆ యా బలవత్తర కార్యముల నిర్వహించుటకు ఆమెనే కాళికాదేవి నామముతో నర్థించుట జరుగుచున్నందున వీరు కాళికాదేవి నామమునే తరుచు వాడుచుందురు, గాన తదితరులుకూడా కాళికాదేవి ఆలయమనియే, ఆ దేవి నటులే పిలుచుచుండి యుండవచ్చును. కంచికి ప్రధానదేవత కామాక్షియే గనుక, కవియు కామాక్షి నామమునే ప్రధానముగా వాడియున్నారు. ఈకథ కంచిపురాణములోనిదని మరియొక ద్విపదకావ్యము చెప్పియున్నది. బండరువల్లి రామకృష్ణసుకవివారురచించిన విశ్వకర్మ శతకమునందు ఈచరిత్రను పదకొండుపద్యములలోసంగ్రహముగ రచించియున్నాడు. భారద్వాజగోత్రజుడ ఆపస్థంభ సూత్రుడ నన్నారు. ఈ కాళికాలయము ఇప్పటికిని విశ్వబ్రాహ్మణుల యాజమాన్యముననేయున్నది.

నిడుబ్రోలు
6-11-58

ఇట్లు జనవిధేయుడు
పొతకమూరి సుబ్రహ్మణ్యము

శ్రీ కంచి విశ్వబ్రాహ్మణ వీధిలో కాళీకోష్టమునందు
వేంచేసియున్న ఆదిపీఠ కాళికాపరమేశ్వరీ యను

# శ్రీ కామాక్షీ అమ్మవారు




రుద్రసేనుడు - భద్రసేనుడు - ఇంద్రసేనుడు



ప్రచురణకర్త :

శ్రీ పొతకమూరి సుబ్రహ్మణ్యం గారు

# పీఠిక

"కాంస్యకార వీరచరిత్రము" అను నామాంతరముగల ఈ ధర్మపాల విజయమును బొమ్మకంటి ప్రభాకరకవి రచించియున్నాడు. ఈ పద్యకావ్యమునకు మూలము గోకవరపు చంద్రశేఖరకవి వ్రాసిన గద్యకావ్యము. ఈ చరిత్రము ద్విపదకావ్యముగాగూడ నున్నది దాని వ్రాతప్రతిని జగిత్యాలలో స్కూల్సు డిప్యూటి ఇనస్పెక్టరుగా పనిచేయుచున్న శ్రీ ఎన్. పాపయ్యశాస్త్రి B. A., B. Ed., గారు నాకు పంపియున్నారు. ఇట్టి చరిత్రము గద్య - పద్య- ద్విపదరూపములలో కావ్యముగా సంతరింపబడుటయే గాక, కీ. శే. శ్రీ బలభద్ర కోటయ్యగారిచేత "కంచరితల"అను పేరితో నవలగాగూడ వ్రాయబడినదని తెలియుచున్నది. ఇన్ని విధములుగా ఈ ఇతివృత్తము రూపొందుటచేత దాని ప్రాశస్త్యము సువ్యక్తమగుచున్నది. నాకు గద్యగ్రంథముగాని, నవలగాని దొరకలేదు. పద్యకావ్యమైనను ఒక్క ప్రతి మాత్రమే చిక్కినది. అది శ్రీ పాతకమూరి సుబ్రహ్మణ్యముగారిద్వారా లభించినట్టిది. ఇంక ఒకటి రెండు ప్రతులు దొరకినచో ఉత్తమపాఠముల నెన్నుకొని ముద్రణకార్యమును సులభముగ సాగింపవచ్చునని ఎంతయో ప్రయత్నించితినిగాని, ఒక్క ప్రతిగాని-తుదకు కవి చరిత్రాదికముగాని చిక్కినది కాదు. కడకు ఈ కావ్యమును పరిచయము చేయుచు 1958 జూన్ 15వ తేది గల ఆంధ్రప్రభలో ఒక వ్యాసమునుగూడ ప్రకటించి, అందు ఎవ్వరివద్దనేని ఈ కావ్యపు వ్రాతప్రతులున్నను, ఎవరికేని ఈకవినిగూర్చి తెలిసియున్నను నాకెరిగింపవలయునని ప్రార్థించియుంటిని. దాని కెవ్వరినుండియు సమాధానము రాలేదు.

నావద్దకు చేరిన వ్రాతప్రతిలో ఎవరో పండితులు అటనట కొలదిగా భాషాసంస్కరణము జరిపియున్నారు. అట్లు వారు చేసినసంస్కరణములు - అంతకు పూర్వ మున్న వ్రాతపాఠములు ప్రత్యేకముగా గుర్తింప వీలుగలవైయే ఉన్నవి. ఆ సంస్కరణములలో కొన్ని నాబుద్ధికి బాగుగానే యున్నవి. మఱికొన్ని పూర్వపాఠములే సరిగానున్నట్లు తోచినవి. ఇవి యన్నియు వ్యాకరణాది దోషములకు, అర్థవిశేషములకు చెందినవి మాత్రమే కాని, కథావిశేషమునకు సంబంధించినవి కావు. కథపై చేయి వేయుట కెవ్వరి కేమియధికార ముండును? పైని వివరించిన మూల పాఠ - సంస్కృతపాఠములలో నాకు సముచితములని తోచినవానిని మాత్రమే నేను ముద్రించియున్నాను. ఆ రెండునుగాక నేను చేసిన భాషాసంస్కారములు మిక్కిలి కొద్ది. వీని అన్నింటికిని పాఠాంతరము లిచ్చిన బాగుండెడిదే కాని, గ్రంథవిస్తరభీతిచేతను, ఆ పాఠాంతరము లంతగా ప్రయోజనకారులని భావింపనందునను ఆ పని చేయనైతిని. పండితహస్త లిఖితమై శుద్ధమైనప్రతియే దొరకియున్నచో ఈ ఇబ్బందు లుండెడివే కావు. అయినను నేనొక్కడనే పరిశీలించుట చాలదేమో యని నిరంకుశోపాఖ్యాన వ్యాఖ్యాతలు - విమర్శకాచార్య బిరుదాంచితులు నగు శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారి తోడ్పాటుగూడ గైకొంటిని.

# కవివంశాదికము

ఈ కావ్యకర్త బొమ్మకంటి ప్రభాకరకవి తన దేశకాలములనుగూర్చి ఇంచు పేర్కొనలేదు. తన గోత్ర సూత్రాములనుగూర్చి మాత్రమే చెప్పుకొన్నాడు. ఇతడు తెలగాణ్యశాఖకు చెందిన బ్రాహ్మణుడని శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారనుచున్నారు. ఇతని తాత కృష్ణాఖ్యుడూ - తండ్రి సాంబశివార్యుడూ దొడ్డ పండితులనియు శంకరాద్వైత వేత్తలనియును చెప్పుకొన్నాడు. ప్రయాగ నృసింహకవి కూతురైన సుబ్బమాంబ ఈయన తల్లి యట. దీనినిబట్టి కవిగారి తల్లిదండ్రుల వంశములు రెండును పాండిత్య ప్రతిభలు కలవని తెలియుచున్నది. ఈ కవి యజుశ్శాఖీ, హారితసగోత్రోద్భవుడు. ఇతడు తన కావ్యమును పరమశివున కంకిత మిచ్చి ధన్యుడయినాడు.

కవి దేశకాలములను నిర్ణయించుటకు నాకింతవఱ కెట్టి సాధనములును దొరకలేదు. సుపర్ణసగోత్రుడయిన గోకవరపు చంద్రశేఖరకవినిగూర్చి తెలిసినప్పటికిని ఈ కవిచరిత్రమును కొంతవఱ కూహింపవచ్చును. బొమ్మకంటి యను ఇంటిపేరిని బట్టి ఈతడు తెలంగాణా ప్రాంతమువాడేమో యని ఊహింప వీలగుచున్నది. గోకవరపు కవి గూడ ఆ ప్రాంతమువాడే కావచ్చు ననుకొందును. ఈ యంశములు పరిశోధనార్హములు. చంద్రశేఖరకవి వ్రాసిన గద్యకావ్యముగూడ దొరకినచో దానినీకవి యెంతవఱ కనుసరించెనో - ఎంతవఱకు స్వతంత్రత చూపెనో స్పష్టమయ్యెడిది. అయినను ఇది పద్యకావ్యముగావున వర్ణనాంశములలోను, రసౌచిత్య పాత్రపోషణాదులలోను ప్రత్యేకత యుండక పోదు.

# కావ్యవస్తువు

ఈ కావ్యకథ మాళవదేశ శిల్పాచార్యులకును కాంచీపురము నేలిన ఒక చోళరాజునకును సంబంధించినట్టిది. చోళపల్లవరాజులు సహజముగా శిల్పాభిమానులు - శిల్పకళాపోషకులు నని చరిత్రను బట్టియు వారి కావ్యములను బట్టియు తెలియుచున్నది. ఇట్టి స్థితిలో మహాశిల్పులగు రుద్రసేనాదుల దెస్సచేయుటకు చోళాంగుడు పూనుకొనుట. మంత్రుల దుర్మంత్రముచేతనే యని ఈ కావ్యము వలన తెల్లమగుచున్నది. ఈ విషయమును చోళాంగుడు దళ సైన్యనాయకుడను సేనను గోల్పోయినపిమ్మట మంత్రుల నుద్దేశించి "మంత్రు లిటుండ మిమ్ముఁ గడు మన్నన మీఱఁగ నమ్మి మీదు దుర్మంత్రముచేతఁ గోల్పడితి మానిత యోధుల సైన్య మంత ......" అని అనుచున్నాడు. చోళరాజులలో పరిమళ చోళుడను నొక రాజుగూడ మంత్రుల మాయోపాయములకు లోగి శిల్పుల కెగ్గు చేసినట్లు పరిమళచోళచరిత్ర మను గ్రంథము చెప్పుచున్నది.

ఈ కథ ప్రవర్తిల్లిన కాలమును నిర్ధారణమొనర్చుటకు గూడ ఈ కావ్యమున ప్రమాణము లంతగా దొరకుట లేదు. ధర్మపాలాదులు కంచి నేలునప్పుడు

తిరుపతి కేగి అచ్చటి కొండమీది దేవస్థానమున జీర్ణయంత్రోద్ధారణాదులు చేసి నట్లును, ఆవిషయమును శాసనబద్ధ మొనర్చినట్లును ఈ గ్రంథము ప్రథమాశ్వాస ములోని 123 వ వచనములో నున్నది. "ఇటమ సమీపంబున నున్న సుబ్రహ్మ ణ్యేశ్వర నివాసంబగు తిరుపతి మహాక్షేత్రంబునఁ ద్రిమూర్త్యాత్మక స్వరూపుండును, రామానుజ పరికల్పిత వేంకటేశ్వరాభిధానుండును నగు సుబ్రహ్మణ్యేశ్వరుని దేవాలయం బొకటి కలదు..." దీనినిబట్టి ఆ కొండమీది సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని శ్రీ రామానుజాచార్యులవారు వేంకటేశ్వరస్వామినిగా మార్చిన పిమ్మటనే ధర్మపాలుఁ డచ్చట జీర్ణయంత్రోద్ధారము చేసినాడనుకొనవలయును గదా! ఆ పక్షమున ఈ కథ రామానుజులకు పిమ్మట జరిగిన దనవలసి వచ్చుచున్నది. కాని కాలనిర్ణయమునకు పై వాక్యమును మాత్రమే ప్రమాణమని భావించుట చాల దను కొందును. ఆకాశగమనాది యోగశక్తులయు, దివ్యాస్త్ర శస్త్రప్రయోగములయు వర్ణనమునుబట్టి చూచిన నెంతయో ప్రాచీనమైన చరిత్రగను తోచుచున్నది. తిరు పతిలో ధర్మపాలు డొనర్చిన జీర్ణయంత్రోద్ధారమునకు సంబంధించిన శాసనము దొరకునేమోయని తిరుపతిశాసనములు ముద్రించిన గ్రంథములను పరిశీలింపజూచి తిని. ఆ గ్రంథము లనేక భాగములుగా నుండినందున ఒకటి రెండు దినములలో ఆపని సాధ్యము కాలేదు. [illegible]మీది శంకరులకు పిమ్మటిదే ఈచరిత్ర మనుట సత్యము. మాళవదేశమునగూడ ఈ చరిత్రమునుగూర్చి విచారింపవలసియున్నది.

ఈ కంచివీరుల శిరములు కామాక్షీదేవాలయమున దేవిపాదమూలమున శిలా రూపము నందుట, వారు మరల లబ్ధజీవులగుట మొదలగు చరిత్రాంశములు కంచిలో శాసనబద్ధములు చేయబడి యున్నవని ఇందలి తృతీయాశ్వాసములోని 166, 167 సంఖ్యలు గల పద్యములవలన దెలియుచున్నది. ఆ శాసన మే భాషలో నున్నదో, ఎచ్చట నున్నదోగూడ పరిశోధింపదగిన విషయము. కంచిశాసనములు లెక్క లేనన్ని యున్నవి. ఇంకను అన్నియు ముద్రితములైనవో లేదో గూడ తెలియదు. అందును దొరకిన వెన్నియో, ఇంకను దొరకవలసిన వెన్నియో! తిరుపతి శాస నముగాని కంచిశాసనముగాని దొరకినచో కాలనిర్ణయము సుకరమగును. చోళాంగుని చరిత్రగాని, తన్మంత్రులగు సుంకరనారనాదుల యుదంతముగాని దొరకినను కథా కాలనిర్ణయము సుకరమే యగును.

కంచిలోని కామాక్షీపాద సన్నిధానమున రుద్రసేనాదుల శిలారూప శీర్ష త్రయ మున్నదని కావ్యము చెప్పుచున్నది. ఈ చరిత్ర జరిగినప్పటినుండియు కామాక్షీ దేవికి పాదపూజయేగాని శిరఃపూజ లేదనియు ఈ చరిత్ర నెఱిగినవా రను చున్నారు. అట్లు పాదపూజయే ప్రధానముగా జరుగుటకు దేవిపాదములతో గూడ రుద్రసేనాదుల తలలున్నను పూజ జరుగుచుండవలయుననుటయే కారణము. ఈ యంశ మీ కావ్యములోగూడ "నీ సుత శీర్షముల్ వాసి పూజల నందు మత్పాదసన్నిధి మహిమఁ జేసి" అని యున్నది. నేను కంచికి వెళ్లి పరిశీలింపగా కామాక్షీపాదపీఠ మున అట్టి తలలు లేవు. దేవికి మాత్రము చిరకాలమునుండియు పాదపూజయే జరుగు

చున్నదని అర్చకులు చెప్పినారు. కామాక్షిగుడికి సమీపమునందే కాళికాలయమున్నది. ఈ కాళీదేవి పూర్వము శివునిచేత కాళి (నల్లనిది) వై పోదువుగాక అని శపింపబడిన పార్వతియే యట. ఆ కాళి తపస్సుచేసి పాపమును పోగొట్టుకొని కామాక్షియైనదని స్థలపురాణము చెప్పుచున్నది. ఈ కాళికాదేవి పాదపీఠమున మాత్రము మూడుశిరము లున్నవి. అవియే ప్రకృతకథకు సంబంధించిన రుద్రసేనాదుల శీర్షములు కావచ్చునవియు ఊహింప నవకాశము కలుగుచున్నది. ఈ కాళికిని కామాక్షికిని అభేదమేకనుక కవి ఈ విషయము నంతగా పాటింపక యిట్లు వ్రాసినాడా, అనియు ఊహ చేయవచ్చునుగదా. దీనికితోడు ఈ కాళికాలయమునకును విశ్వకర్మవంశీయులకునుగూడ గాఢ సంబంధ మగపడుచున్నది. ఈ కాళీదేవాలయము వెలసినప్పటినుండియు నేటివఱకును విశ్వబ్రాహ్మణుల ధర్మకర్తృత్వముక్రిందనే యున్నది. కావున ధర్మపాలాదులా నాడీ యుభయదేవతలను అర్చించి తదనుగ్రహామువలన ఫలముల నందిరేమో!

## సంప్రదాయజ్ఞత

ఈ కవి విశ్వకర్మ వంశీయులగు శిల్పబ్రాహ్మణుల సంప్రదాయమును బాగుగా నెఱింగినవాడని ఈ కృతి చెప్పుచున్నది. ఋగ్యజురాది వేదములయందు పేర్కొనబడిన విశ్వకర్మ, త్వష్ట, విశ్వరూపుడు, సానగ - సనాతనాది - ఋషులు మున్నగు శిల్పప్రవర్తకులు తరువాత వెల్వడిన శాస్త్ర పురాణాగమ శిల్పగ్రంథములలో అట నట సవిస్తరముగా ప్రస్తావింపబడియున్నారు. స్కాందపురాణములోని నాగరఖండము వీరి వృత్తాంతమును గోత్ర సూత్ర శాఖా శిల్ప సహితముగా వర్ణించుచున్నది. అట్లే విశ్వకర్మపురాణము గూడ విశ్వకర్మసంతతి మహిమను బహురీతుల కొనియాడుచున్నది. ఆ ప్రాచీన గ్రంథములలోని విశేషములను ఈ కవి సందర్భానుసారముగా ఇందు పొందుపఱచినాడు. రుద్రసేనాది శిల్పాచార్యుల మహిమాదికమును శంకరులు చోళాంగునకు చెప్పుసందర్భమున ద్వితీయాశ్వాసములో 232 వ పద్యమునుండి 237 వ పద్యమువఱకును, రుద్రసేనాదులు రాజునకు తమ వంశాదికమునుగూర్చి చెప్పుపట్టున, తృ. ఆ. 13 నుండి 20 వ పద్యమువఱకును, ఇంక కొన్నితావుల కొలదిపాటిగను ఈ యంశములు ప్రశంసింపబడినవి.

సానగాది బ్రహ్మర్షుల ప్రశంస తొలిసారిగా యజుర్వేదములోని ప్రాచీదిశాది మంత్రములలో నగపడుచున్నది. యజ్ఞాది కార్యములయందు దీ ప్రాచీదిశాది మంత్రములతో ఇష్టకోపధానము చేయుదురు. ఆ అయిదు మంత్రములందును వరుసగా సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ లను పంచర్షులు ప్రశంసింపబడినారు. ఈ పంచర్షి మంత్రములతో ఇష్టకోపధానము చేయుసంప్రదాయము నీ కవి ద్వితీయాశ్వాసము 51 వ వచనమున తత్సంతతివాడగు రుద్రసేనునిచే సందర్భోచితముగా పాటింప జేసినాడు.

ఈ కావ్యమున విశ్వకర్మజులకు కులవాచకములుగా విశ్వకర్మ, పంచానన వంశ్య, దేవబ్రాహ్మణ, శిల్పబ్రాహ్మణ, అగ్నివంశజ, జగత్కారాన్వయ, మేఘ వాహకుల, బ్రహ్మకుల, జగద్గురుకుల, అనిమిషవిప్రాత్మజాది పదములు వాడ బడినవి. విశ్వకర్మ పంచముఖుడు కావునను, ఆ ముఖములనుండి సముత్పన్నులైన సానగాది పంచర్షులు - మనుమయాది పంచబ్రహ్మలు వీరి మూలపురుషులు గావు నను వీరిని పంచాననకులము వారనుట సమంజసము. ఈ పంచానన శబ్దమును బట్టియే "పంచాణము" వారను పేరుగూడ వీరికి శాసనాదులలో నగపడు చున్నది. జగత్కర-విశ్వకరాది పదములు విశ్వకర్మ శబ్దమునకు పర్యాయపదములే కావున జగత్కారాన్వయులనీ, విశ్వకరాన్వయులనీ అనుట సుసంగతము. శిల్ప నిర్మాతలు - దేవనిర్మాతలు అయిన బ్రాహ్మణులు కాన శిల్పబ్రాహ్మణ, దేవ బ్రాహ్మణాది పదములును, విశ్వకర్మ మేఘవాహనుడు కావున మేఘవాహకులజు లను పదమును "విశ్వకర్మా జగద్గురుః" అను పురాణవచనమునుబట్టి 'జగద్గురుకులో ద్భూతులు' అను పదమును, విశ్వరూపుడు దేవపురోహితుడు గాన, తత్సంతాన మగుట "అనిమిషవిప్రాత్మజ - అమరపురోహితాన్వయాది" పదములును సార్థకము లగుచున్నవి. జగద్గురు శబ్దమువలెనే జగదాచార్య పదము ప్రయోగింపబడినది. ఈ శిల్పబ్రాహ్మణులు కాంస్యవృత్తి ప్రధానముగా గలవారయినందున కాంస్య కార, శౌల్బిక శబ్దములు వృత్తివాచకములుగా నుపయోగింపబడినవి. శుల్బమనగా రాగి. రాగిపని చేయువాడు శౌల్బికుడు.

ఇంకొకవిషయము. వేదములలోగాని, తక్కిన సంస్కృతవాఙ్మయములోగాని "అహభూనఋషి" అనియే ప్రయోగము. ఈ కవి, ప్ర. ఆ. 17వ పద్యమున "... సన్మౌనితకీర్తి సానగ సనాతన ప్రత్న సుపర్ణనామకాభూన ఋషుల్ ప్రవర్తిలిన భూత మహీసుర వంశ మోనృపా!" అని 'అహభూన' శబ్దమును 'అభూన' అని ప్రయోగించినాడు. ప్రాసవశమున అట్లు చేసినాడనక తప్పుట లేదు. కొప్పూరి వేంకటాచార్య విరచితమైన ఆంధ్రవిశ్వకర్మపురాణములోగూడ నీ శబ్దము "అభునస గోత్రపవిత్రుం డభినవ మనుసూత్రపాత్రుఁడల ఋక్శాఖా ప్రభుఁడతఁడు... " అని ప్రాసస్థానమున ఒకచోటను, పాదమధ్యమున నొకచోటను వాడబడియున్నది. ఆ ప్రయోగమును చూచియే ఈకవి యిట్లు చేసినాడేమో. ఎవరైనను సుప్రసిద్ధ గోత్రఋషులను జెప్పు నీ పదముల నిట్లు వికృతములు చేయుట సాహస మనియే నా తలంపు. ఇది అవాంతర విషయము.

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగా రన్నట్లు పంచముఖబ్రహ్మ వంశీయుల సంప్రదాయ మిందిట్లు చక్కగా ననుసంధింపబడుటయేగాక, మంత్ర యంత్రాద్యను ష్ఠాన ప్రభావమును, దేవతాసాక్షాత్కార శక్తియుగూడ ప్రముఖముగా నిరూపిత మైనది. ఈ కావ్యమునకు జీవమే అది యన్నను తప్పు లేదు. ధర్మపాలుఁడేమి, అతని సుతులేమి, వారి భార్యలేమి, తక్కిన శిల్పులేమి, అందరును దేవతాసము పాసనము చేసి, యోగానుష్ఠాన మొనర్చి తదనుగ్రహమునకు పాత్రులైనవారే. నాటి శిల్పులు అపూర్వ శిల్పసౌందర్యఖనులైన వస్తువుల నిర్మాణ మొనర్చి దేశ

దేశాంతరముల వెలయించెడివారని తెలియుచున్నది. ఎత్తుకంచునకు రెండెత్తుల బంగారము వెల యనుటచేత ఆ శిల్పవైభవము అత్యద్భుతమని తోచుట లేదా!

ఈ కావ్యపాత్రలగు రుద్రసేనాదుల నామములలో క్షత్రియనామములకు తగిన 'సేన' శబ్దము జోడింపబడినదే యని ఒకరు సందేహము వెలిపుచ్చినారు. అది వారి శౌర్యపరాక్రమాది గుణములనుబట్టియు, దేశాచారమునుబట్టియు నేర్పడినదని నాయభిప్రాయము. పరశురామునికి వెఱచిన హైహయాన్వయులనే రక్షించినవా రెంత పరాక్రమసంపన్నులు కారు! కాబట్టి సేనపదము వారి వీరతాచిహ్నమే యనుట యుక్తము. ససైన్యముగా పోయి దేశాంతర వాణిజ్యము చేయు వీరలు గదా వీరు. వీరి వీరత్వము వీరి శిల్పకళావ్యాప్తికి చేదోడు. పాటూరి నేలిన ప్రభువులై విజయనగర రాజులయు, గజపతులయు మన్ననలకు పాత్రులైన విశ్వకర్మవంశీయులు కొందఱు కసవాపాత్ర - బసవాపాత్రాది నామములతో వ్యవహరింపబడినట్లు విశ్వకర్మపురాణావతారికనుబట్టి తెలియుచున్నది. పాత్రశబ్దము నానాటి కళింగదేశీయులు తమ నామములచివర గౌరవవాచకముగా వాడుకొనుచుండెడివారు గదా! అట్టే రుద్రసేన భద్రసేనాది పదములు దేశవ్యవహారమునుబట్టిగాని, వీరత్వచిహ్నముగాగాని వాడబడి యుండవచ్చును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "ఇది యొక సంప్రదాయ సిద్ధమయిన పూర్వాంధ్రకావ్యము" అన్నమాట పరమసత్యము. కవి సాధ్యమయినంతవఱకు ఇందు మహాకావ్య లక్షణములను పొందుపఱచినాడు. ప్రధానకథను, రసమును పరిపోషించుటకే కావ్యమున రెండు ప్రాసంగిక వృత్తాంతములు మిక్కిలి సంగ్రహముగా సందర్భోచితముగా పేర్కొనబడినవి. ప్రథమాశ్వాసములో భద్రసేనునిచే ప్రశ్నింపబడి ధర్మపాలుడు తమకు శరణాగతత్రాణ బిరుదము కలిగిన వృత్తాంతము (పరశురాముని బారినుండి హైహయ క్షత్రియులను గాపాడిన విషయము)ను చెప్పును. విశ్వకర్మ తన తనయ యగు సంజ్ఞాదేవిని సూర్యునకిచ్చి పెండ్లి చేసినాడు. అందుచే సూర్యవంశక్షత్రియులు విశ్వకర్మ సంతానమునకు ప్రియబంధువులు. మహాస్త్ర శస్త్ర నిర్మాతలు - పరాక్రమవంతులు నగు అట్టి మాతామహ వంశము వారిని ఆ క్షత్రియులు శరణువేడుటలో ఔచిత్యమున్నది. అట్లే అస్త్రవిద్యావిదులు లోకోపకారపరులు నగు నీ విశ్వకర్మజుల ప్రార్థన నంగీకరించి పరశురాముడు శాంతించుటలోను ఔచిత్యమున్నది. అయినను "ఈ కథ నిక్కడ చెప్పుటలో ఉద్దేశ్యమేమి" అను ప్రశ్న పుట్టవచ్చును. ఈ శిల్పు లిట్టి పూర్వచరిత్రము కలవారు కనుకనే తమకు ఎగ్గుచేసిన సూరన చోళాంగాదులనుగూడ శరణు వేడుకొనగా రక్షించి తమ బిరుదమును నిలుపుకొన్నారని ఈ కథ చెప్పుచున్నది. ప్రధాన కథారంభమున బీజరూపముగా నుడువబడిన ఈ యంశము కథానిర్వహణమున నాయకపక్షముగా ఫలించినది. అట్లే శంకరయతి ధర్మపాలాదులను కాశిలో గలసికొన్నప్పుడు కాంచీపుర మహిమను దెలుప ప్రార్థితుడై కామాక్షీ - ఏకామ్రనాథులు కంచిలో ఆవిర్భవించిన వృత్తాంతము నుగ్గడించును. దైవభక్తులగు నా శిల్పులకు

కాంచీపుర గమనోత్సాహమును గల్పింప నీ ప్రశంస యుపకరించినది. అంతియే కాక రాబోవు కథాభాగమున రుద్రసేనాదులను పునర్జీవితులను జేయుటకు కామాక్షి కారణమగుటకను, ఈ శిల్పులకు వంశపరంపరగా ఆమె కులదేవత కానున్నది గనుకను ముందే తత్ప్రశంస చేయుట మిక్కిలి ఉచితముగా నున్నది.

## పాత్రపోషణము

ఈ కావ్యమునకు నాయకుడు ధర్మపాలుడు ద్వితీయాశ్వాసమున యుద్ధ ఘట్టమునను, తృతీయాశ్వాసకథలో కొంతవఱకును ఎక్కువప్రాధాన్యము వహించినవాడు రుద్రసేనుడే యైనను, రుద్రసేనాదుల శిరశ్ఛేదము జరిగినపిమ్మట వారిని పునర్జీవితుల నొనర్చుట మున్నగు కార్యములకు కర్తృత్వము వహించువాడును, తత్ఫలమును బొందువాడును ధర్మపాలుడే కావున ఈ కావ్యమున కాతడే ప్రధాన నాయకుడు. కనుకనే ఇది ధర్మపాలవిజయ మైనది. ఈ ధర్మపాలపాత్రమును కవి ఉదాత్తముగా పోషించినాడు. ఉత్తమ దైవప్రభావ విశిష్ట నాయకునిగా తీర్చుటయేగాక, దయా క్షమాది సద్గుణ మహితునిగా గూడ చిత్రించినాడు. అందుచేతనే యాతడు దేవీ శంకరాచార్యాదుల ఘనప్రశంసలకును పాత్రుడై ఆదర్శనాయకుడయినాడు. ఈవీరకావ్యములో రుద్రసేనుడు రెండవరుద్రమూర్తియే. ఈతని వీరవిక్రమములు బాగుగా వర్ణింపబడినవి. ఇతడు శంకరాదుల కిచ్చిన శాపముల నుపసంహరించి దయాపయోనిధిగూడ అయినాడు. శంకరపాత్రముగూడ చక్కగానే పోషింపబడినది. చోళాంగునికి రుద్రసేనాదుల మరణ రహస్యమును వచియించుపట్టున పాపము శంకరుడు సందేహించును. అయినను తుదకు శిష్య వాత్సల్యముచే అకార్యము చేయక తప్పినది కాదు. కాని అది రుద్రసేనాదుల మహామహిమ లోకవ్యాప్తమగుటకు ఉపయోగించుటచే శంకరుని కొక మచ్చ కాలేదు, శంకరుడు శిల్పముపైడ శిల్పులయెడ అధికారప్రేమలు చూపి ఆదర్శ ప్రాయుడయినాడు. సూరనమంత్రి దుష్టుడు. అతని దుర్మంత్రమువలననే ఈ చెట్ట కలిగినది. చోళాంగుడు మంత్రులచేతిలోని కీలుబొమ్మయై సర్వానర్థములకు గుఱి యాయెను. వీరరస ప్రధానమగు నీ కావ్యములో స్త్రీపాత్రములకు గూడ ప్రవేశము కల్పించి వారి పాతివ్రత్య ప్రభావమును కామాక్షీదేవిచేతగూడ ప్రశంసింపజేసి నారీ లోకమున కాదర్శమూర్తులనుగా వారిని తీర్చినాడు.

## వర్ణనాదులు

ఈ కావ్యమున ప్రముఖమైనది యుద్ధవర్ణనము. ఇది కొంచె మధిక మైనను వెగటు పుట్టించ లేదు. ఇంకను సందర్భానుసారముగా సూర్య చంద్రోదయాస్తమయ వర్ణనలు, నగర ఋతు వీటీ విటోద్యాన యాత్రాది వర్ణనలు సముచితముగా జేయబడి మహాకావ్యత్వసిద్ధికి తోడ్పడినవి. ప్రధానకథానుగుణముగానే ఆ యా వర్ణన లిందు పొందుపఱుపబడుట మెచ్చదగినది. ధర్మపాలాదులు కంచికి చేరుకొను

నప్పటికి సూర్యాస్తమయమయినది. ఆసందర్భమందలి వర్ణనలోని "మామలు విశ్వకర్మకుల..." "మనుదన్నుశాణకల్పితు" "ఛాయయొంకిత వేద" (ప్రథమాశ్వాసము 128, 129, 136) ఇత్యాది పద్యములు విశ్వకర్మచరిత్ర సంప్రదాయము నెఱింగి కవి వ్రాసినాడు. ఇచ్చట ఛాయ అను పదము సంజ్ఞాదేవికి పర్యాయమని యెన్న వలయును.

ఈకవి సలక్షణమగు భాష నుపయోగించువాడైనను అటనట స్వాతంత్ర్యము గూడ వహించును. 'తూఁచుకోల'కు పర్యాయముగా "ధరణికోల" పదమును వాడినాడు. ఇది కవి నివసించుప్రాంతపు వ్యవహారములోనున్నదేమో అనుకొందును. యతిప్రాసాది సందర్భముల వ్యర్థపదముల వాడుటకీ కవి వెనుదీయడు. తాను పండితుడయ్యు అట్టిరచన కేల తావిచ్చెనో తోఁచదు. కొంచెము శ్రద్ధ ఓపిక తీసికొన్నచో బాగుగా వ్రాయగలవాడనియే పెక్కుపద్యములు చెప్పుచున్నవి. అగుగాక! ఈ చర్చ నికమగింతము. ఈ గ్రంథ మిట్లు సర్వవిధముల భారతీయ శిల్పచరిత్ర సంప్రదాయములతోను అలంకారిక లక్షణములతోను సిద్ధమైన మహాకావ్యమయినది.

నా కోరికను మన్నించి తమ అమూల్యాభిప్రాయముల నొసంగినవిద్వత్కవిప్రకాండులు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీపల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారలకును - వ్రాతప్రతిని పరిశీలించుటలో కొలదిగా తోడ్పడిన శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవి, శ్రీ జి. వి. కృష్ణరావు గారలకును నానమోవాకములు.

తెనాలి
6-11-58

ఇట్లు,
సుధీ విధేయుడు
కొండూరు వీరరాఘవాచార్యులు

# పండితాభిప్రాయములు

కవిసార్వభౌమాద్యనేకబిరుదాంచితులు,
ఆంధ్రప్రదేశప్రభుత్వాస్థానకవులు,
భారతప్రభుత్వ పారితోషిక సమ్మానితులు అగు
శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

ధర్మపాలవిజయ మొక పద్యకావ్యము. ఇందు విశ్వకర్మవంశోద్భవుఁడగు ధర్మపాలుఁడను మాళవదేశ శిల్పాచార్యుని కథ వర్ణింపఁబడినది. ఇది యే పురాణాంతర్గతమో, యేనాఁటిదో తెలియుట కాధారము లిందుఁ గానిపింపవు. చోళరాజు కంచిని బాలించిన నాఁటిదని మాత్రము తెలియుచున్నది. ఆ విషయము చరిత్ర పరిశోధకులు నిర్ణయింప నర్హులు.

ఈ కథనే యిక్కవి కన్న మున్ను గోకవరపు భద్రయ్యగారి కొడుకు సుపర్ణగోత్రజుఁడు చంద్రశేఖరుఁడు గద్యకావ్యముగ రచించి యున్నట్లిందుఁ జెప్పఁబడియున్నది. ఈ పద్యకావ్యకర్త తన దేశ కాలాదు లిందు వివరింపలేదు. ప్రయాగ నరసింహకవి పుత్రిక సుబ్బమాంబకును, బొమ్మకంటి సాంబశివునకును బుట్టితిననియుఁ, దనపేరు ప్రభాకర కవి యనియుఁ జెప్పుకొనియె. దీనం జేసి యితఁడు త్రిలింగదేశ బ్రాహ్మణుఁడనియు, హారితస గోత్రుఁడనియును దెలియుచున్నది. రచనం బట్టి విచారింప నాధునికుఁడని యు, సంస్కృతాంధ్రములఁ బండితుఁ డనియుఁ బ్రమాణకవి యనియుఁ దోఁచుచున్నది.

ఈ కావ్యమున ద్వితీయాశ్వాసములోని యుద్ధము భారతములో సైంధవవధనాఁటి యుద్ధమును మించియున్నది. ఇందుఁ దీర్థయాత్రా విధానము, దేవతాస్తుతులు చక్కఁగా వర్ణింపఁబడి యున్నవి. విరాడ్విశ్వకర్మయొక్క పంచముఖముల నుదయించిన సానగాదిబ్రహ్మర్షుల సంతానమగు కొందఱు శిల్పాచార్యుల శౌర్యపరాక్రమములు, మంత్రయంత్ర ధనుర్విద్యాదికౌశలము, దేవతోపాసనా ప్రభావము, దేవతాసాక్షా

త్కారము, లోకోత్తరశిల్ప ప్రాగల్భ్యము, భూతదయ పరోపకారాది సుగుణసంపత్తియు నిందు భూయిష్ఠముగా వర్ణింపఁబడి యున్నవి.

ఈ విశ్వకర్మ వంశమునకుఁ జెందిన త్వష్టయు, విశ్వరూపుఁడు, మయుఁడు మహాప్రభావసంపన్నులుగాను, లోకాతీతమహిమాతివిశాల యశోవిరాజితులుగాను వేదాదివాఙ్మయములో వర్ణింపఁబడియున్నారు. పంచముఖబ్రహ్మ వంశీయులగు విశ్వకర్మలందఱును విశ్వబ్రాహ్మణులు. వీరికిఁ జతుర్ముఖబ్రహ్మ వంశీయులగు బ్రాహ్మణులకుంబలె వేదకర్మాధి కారమేకాక, శిల్పకర్మాధికారముగూడ విశేషించి కలదు. వీరు విశ్వ మానవకోటికిఁ జేయని యుపకారకార్య మొక్కటియును లేదు. అణువు మొదలు బ్రహ్మాండమువఱకు వీరు నిర్మించినదియే యనుట సిద్ధాంతము. ఈ యంశము లిందు యథావకాశముగా సూచితము లనవచ్చును.

ఈ కవి యిందుఁ గాంస్యకారాదిపదములు వృత్తిని బట్టియు, జగదాచార్య, శిల్పాచార్య, విశ్వకర్మ, దేవబ్రాహ్మణాదిపదములు జాతి వాచకములుగాను వాడిన ట్లగపడుచున్నది.

ఈ ధర్మపాలవిజయ మొకనాఁటి విశ్వబ్రాహ్మణ విజయ మని నా యభిప్రాయము.

రా జ మ ం డ్రి
5-7-58

ఇట్లు
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ ఉపాధ్యక్షులు,
కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, M. L. C.

శ్రీ బొమ్మకంటి ప్రభాకర కవిగారిచే రచియింపఁబడిన ధర్మ పాలవిజయమన్న కావ్యము నామూలాగ్రముగాఁ జదివితిని. ఇది యొక సత్కావ్యము. రచన సంప్రదాయసిద్ధముగా నున్నది. రచయిత మంచి పండితుఁడు, సత్కవి. మంచిశైలి. ఇది యొక పూర్వప్రబంధము. ఈ మాటలోనే యీ కావ్యస్వరూప మంతయుఁ జెప్పఁబడినది.

మహామంత్రశాస్త్రవేత్తలు, అథర్వవేదవిదులు నయ్యున ఒక

గొప్ప పూర్వవిశ్వబ్రాహ్మణ కుటుంబమువారి చరిత్ర యిందలి కథ. పూర్వ మీ దేశమున విశ్వబ్రాహ్మణు లెట్టివారో యీ కావ్యము నిరూపించుచున్నది. వారి ప్రాచీనసభ్యత,వారివైదికలౌకిక శిల్పప్రాగల్భ్యము వేద శాస్త్రాగమ శిల్ప వాస్తు గ్రంథములలో ప్రత్యక్షముగా వ్యాఖ్యాన రమ్యముగా కాంచఁగలము. విశ్వకర్మ పురాణ – నాగరఖండాది గ్రంథ ములు వీరి ప్రాశస్త్యమును చాటునవి తెలుఁగులోగూడ నున్నవి. నేఁటికిని విశ్వబ్రాహ్మణకుటుంబములు కొన్ని యీదేశమున ఈ లక్షణ ములు గలవి యున్నవి. నేఁటికిని విశ్వబ్రాహ్మణులలో ఉపాసనాపరులు, మంత్రశాస్త్రవేత్తలుఁ గలరు. వంగవోలు తాలూకాలోని "మాచయ బత్తులవారు" ప్రసిద్ధులు.

ఈ కావ్యమున విశ్వకర్మ, శిల్పిబ్రాహ్మణ, దేవబ్రాహ్మణ, జగదాచార్యాది శబ్దములు పర్యాయపదములుగా ప్రయుక్తము లయి నవి. దేవబ్రాహ్మణుఁ డనునది "దేవపూజకుఁడైన బ్రాహ్మణుఁడు'' అనియే కాకుండ, దేవనిర్మాతయైన బ్రాహ్మణుఁడని కూడ విగ్రహము సాధించుట యీకవి చేసినపని. ఈ కవి సానగ సనాతనాది శబ్దములు వాడి ఈ శిల్పబ్రాహ్మణుల సంప్రదాయజ్ఞతను వెల్లడించినాఁడు.

ఈ గ్రంథమునందలి కొన్నిరహస్యములు పండితులైన విశ్వ బ్రాహ్మణులయొద్ద నేర్చుకొనఁదగినవిగా నున్నవి.

ఈ కథ కల్పితము కాదు. దీని యాథార్థ్య నిరూపకమయిన శాసనము కంచిలో నున్నదని ఈకావ్యములోనే వ్రాయఁబడినది. ఇతర శాసనగతములయిన యద్భుతములు, లోకాతీతశక్తులు కల్పితము లయినచో నిదియు నట్టిదే. అవి నిజ మయినచో నిదియు నిజమే.

వస్తుతః మన పూర్వనాగరకతయే వేఱు. అది నేఁటికి విశ్వ సింపరానిదైనది. ఆ శ్రద్ధ, ఆ యుపాసన, ఆ మంత్రానుష్ఠానము, ఆ సంఘవ్యవస్థ, ఆ కాలమహిమ అన్నియు మాసిపోయినప్పుడు, వాని స్వరూపమహిమలు పోయినప్పుడు, వానిని విశ్వసించుటకు విశ్వాస గుణమే లోపమయినప్పుడు విశ్వసింపమి తప్పులేదుకూడను. సరే. అది యటుండనీ.

ఈ యన్నింటితోపాటు ముఖ్యాతిముఖ్యమయినది యిది యొక సంప్రదాయసిద్ధ మయిన పూర్వాంధ్రకావ్య మన్నది.

విజయవాడ
17—6—58

విశ్వనాథ సత్యనారాయణ.

---

కవిశేఖర – మహోపాధ్యాయ

## మధ్వశ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు

శ్రీ బొమ్మకంటి ప్రభాకరకవి ప్రణీతమగు ధర్మపాలవిజయ మను కావ్యమును బఠించి యానందించితిని. గ్రంథాదిపద్యములను బట్టి యీ కవి హరితసగోత్రుఁడు, యజుశ్శాఖి, శ్రీ సుబ్బమాంబా సాంబశివ పుణ్యదంతుల పుత్త్రుఁడనియుఁ దెల్లమగుచున్నది. బొమ్మకంటివారు తెలగాణ్యబ్రాహ్మణశాఖకుఁ జెందినవారు. కావునఁ బ్రకృత కవియుఁ దచ్ఛాఖీయుఁడనుట నిర్వివాదము. ఈ కవిశేఖరుఁడు సుపర్ణ గోత్రజుఁడగు శ్రీ గోకవరపు చంద్రశేఖరకవిచే వ్రాయఁబడిన గద్య కావ్యము నిట్లు పద్యకావ్యముగ మార్చియున్నాఁడు. ఈ విషయము ప్రథమాశ్వాసములోని 20 వ పద్యమున స్పష్టమగుచున్నది. ఈ కవికి సంస్కృతాంధ్రములయందనర్గళకవితాధార గలదు. గర్భకవిత్వమునందు నీతనికిఁ బ్రీతిమెండని యిందలి ప్రథమాశ్వాసములోని 22 వ పద్యమును దిలకించినవారికిఁ దెలియకపోదు. ఆశ్వాసత్రితయాత్మకమగు నికావ్యము సరసము సాలంకారము సలక్షణమునై సహృదయరంజకముగా నున్నది. ఇక్కవి స్వకృతిని బరమేశ్వరాంకిత మొనర్చుటచే శివభాగవతుఁ డనుట సుస్పష్టము.

ఇందలి యితివృత్తము మాళవదేశమునకును తమిళదేశాంతర్గత కాంచీనగరమునకును సంబంధించి యున్నది. కథలోని ప్రధాననాయకులు మాళవదేశీయ విశ్వకర్మవంశ్యులు. వేదకాలమునుండియుఁగల వీరి ప్రాచీన సభ్యతా సంస్కృతులీ కావ్యమునం దందందు సందర్భాను సారము పొందుపఱుపఁబడి యున్నవి. ఈ విశ్వకర్మ వంశీయులు ప్రధానముగాఁ గాంస్యవృత్తి నవలంబించిన వారుగాన వృత్తిని బురస్కరించుకొని కాంస్యకార – శౌల్బిక శబ్దము లిందుఁ బ్రయోగింపఁబడినవి.

అంతియేకాక కులవాచకములుగ శిల్పబ్రాహ్మణ, దేవబ్రాహ్మణ, విశ్వకర్మాది శబ్దములును బలుచోటుల సుప్రయుక్తములై యున్నవి. పిండితార్థ మేమన నీకవి సత్యాన్వేషణ మొనర్చి విశ్వబ్రాహ్మణులను సానగసనాతనాది శిల్పబ్రహ్మర్షి వంశసంభవులనుగా నిరూపించి మఱుఁగు వడియున్న యేతదుదంతమును వెలుఁగులోనికిఁ దెచ్చినాఁడ నుట పరమసత్యము.

ఏతత్కావ్యనాయకులు శైవులుగాన శైవపుణ్యస్థలములగు శ్రీశైలాదులవర్ణన యిందధికముగాఁ గావింపఁబడినది. ఈకథ స్త్రీపాత్ర విరహితకాకుండునట్లు రుద్రసేనాదుల భార్యల పాతివ్రత్యప్రభావము కొంతప్రస్తావింపఁబడినది. 'కాంతాసమ్మితతయోపదేశయుజే' అన్న యాలంకారికదృష్టితో నీకావ్యమును దిలకింతుమేని పితాపుత్రులు, శ్వశ్రూస్నుషలు, రాజభృత్యులు నేర్చుకోదఁగిన నీతి విశేషములిం దెన్నేని హృదయంగమముగా ధ్వనించుచున్నవి. మొత్తముమీఁద నీకావ్యరాజ మాంధ్రభాషావధూటి కొక యనర్ఘభూషణమై ప్రాచీన శిల్పాచార్యాన్వత్యమునకు సువర్ణస్తూపమువలె శోభిలుచున్నదని నా యాశయము.

22-7-58 } ఇట్లు
గుంటూరు } కవిశేఖర, మహోపాధ్యాయ, పల్లెపూర్ణప్రజ్ఞాచార్యులు.

---

## ఈగ్రంథముద్రణమునకు ధనసహాయమొనర్చినయుదారులు

### మహారాజ పోషకులు రు. 50

కీ. శే. శ్రీ కొండూరు భ్రమరాచార్యులుగారు, అంగలకుదురు.
శ్రీ నల్లపాటి సుబ్బారావుగారు, చార్టర్డు ఇంజనీర్, గుంటూరు.
" పల్లంపాటి వెంకటేశ్వర్లు చౌదరిగారు, గుంటూరు.
" తెనాలి ఆంజనేయులుగారి కుమారుడు వీరేశలింగంగారు, గుడివాడ, కృష్ణాజిల్లా

శ్రీ క్రాప సుబ్బారాయుడుగారి కుమారుడు రామబ్రహ్మంగారు, కొల్లూరు.
" వల్లభాపురపు సుబ్రహ్మణ్యముగారు, రిటైర్డు డిప్యూటీ కలెక్టరు, బందరు.
" నందిపాటి వీరాచార్యులుగారు, కిసాన్‌యాత్రాస్పెషల్ ఆర్గనైజరు, గుంటూరు
" వంకాయలపాటి ఫాలలోచనరావుగారు, ఇంద్రాణి ట్రాన్సుపోర్టు, ప్రొప్రయిటరు, విశాఖపట్టణము.
" విశ్వబ్రాహ్మణ సంఘమువారు, బ్రాహ్మణకోడూరు.
" చెన్నుపాటి రామకోటయ్య చౌదరిగారు, ప్రసిడెంటు: పడమటి పంచాయతీ, కృష్ణాజిల్లా పంచాయతీ అధ్యక్షులసంఘం.

## రాజపోషకులు రు. 25

శ్రీ రాచకుళ్ల సోమసుందరరావుగారు, టవున్‌ప్లానింగుడిప్యూటీడైరెక్టరు, గుంటూరు
" కందేపి సుబ్రహ్మణ్యముగారు, డాక్టరు, పిడుగురాళ్ళ.
" మంగళాపురపు సుబ్రహ్మణ్యముగారి కుమారుడు వీరభద్రాచార్యులుగారు పోష్టుమాష్టరు, చీరాల.
" మంగళాపురపు కోటిలింగముగారి కుమారుడు వీరభద్రాచార్యులుగారు, సీనియర్ క్లర్కు I. L. T. D. Ltd. చీరాల.
" దీవి లక్ష్మయ్యగారి కుమారుడు కోటేశ్వరరావుగారు, అలిండియా కాంగ్రెసు సంఘసభ్యులు, చిలకలూరిపేట.
" శ్రీరాం వెంకటశ్రామయ్యగారు, తహసీల్ దారు, వాయలపాడు, చిత్తూరుజిల్లా.
" అంగలకుదిటి వెంకటేశ్వర్లుగారు, సంగడిగుంట, గుంటూరు.
" విక్టరీ డైమండుహాలువారు, పెద్దబజారు, గుంటూరు.
" అత్తలూరి బసవాచార్యులుగారు, పండరీపురం, గుంటూరు.
" కోళ్ళపూడి అమరయ్యగారిభార్య వెంకటసుబ్బమ్మగారు, గుంటూరు.
" శ్రీరాం కృష్ణమూర్తిగారు, గ్యారిజన్ ఇంజనీరు, పూనా.
" గిన్నెల సుందరయ్యగారి కుమారుడు పిచ్చయ్యగారు, శ్రీకృష్ణ సా మిల్ మేనేజరు, వుయ్యూరు
" పాతకమూరి నాగయ్యగారి కుమారుడు వెంకటాచార్యులుగారు, పొన్నూరు.
" కానూరి వీరభద్రయ్యగారు, తోట్లవల్లూరు, కృష్ణాజిల్లా.
" దరిశి వెంకటసుబ్బారావుగారు, ఫస్టుక్లాస్ మేజిస్ట్రేటు, నరసరావుపేట.
" పొన్నూరు విశ్వబ్రాహ్మణ సంఘంవారు రు 30-0-0
" వల్లభాపురం విశ్వబ్రాహ్మణ సంఘమువారు

## పోషకులు రు. 10

శ్రీ పులివర్తి సుబ్బారావుగారు, స్పెషల్ రెవిన్యూ ఇనస్పెక్టరు, చీరాల,
" చిత్తూరి నాగభూషణాచార్యులుగారు, జిల్లా పంచాయతీ ఆఫీసరు, బందరు.
" పాములర్తి నాగభూషణశర్మగారు, శ్రీ ఆంజనేయశాస్త్రి సంస్కృత పాఠశాల ఉపాధ్యాయులు, తెనాలి.

శ్రీ తాడికొండ ఆంజనేయులుగారు, నరసారావుపేట.
,, దైవజ్ఞ రత్న సిరికొండ లక్ష్మీనరసింహశాస్త్రిగారు, గుంటూరు.
,, పావులూరి మంచయ్యగారు, క్లాత్ మర్చంటు, బెజవాడ.
,, పూసపాటి వీరబ్రహ్మేంద్రాచార్యులుగారు (రు 13 లు) మురికిపూడి
,, పూసపాటి సాంబయ్యగారు, ఏనమదల, గుంటూరు.
,, కోరశ్య వెంకటరంగయ్యశ్రేష్ఠిఅండ్ సన్సువారు, మరాబువ్యాపారం, గుంటూరు
,, కొలకలూరి కోటయాచార్యులుగారు, తహసీల్ దారు, నెల్లూరుజిల్లా.
,, పొన్నూరు వెంకటాచార్యులుగారు, తెనాలి
,, కన్నెగంటి వెంకటరామయ్య చౌదరిగారు, అయితానగర్, తెనాలి.
,, ఆలూరి వీరమల్లయ్యగారు, అయితానగరపాడు, తెనాలి.
,, శ్రీరాం కోటయ్యగారు, కొల్లూరు.
,, పాతకమూరి విఠల్ ప్రసాదరావుగారు, మెకానికల్ ఇంజనీరు, పొన్నూరు.
,, దీవి రామభద్రయ్యగారు, పెదపూడి, తెనాలితాలూకా.
,, కోళ్ళపూడి మల్లికార్జునకవిగారు, రిటైర్డు హెడ్మాష్టర్, నిడుబ్రోలు.
,, పాతకమూరి నాగబ్రహ్మంగారి కుమారుడు సుబ్బరామయ్యగారు, క్లార్కు ఎలక్ట్రికల్ ఆఫీసు, గుంటూరు.
,, పాతకమూరి శంకరాచార్యులుగారు, క్లర్కు, జిల్లాహెల్తాఫీసు, గుంటూరు.
,, వడ్డెపాటి కృష్ణమూర్తిగారు, మహమ్మదన్ హైస్కూల్ టీచరు, గుంటూరు.
,, మచ్చా అంకమ్మగారు, శాయిబాబా ట్రంకుఫ్యాక్టరీ, గుంటూరు.
,, చోడవరపు రాఘవాచార్యులుగారు, చెరుకుపల్లివారివీధి, బకింగ్ హాంపేట విజయవాడ.
,, మాగుటూరు రామకోటేశ్వరరావుగారు, జూనియర్ స్కూల్సుఇన్స్పెక్టరు, తెనాలి
,, కోలవెన్ను మల్లిఖార్జునరావుగారు, కంకిపాడు,
,, సి. వెంకటేశ్వరరావుగారు, విశాఖపట్నం గవర్నమెంటు క్వార్టర్సు.
,, ఆలూరి లక్ష్మణచంద్రరావుగారు, అసిస్టెంటుస్టేషనుమాష్టరు, సూరారెడ్డిపాలెం.
,, చింతాడ ప్రకాశరావుగారు, నిడుబ్రోలు.

## సహాయులు: రు 5.

శ్రీ అత్తలూరి సూర్యనారాయణగారు, నరసారావుపేట.
,, జుజ్జూరి పార్థసారథిగారు, మరాబు, తెనాలి.
,, వల్లభాపురపు వీరబ్రహ్మముగారు, అయితానగర్, తెనాలి.
,, కందేపి మల్లికార్జునుడుగారు, కొల్లూరు.

శ్రీ కందేపి నరసింహాంగారు, కొల్లూరు.
" కందేపి వెంకటాచార్యులుగారు, కొల్లూరు.
" పాతకమూరి వేణునాధాచార్యులుగారు, కొల్లూరు.
" శ్రీరాం రాజశేఖరంగారు, కొల్లూరు.
" బెల్లంకొండ రామబ్రహ్మాచార్యులుగారు, నిడుబ్రోలు.
" నూతక్కి ఏకాంబ్రముగారు, డాక్టరు, పొన్నూరు.
" బిట్రిగుంట మల్లికార్జునాచార్యులుగారు, నిడుబ్రోలు.
" చోడవరపు శేషాచార్యులుగారు, తెనాలి.
" కోనూరి నాగయ్యగారు, ఐతానగరం, తెనాలి.
" జగ్గాపాత్రుని వీరభద్రాచార్యులుగారు, బెజవాడ
" తుర్లపాటి బ్రహ్మానందంగారు, వేటపాలెం.
" వుండవల్లి మణిభూషణాచార్యులుగారు డిటో
" అంగలకుదిటి సుందరాచార్యులుగారు "
" అత్తలూరి నాగసుబ్రహ్మణ్యం గారు "
" మాగులూరి కోటయ్యగారు, "
" భూసపాటి వెంకటసుబ్బారావుగారు, "
" శ్రీరాం చంద్రమౌళీశ్వరరావుగారు "
" లక్కోజు వీరాచార్యులుగారు, నిడుబ్రోలు
" చోడా సుబ్బారావుగారు, పేరాల.
" వడ్లమూడి చంద్రశేఖరశాస్త్రిగారు. ఇంజనీయరు, బాపట్ల.
" కనగపాటి చక్రధరరావుగారు, బాపట్లమునిసిపల్ ఆఫీస్,
" పోలూరి వీరభద్రాచార్యులుగారు, కోపరేటివు ఇనస్పెక్టరు
" కందుకూరి జాలయ్యగారు, కోఆపరేటివ్ ఇనస్పెక్టరు, బాపట్ల.
" చంద్రగిరి నాగాచార్యులుగారు, బాపట్ల, షరాఫ్.
" పొన్నూరు వీరబ్రహ్మాచారిగారు, తాలూకాసర్వేయరు, బాపట్ల.
" చందలూరు మల్లిఖార్జునరావుగారు, అగ్రహారం, గుంటూరు.
" గూడూరు వెంకటేశ్వరరావుగారు, చౌతరా, గుంటూరు.
" కోనూరు రామమోహనరావుగారు, అసిస్టెంటుస్టేషనుమాష్టరు, స్టూవార్టుపురం.
" కొమ్మూరి గుర్లింగాచారిగారు, జిల్లాకోర్టుహెడ్ క్లార్కు, గుంటూరు
" గుండిమెడ విశ్వనాధశాస్త్రిగారు, హెడ్ మాష్టరు, శారదానికేతనం, గుంటూరు
" మంగళాపురపు వీరనారాయణగారు, గుంటూరు.
" కోలవెన్ను కృష్ణమూర్తిగారు, కంకిపాడు.
" వానపాముల మల్లిఖార్జునరావుగారు, కంకిపాడు.
" కోడూరు బ్రహ్మయ్యగారి కు॥ విశ్వరూపాచార్యులుగారు, గుంటూరు.

ఓం

శ్రీ గురుభ్యో నమః

# ధర్మపాల విజయము

## ప్రథమాశ్వాసము


గౌరీ రమణీ శిరోమణి కుచాశ్లేష క్రియా యుక్తి మ
త్ప్రాగల్భ్యుండు నిరంతరార్తజన సంత్రాణైకచిత్తుం డురో
భాగోద్దీపిత శేషమస్తమణి దీప్యత్తాండవ ప్రక్రియో
ద్వేగాలోల జటాధరుండగు మహావిశ్వేశ్వరుం గొల్చెదన్. 1

సీ. వేదంబులే ప్రొద్దు వేనోళ్లఁ గొనియాడఁ
దెలియనేరనిజాడ మెలఁగువానిఁ
బాకారిముఖ్య దిక్పాలురు వొడమక
యున్ననాఁ డొక్కఁడై యున్నవానిఁ
బంచభూతముల యుత్పత్తి లేనప్పుడ
వ్యాజ భూతేశుఁడై ప్రబలువాని
సర్వశూన్యంబైన సమయంబునందునఁ
దనకుఁ దానై యుండి తనరువాని

గీ. నట్టి సర్వజ్ఞ నఖిలేశు నాదిదేవు
నఖిల జీవాంతరాత్ముఁడై యలరువాని
విశ్వకర్మ యటంచుఁ దా వివిధగతుల
విశ్రుతుండైనవాని నే వినుతి సేతు. 2

చ. హరు నర రూపుమాపె నది యార్యగఁ గన్పడుశక్తి నెన్నఁగాఁ
దరమె యనంగ గంగ తలఁ దాఁకి విషప్రతిమానమై సదా
వెలుఁగు ఘటింప దాని కరివెట్టితి నే నవతంస సత్సుధా
ధరరుచి నంచు మార్వాలుకు తద్గిరిరాజ తనూజ నెంచెదన్. 3

సీ. గంగోత్తమాంగు నర్ధాంగ మందిరమున
నాట్యంబు సేయు నే నాగయాన
ఉపమింపరాని యా యుపనిష దుద్యాన
వనకలకంఠి యే వనరుహాక్షి
అఖిలసంయమి మానసాబ్జ పంజర కీర
రాజమై వెలయు నే రమణిమిన్న
అజ సురాదులకైన నలవి గానట్టి యా
నాదస్వరూప యే వేదవినుత

గీ. నిఖిల భువనైకమాత యే నీలవేణి
సర్వ భక్తానుమోద యే సత్యవిదిత
యట్టి కామాక్షి శాంకరి నమలచరిత
ననిశ మర్చింతు నా హృదయాబ్జసీమ. 4

ఉ. శూలి లలాటలోచన విశుద్ధ విభూతి విశేష భూషణ
వ్యాళ సుధాంశురేఖల నవక్రగతిం గని శీర్షమెక్కినం
గ్రాలుదునంచు నెంచ ననురాగమునన్ గను దక్షజా మనః
పాలునకుం దనర్చు నతిపావని నభ్రధునిన్ దలంచెదన్. 5

మ. గిరికన్యా కుచకుంభదుగ్ధము లసత్క్రీడన్ గరాగ్రంబునన్
గరిమన్ దొల్త గ్రహించి వక్త్రమున గంగం బోఁతపాల్గాగఁ దా
నురుకుక్షిన్ భరియించెనో యన గణవ్యూహాత్మలం దోఁచు నా
కరివక్త్రుం దలఁతున్ మదీయ కృతి విఘ్నం బెందు రాకుండఁగన్. 6

మ. తలిదండ్రుల్ దను గంగపా ల్ద్రోలుతనే దైవక్రియం జేసినన్
జ్వాలదగ్నిప్రభచేత మున్ వెలసెఁగా జన్మస్థ తారామహా
బలుఁడౌటన్ శివజాతకుండని ఘనప్రజ్ఞుల్ ప్రశంసింపఁగాఁ
జెలువొప్పారు కుమారు ధిక్కృత తనుశ్రీమారు నగ్గించెదన్. 7

మ. హరుతోడన్ మునుదక్షకన్యకను మోయన్ వెన్ను కాయయ్యె దు
ర్భరభారంబున నేఁడు మిమ్మిరువురన్ బ్రౌఢి న్వహింపంగ నొ
క్కరిభారంబె తనర్చెనంచు హిమవత్కన్యామణిన్ శంకరున్
గరిమన్ బ్రోవఁగ వేఁడు గోవిభునకున్ గైవారముల్ సల్పెదన్. 8

ఉ. కౌఁగిట రాధ సేరగను గామిని నీ చనుఁదోయి పయ్యెదన్
దాఁగి హృదేకలక్ష్మిని మదంబున దొంగిలె సంపునీక బల్
బాగగు తోడిదొంగలని పాణులచేఁ గసి దీర నొత్తుచున్
రాగము వెల్వడంగ నఖరంబులఁ జీరు హరిన్ దలంచెదన్. 9

ఉ. శ్రీ నెద నుంచుకొంటి సరసీరుహ మొక్కటి చేతఁబూనెఁ బ
ద్మానన కబ్జ మిష్టమని హస్తతలంబున నాభిపద్మమున్
బూనునొ యంచు శౌరి నలుమోములఁ జూచుచుఁ గాపునేయఁగా
నా నలినంబునందు నిడెనా యనఁ బొల్చువిధిన్ దలంచెదన్. 10

ఉ. అంచేలు వారువంబు లయినందునఁ దద్గతి నేర్వ వేల్పు ల
ర్థించఁగఁ బంకజాసనుని దిట్టతనం బెటులున్న వైదికుం
డంచు విరించి నెంచి యల యంచలకుం గల నేర్పుమించి క
న్పించి చరించు శారదను బేర్మి నచంచలతన్ భజించెదన్. 11

సీ. విద్యుత్ప్రభలతోడ వెలసి సహస్రార
కమలమం దుండు నే కలికిమిన్న
యోగీశ్వరులు సమాధ్యున్మీలనస్థితిఁ
జూడఁ గాంక్షింతు రే సుందరాంగి

నవవిధ నాదముల్ నటియింపఁగా నున్న
నాదాంత భృంగి యే నళిననేత్ర
కమలసంభవు చిత్తకాసారమందుండు
రాయంచకోదమ యే రాజవదన

గీ. హరిహరాదులకైనను నరయరాని
పరమతేజం బనంగ లోఁ బ్రబలియున్న
మంత్రదైవంబు నా మనోమారుతములఁ
దిరిగి వెలిఁగెడి మంగమాదేవిఁ దలఁతు. 12

గీ. సరస కావ్య పురాణాది సకల కృతుల
దివ్యవాక్సారముల నించు భవ్యమతుల
వ్యాస వాల్మీకి కాళిదాసాది కవుల
కెరఁగి రచియింతుఁ బటుచమత్కృతినిఁ గృతిని. 13

క. ధర గీర్వాణకవీశ్వర
విరచిత కృతు లాంధ్రభాష వెలయించిన యా
వరకవుల నన్నయాదుల
గరిమ న్నుతియింతు నిష్టకావ్య రచనకై. 14

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిస్తోత్రంబునుఁ జేసి మద్వంశాను
క్రమంబు నభివర్ణించెద. 15

గీ. హరితఋషిగోత్రసంజాతుఁ డమలబుద్ధి
స్మార్తమతదీపకుఁడు యజుశ్శాఖవాఁడు
శంకరాద్వైతవేదియా సజ్జనుండు
కృష్ణనాముఁడు మాతాత కీర్తియుతుఁడు. 16

ఉ. లాలిత బొమ్మకంటి విమలస్తుత వంశ్యుఁడు తర్కసాహితీ
లోలుఁ డలంక్రియా రసవిలోక లసత్కవితానుబంధ సం
శీలుఁడు శంకరాభిమత సిద్ధ సుభాష్యహితార్థ గీత స
జ్జాలుఁడు తత్తనూభవుఁడు సాంబశివాఖ్యుఁడు సుప్రసిద్ధుఁడౌ. 17

ఉ. కౌశికగోత్ర వర్ధనుఁడు కారుణికుండు ప్రయాగసత్కులో
ద్భాసుఁడు శ్రీనృసింహ కవివర్యుఁడు తత్సుత సుబ్బమాంబకున్
వాసి గలట్టి సాంబశివవర్యున కాత్మజుఁడన్ వసుంధరన్
భాసురలీల నొప్పెడు ప్రభాకర నామమునం బ్రసిద్ధుఁడన్. 18

క. గద్యాకృతి మును వెలయుచు
వేద్యంబగు ధర్మపాల వీరచరితమున్
బద్యాకృతి నొనరించెద
హృద్యంబుగ సుకవిజనము లెన్నఁగ జగతిన్. 19

చ. వినుత గుణాగ్రగణ్యుఁడును విశ్రుత గోకవరాన్వయుండు స
జ్జనమణి భద్రయార్య తనుజాతసుధీమణి చంద్రశేఖరుం
డనెడు సుపర్ణగోత్రజుఁ డనర్గళధార లిఖించె గద్య నే
ననుపమ పద్యకావ్యముగ నయ్యది వ్రాసెద నార్యు లెన్నఁగన్. 20

చ. వితత కళావిశేషునకు విశ్రుతశీలికి రాజరాజ స
న్నుతునకు రూపనిర్జిత మనోజునకున్ బరిశుద్ధగోత్ర సు
స్థితునకుఁ బెండ్లిచేసెదను జెన్నొదవంగ మహార్థయుక్త్యలం
కృతుల నొనర్చి సత్కృతిగ నెంచుచు మత్కృతికన్యకామణిన్. 21

మత్తేభకందగర్భసీసము.

సువిలసత్పావక సూర్యచంద్ర నయనా
వేదండ చర్మాంబరా! దయాళు
ప్రబలశత్రుస్తుత పార్వతీ ప్రియకరా
భస్మోజ్జ్వలద్విగ్రహా! స్మరారి
అచలదుద్దీర్ఘ జటాంచితోత్తమ తనూ
స్వామీ మహోక్షధ్వజా! గజారి
విమలసంహారక విశ్వనాయక భవా
మార్తాండ కోటిప్రభా! మహేశ

గీ. సరస సితరుచి కలిత విషహార విశద
సుచరిత గణప హరిముఖ సుఖద వరద
గిరిశయన గిరిపతి పురహర సలిలప
తిశరధి పురుష పరశివ దివ్యరూప. 22

ఇందలి మత్తేభము.

విలసత్పావక సూర్యచంద్రనయనా వేదండ చర్మాంబరా
బలశత్రుస్తుత పార్వతీప్రియకరా భస్మోజ్జ్వలద్విగ్రహా
చలదుద్దీర్ఘ జటాంచితోత్తమతనూ స్వామీ మహోక్షధ్వజా
మలసంహారక విశ్వనాయక భవా మార్తాండ కోటిప్రభా. 23

ఇందలి కందము.

సరస సితరుచి కలిత విష
హార విశదసుచరిత గణప హరిముఖ సుఖదా
వరద గిరిశయన గిరిపతి
పురహర సలిలపతి శరధి పురుష పరశివా. 24

వ. అని వినుతించి. 25

## షష్ఠ్యంతములు

క. హరునకు శశధర సుకళా
భరునకు సంధ్యాతిలాస్య పరునకు గిరిజా
వరునకు ఘనశూల లస
త్కరునకు సద్భక్తమోక్ష కరణ గురునకుఁ. 26

క. శంభునకుఁ జతురఘన దో
స్తంభునకు నిరస్తశత్రు దంభునకు నఘా
లంభునకు దాతృతా వి
స్రంభునకు శ్రితావనైక సంరంభునకుఁ. 27

క. స్థాణునకు దత్తమాని
ప్రాణునకుఁ గరుడవాహ బాణునకు సుర
త్రాణునకు భువనగణ ని
ర్మాణునకు నిజాశ్రితోత్తమ ప్రాణునకుఁ. 28

వ. సమర్పితంబుగా నా యొనర్పంబూనిన ధర్మపాలవిజయంబను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 29

## కథాప్రారంభము

ఉ. శాణవిఘృష్ట రత్నయుత చారుతరాంబరచుంబి హర్మ్యసు
శ్రేణియు సంతతోత్సవ విశేషిత తూర్యనినాద సమ్మద
ప్రాణియు నౌచు ధీర నరపాల శిఖామణి పాలితంబు క
ల్యాణపురంబు భాసిలును లాలితలక్ష్మిఁ దనర్చి భూస్థలిన్. 30

చ. స్థిరమిథిలామహాపురి విదేహ విశాల యవంతి యక్షరా
ట్పుర మలకాఖ్యముం సమతఁబొందని కాశియు ద్వారకాపురిన్
సురనగరంబు నేఁ కరణిఁజూచిన నొప్పుత వాసి యందునే
గరమును దత్పురీసమతఁ గాంచునె యే పురియేని సుంతయున్. 31

చ. వర తదనంత శీర్షగృహబద్ధ వినీలరుచుల్ స్వకీయ సుం
దరతనురాత్రిశంకను సతంబును దోఁపఁ దదంతవాసితాం
బర సుపథంబునం జనెడుపట్టున శర్వరితో రమించుఁ జం
దురుఁ డవి చంద్రశాలలనఁ దోరపుఁబేరుల సత్యమై తగన్. 32

చ. ఘనతర విశ్వకర్మకుల కంధిసుధాంశులు భాసురాంజనా
తనయ లసద్ధ్వజుల్ వితత దానకళాఢ్యులు దేవ దేవరా
డ్వినుత చరిత్రశోభితులు విశ్రుతశౌర్యులునై వసింతు రా
జనపదమందు శిల్పకృతి సంజనితామిత కీర్తిధుర్యులై. 33

సీ. నలుమొగంబులఁగాని యల వేదముల నజుం
డొకముఖంబునఁ బల్కనోపలేఁడు
క్రవ్యాదులకు నిచ్చె ఘనవేద శాస్త్రముల్
గురునితోఁ గలహించి గరిమఁ గవియు
గణితాధ్వరుండయ్యె ఘనలక్ష్మి నెనయుచు
శతమన్యుఁ డమితాధ్వరతను గనె
సురపథ స్థితుఁడయ్యె గురుఁడు విద్యలు గల్గి
తనమాధ్య మొక్కొక్కతటి నుడిగెనె

గీ. యనుచుఁ దత్పురివరలు బ్రాహ్మణులు నిఖిల
వేదవేదాంగ విద్యల వెలసి మిగుల
సాటి యెవరిని రానీక సకల యాగ
కర్మనిష్ఠలఁ బొల్తురు గౌరవమున. 34

చ. హరి బలరూఢి నొప్పఁడు నిజాశ్రయముల్ దెగటార్చు వహ్నికా
నరగమనుండు క్రూరగుణసంగుఁడు మూలవసించు దైత్యుఁ డా
వరుణుఁడు సింధుసంగతుఁడు వాయువునుల్ దృణవాహి గుహ్యకే
శ్వరుఁడు గళద్విమానుఁ డరశక్తియె యీశున కంచు రా నృపుల్.35

చ. ధనదునిసొమ్ము శంఖమున దాఁపఁగఁ జాలెను మధ్యకాలమం
దున వశమయ్యె లక్ష్మి యల తోయజనాభున కర్థికిచ్చినం
తనె బలిభాగ్య మింకె నని తద్ద సహస్రఫణంబులెత్తి స
ద్ధనికు లనంతసంపదలఁ దాల్తురు వైశ్యు లుదారు లప్పురిన్. 36

చ. అల హరి గొల్లవాఁడు వృషభావళి మేపెడువాఁడటంచు నేఁ
డిలఁ దన పెద్దకాఁపుఁదనమేది సదండుఁడు నొచు వీటిలో
హలి తిరుగంగలేఁడనుచు నాతనిమాటల నొప్పి యెప్పుడున్
మెలఁగు గదుండటంచు మదిమెచ్చరు వారల వీటిపాదజుల్. 37

చ. నిజకుల ధర్మవృత్తి ఘననిష్ఠులు వైదికకర్మకోవిదుల్
రజత గిరీశ భక్తులు విరాజిత శక్తులు విశ్వకర్మవం
శజులగునట్టి కాంస్యకరచంద్రుల డెబ్బదియాఱు గేహముల్
సుజనవితాన లక్ష్యములు శోభనసంపదఁ బొల్చు నప్పురిన్. 38

క. భూవినుతకీర్తి మీఱఁగ
నావరపురి ధర్మపాలుఁ డనునామమున్తో
శ్రీవిశ్వకర్మకులజుఁడు
భావజరిపుభక్తుఁ డొకఁడు ప్రౌఢిమ వెలయున్. 39

ఉ. ఆయత మంత్రశాస్త్ర సకలాగమ భాష్య పురాణ శిల్పవి
ద్ధీయుతులైన విశ్వకర దివ్యకులోద్భవ కోటికెల్లఁ దా
రాయఁడనంగ మీఱి తన రారుచునుండు సమస్తలోకహృ
ద్గేయుఁడు ధర్మపాలుఁ డురుకీర్తివిశాలుఁడు తత్పురంబునన్. 40

సీ. అతనిగోష్ఠి వసింతు రఖిలజగన్మాన్య
శిల్పముల్ నిర్మించు శిల్పివర్యు
లతని విద్యల బృహస్పతినైన గెలుపొందు
పండితుండని బుధుల్ పల్కుచుందు
రతనిమంత్రప్రౌఢి నమరంగ వీక్షించి
యతిభీతమతులౌదు రమరవరులు
నతనిశిల్పప్రజ్ఞ నాలోకన మొనర్చి
యర్ధాసనంబిత్తు రఖిలనృపులు

గీ. నతని శిల్పకళాశాలయందు సృష్టి
నగ్ని జల వాయు యంత్రంబు లలరుచుండు
విశ్వకర్మయుఁ గామాక్షి వేడ్కమీఱఁ
దాండవము సేయుచుందు రా ధర్మసభను. 41

వ. అట్టి ధర్మపాల శిల్పాచార్యునకు. 42

సీ. రుద్రసేనుం డన భద్రసేనుం డింద్ర
సేనుండు నాఁగ సుషేణుఁ డనఁగ
నల్వురు కొమరులుఁ జెల్వమీఱఁగ నొప్పి
దశరథాత్మజులనఁ గుశలయశులు
వేదశాస్త్ర పురాణ వేదాంగ వేత్తలు
శైవ శిష్టాచార సారమతులు
శ్రీ జగద్గురువంశ సింధు సుధాకరు
లతిరూప విజిత పుష్పాయుధులును

గీ. చక్ర శూల గదా ఖడ్గ చాప పుస్త
భసిత రుద్రాక్ష ధరులును బ్రాహ్మవరులు
విజిత షణ్ముఖబల మహావీరవరులు
వరలుచుందురు తత్పురవరమునందు. 43

వ. వారలు నిజమూలపురుష మన్వాది జగదాచార్య గోత్ర సముత్పన్న
బ్రాహ్మణ వితానంబున కవశ్యకర్తవ్యంబగు లోకరక్షణానుకూల
శిల్పనిర్మాణ నైపుణ్యముం గఱపుచుఁ జిత్రరత్న విరాజమానబంగు
సభాంతరంబున వసించియున్నయెడ నొక్కనాఁడు. 44

గీ. ధర్మపాలునితోడఁ దత్తనయుఁడైన
రుద్రసేనుండు మహనీయ భద్రమూర్తి
ధరణి శరణాగతత్రాణ బిరుదమెట్లు
మనకుఁ గల్గెనన దండ్రి యనియె నిట్లు 45

చ. విను వరపుత్ర మున్ను ఘనవిక్రముఁడౌ భృగురామమూర్తి పెం
గినుకను గార్తవీర్యు నటు గీటడఁగించి తదీయసంతతిం
దనరెడు భూపవర్యుల నుదగ్రతఁ బాఱఁగఁద్రోల భీతులై
చని బహుదేశముల్ దిరిగి సాఁకఁగలారలఁ గాన కెయ్యెడన్. 46

ఉ. ఎక్కడ కేఁగినన్ మనుప నెవ్వరు లేరని భీతచిత్తులై
స్రుక్కుచు రేణుకాసుతుని శూరత కోర్వఁగలేక యీపురిన్
గ్రక్కునఁ జేరి వార లతికాతరతన్ మనపూర్వులన్ దగన్
మ్రొక్కుచుఁ దత్సభాస్థలిని మోములు వెల్వెలఁబాఱ నిల్వఁగన్. 47

క. కులమెద్ది వాసమెచ్చట
సులలిత నామంబులేమి చూడఁగ మిమ్మున్
బలహీన కాందిశీకుల
వలెఁ దోఁచెదరంచుఁ బల్కు బ్రహ్మకులజులన్. 48

చ. కనుఁగొని వారలిట్లనిరి గాఢపుభక్తిని హైహయాదిరా
డ్జనపదముల్ నివాసములు శౌర్యసమంచిత కార్తవీర్య స
జ్జనపతి బంధువర్గ్యులము చండపరాక్రమ జామదగ్న్యదో
ర్ఘన పరశుక్షతంబులకు గాసిలుచుంటిమి మీరె రక్షకుల్. 49

చ. ఇరువదియొక్కమాఱు లిల నెచ్చట నైనను నిల్వనీక దా
నురువడిఁ దాఁకి చక్కడిచె నుజ్జ్వలశౌర్యుల రాజవర్యులన్
బిరుదులు వీడి మేము కడుభీతిని మీదరిఁ జేరినాము మ
మ్మరసి కృపాతిరేకమున నాపదఁ బాపరె మీర లెయ్యెడన్. 50

క. చిచ్చఱపిడుగును బోలియు
వచ్చున్ దా భార్గవుండు వసుధాస్థలిలో
నెచ్చట నిల్వఁగనీయఁడు
పొచ్చెము లేకుండ మమ్ముఁ బ్రోవరె గురువుల్. 51

క. నరపాలు రటు లనంగాఁ
గరుణామయులైన విశ్వకర్మ కులజుల్
వరమందిరాంతరంబులఁ
గరమరుదుగ దాఁచిరపుడు కరుణను వారిన్. 52

క. తదనంతరమున వారలు
మదినెంచిరి యిపుడు బహుచమత్కృతితో స
మ్మదమొదవ సముచితోక్తులఁ
బొదలెడు భృగురాము మరలఁబుత్త మటంచున్. 53

ఉ. అంతట భార్గవుండు విలయాంతకుఁడో యన రాఁగఁ జూచి య
త్యంతముదంబు మీఱఁ గరుణైక గుణాధికులైన తద్బుధుల్
సంతత ధర్మశీలుని బ్రసన్ను నొనర్పఁగ నర్ఘ్యపాద్యముల్
సంతస మంద నిచ్చి విలసన్మణిపీఠ నివిష్టుఁ జేసియున్. 54

క. వేమాఱు మ్రొక్కులిడి తమ
ధీమహిమ దలిర్ప నపుడు దీప్యద్ధామున్
రామున్ సంగరకామున్
భీమున్ వినుతించిరపు డభీష్ట మెలర్పన్. 55

సీ. సకలలోకవరేణ్య సంశ్రితైకశరణ్య
నిహతదైత్యారణ్య మహితపుణ్య
కమలాసనాసక్త విమలాగమప్రోక్త
యమితాధ్వరోద్యుక్త విమలభక్త
యష్టాక్షరీ జపానుష్ఠాన సంభావ్య
తుష్టాంతరంగ విశిష్టసేవ్య
దేవ సదాశుద్ధభావ మహోహోద్వేల
తత కలుషారణ్య దావకీల

గీ. శేషఫణిశాయి సురసుఖాశేష దాయి
సామకృతగాన జగదేక సన్నిధాన
విబుధనుతకార్య స్వీకృత విపులశౌర్య
మేరుగిరిధైర్య యసమాన వీరవర్య. 56

చ. త్రిగుణములం ద్రిరూపములఁ దీరుగఁబూని త్రిశక్తి నొప్పఁగా
జగములఁజేయు తత్ప్రకృతిసాక్షివి నీవొక కారణమ్ముగన్
జగతిని గార్తవీర్యకుల సంహననం బొనరించుచుండినన్
దగులవు కర్తృభోక్తృతలు తావకతత్త్వ మెఱుంగ శక్యమే. 57

చ. పరమగుణాఢ్య లోకమునఁ బ్రాజ్ఞులు ప్రాక్తన కర్మవాసనాం
తర ఘనదుఃఖముల్ గెడప దైవమె కారణమంచు సుస్థితిం
బొరయఁగ మిమ్ము నమ్మి తనువుల్ జగదోఘ మనిత్యమంచు సు
స్థిరమతిఁ గొల్చి మోక్షమును జెంది సుఖింతురుగాదె శ్రీహరీ. 58

వ. అని మఱియు సకలాగమ పురాణోపదిష్ట ప్రకారంబుల నుతు
లొనర్చి కోపం బుపశమింపంజేయ నా జమదగ్నితనూజుఁడు దైవజ్ఞ
బ్రహ్మ కులాలంకారుల కిట్లనియె. 59

శా. నా యుగ్రత్వము నోపలేఁడు విధియున్ నాపేరు విన్నంతనే
పాయుం బ్రాణము లెల్లవీరులకు సద్భావంబుతో సంస్తుతుల్
సేయన్ భావము శాంతమయ్యె వరముల్ సేకూర్చెదన్ మీకనన్
ధీయుక్తిన్ భృగురామమూర్తికని రర్థిన్ విశ్వసృడ్గోత్రజుల్. 60

ఉ. ధారణిలోఁ బరోపకృతి ధర్మమటంచు భవాదృశుల్ సదా
ధీరు లుపన్యసించెదరు ధీవర యిప్డు వరంబుగాఁగ నీ
వారిరుహాప్తవంశజ విభంజనకార్యము మానుమన్న మే
లారని భార్గవుండరిగె నంతట రాజులు సమ్మదమ్మునన్. 61

చ. ఘనతరమైన మీకరుణ గల్గుటచే నిపు డేము నిర్భయం
బున మనఁగల్గినాము కృతపుణ్యు లగణ్యులు మీరు మీ యశం
బనుపమమౌ సతంబు శరణాగత రక్షకులంచు నెల్లెడన్
వినుతి వహింతు రెంతయును విశ్రుతకార్య నిరంతరాత్ములై. 62

గీ. అనుచు నా జగదాచార్యులను నుతించి
పరమహర్షంబుతో నల పార్థివేశ్వ
రులు గుమ్ములుగ్గాడి తమ తమ నెలవులకును
జనిరి వేవేగ నంతటఁ దనయ వింటె. 63

క. శరణాగత సంరక్షణ
బిరుదమ్ము తదాదిఁ గల్గెఁ బృథివి ననంగా
వర పుత్త్రుఁ డనియెఁ దండ్రికి
గురువిద్యారతికి లసదకుంఠిత మతికిన్. 64

చ. మన ఘన కాంస్యపాత్త్రలను మక్కువమీఱఁగఁ గోరువారికిన్
దనరఁగ విక్రయించుచు నుదారతమీఱ విదేశభూములం
గనుటకు వేడ్కపుట్టె జనకా యనఁగా నల ధర్మపాలుఁ డి
ట్లనియెను రుద్రసేనునకు నర్మిలిసూనునకున్ ముదంబునన్. 65

చ. ఘనులగు విశ్వకర్మజుల గ్రక్కున రమ్మని కాంస్యపాత్త్రలన్
బనివడి పూన్చుఁ డుష్ట్ర హరి వారణ సచ్ఛకటాళిమీఁద వే
చనఁదగు నీప్రయాణము లసద్గ్రహవీక్షణయుక్త లగ్నమం
దొనరుప లాభసౌఖ్యముల నొందఁగఁజాలుదుమయ్య పుత్త్రకా. 66

వ. అనిన విని రుద్రసేనుండు భద్రసేనేంద్రసేనులతోఁ గూడి మహా
వీరులగు శిల్పాచార్యుల రావించి మహాంగ తురంగ మాతంగ
సంఘంబులపైఁ బ్రశస్త వస్తు విస్తారంబు విన్యాసంబు చేయించి
కాశికాగమన సన్నాహుండయ్యె నంత. 67

సీ. రుద్రసేనుండును భద్రసేనుండును
ధర్మపాలుఁడు విశ్వకర్మసముఁడు
స్థపతివర్గంబెల్లఁ దగువాహనంబులఁ
బరికరంబులఁ బూని ప్రౌఢి దనర

నిష్టదైవంబుల నెలమి సంపూజించి
మృష్టాన్నమిడి యిష్ట శిష్ట తతికి
శోభనసంప్రాప్తి సూచనముల నిచ్చ
గించెదు మనముల మించి వేడ్కఁ

గీ. బురము వెల్వడఁ బయనంపుఁబోలుపు దనర
వేత్రహస్తుండు శాస్త్రకోవిదుఁడునైన
రుద్రసేనుండు ముందుండి భద్ర మలర
వరుస నడిపించె వారలఁ ద్వరితగతుల. 68

వ. అట్లు కతిపయ ప్రయాణము లొనర్చిన పిమ్మట. 69

క. అరిగిరి వారలు కాశీ
పురికిన్ ఘనపాపకంధి ప్రోన్నత తరికిన్
హరభక్త మోక్షకరికిన్
గురుభైరవ పాదపూత గోపురి దరికిన్. 70

క. చని వారలు కద్దంగా
ధునిలోపలఁ గ్రుంకులిడుచుఁ దోడ్తో జపముల్
పొనరించి వేడ్కఁ గాశీ
శునిపూజ లొనర్చి రపుడు శుంభద్భక్తిన్. 71

ఉ. అత్తతి నా మనీషులు మహత్తర కాంస్యసుపాత్రలం దగన్
బొత్తులువన్ని యంగడులఁ బొందుగనుంచి యొకొత్తుకంచు రెం
డెత్తుల హాటకంబునకు నిచ్చెడిపద్ధతి విక్రయింపఁగాఁ
జిత్తమెలర్పఁగాఁ గొనిరి చేరి పురప్రజ లెల్ల గుంపులై. 72

క. అటు విక్రయించుచుండఁగఁ
బటుశోభాకర కషాయ వల్కలుఁడు మహా
త్కటతేజుఁడైన ముని యొకఁ
డటు వచ్చెన్ జూచువారి కబ్రము దోఁపన్. 73

సీ. వేదవేదాంగ శాస్త్రాది కావ్యపురాణ
సర్వవిజ్ఞాన విశారదుండు
శతకోటి శశికాంతి తతి మించి వెల్గొంది
మితిమించు జిగి గల్గు మేనివాఁడు
భద్రాక్ష రుద్రాక్ష భసిత కృష్ణాజిన
దండ కమండలు మండితుండు
శిష్యమండలిచేత సేవింపఁబడువాఁడు
కాషాయశాటీ విభూషణుండు

గీ. నై ప్రకాశించు సంయమి యట్టె రాఁగ
భూరిమోదంబుతోడ జోహా రొనర్చి
యర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
యతివరున కిట్టులాడి ర య్యనఘమతులు. 74

ఉ. మీరు సుపర్వలోయనఁగ మిన్నుననుండియు తెప్పపాటునన్
జేరితి రీ సభాస్థలికి సిద్ధవరా మిముఁ జూడ నేఁడు మా
ఘోరతరాఘపుంజములు గొబ్బునఁ బాఱె సుఖైకసంపదన్
గేరితి మేము కన్నుఁగవ క్లేశము వాయఁగ నో యతీశ్వరా. 75

క. మీ సుభగనామ మెయ్యది
వాసం బెచ్చటను మీరు త్వరితగతిని వి
చ్చేసినపని యేమి రొకో
భూసురవర యన యతీశముఖ్యుఁడు వల్కెన్. 76

మ. వరకాంచీపురవాసుఁడన్ వినుఁడు మద్వంశంబు బ్రాహ్మ్యంబు శం
కరనామంబున నొప్పువాఁడ విలసద్గంగావగాహక్రియా
పరతన్ వత్తు నజస్ర మిచ్చటికి భవ్యప్రౌఢ యోగంబునన్
బరమాహ్లాదముతో జగద్వినుత శిల్పబ్రహ్మవంశాగ్రణుల్. 77

క. మీ చిత్రవస్తు సంతతిఁ
జూచుట నామోద మొదవె శుభగుణులారా!
యేచెంతఁ గాన మీపని
నీ చతురత నెన్నఁదరమె యిల నెవ్వరికిన్. 78

క. మా దక్షిణ దేశంబున
లే దీ సద్వస్తు రచన లేశం బయినన్
మోదంబుఁ గూర్పఁగల యీ
మాదిరి సచ్ఛిల్పరచన మానితము గదా! 79

ఉ. మీరలు కాంచికాపురికి మేళనతోఁ జనుదెంతురేని సం
సారులు కాంస్యవస్తువులఁ జాలధనంబు నొసంగి కొందు రే
చోరులు లేరు మార్గమున శోభన సంపదలున్ ఘటిల్లు మీ
కోరెడు కోర్కె లన్నియు నకుంఠితరీతిఁ దనర్చు నెంతయున్. 80

ఉ. రంగ దరాతి కోటి గళ రక్త విరాజిత ఖడ్గపాణి యు
త్తుంగ మతంగజోరు మదతోయజ కర్దమ చత్వరుండు స
త్సంగుఁడు ధర్మ మింపొదవఁ దత్పురిఁ బాలనసేయుచుండు చో
ళాంగుఁడు మిమ్ము సత్కృతుల నర్చలొనర్చు నితాంతభూతితో. 81

ఉ. కుక్షిగతాబ్జజాండ రవికోటి విరాజిత కాంతి రమ్య కా
మాక్షి శుభంబులిచ్చు వరదాఖ్యుఁడు శౌరి కృపారసైకస
చ్చక్షులఁ జూచు మోక్ష మొకసారి భజింపఁగ నేకమ్రాత స
ద్వృక్షవిభుండుఁ గూర్చుఁ గనదిందుకళాభరణుండు వేడుకన్. 82

క. ఇహపర సౌఖ్యము రాజుల
బహుమానము ద్రవ్యలాభ బహుళయశంబుల్
మహిఁ గల్గు మీకుఁ దత్పురి
విహితంబుగఁ జూడఁ గనుల విం దొనగూడున్. 83

వ. అను నా శంకరునితోఁ గాంచీపట్టణ చరిత్రంబును జగజ్జనని యగు కామాక్షీదేవి మాహాత్మ్యంబును సవిస్తరంబుగా నానతీయుం డన నా ధర్మపాలున కా శంకరయోగి యిట్లనియె. 84

సీ. కాంచీపురమ్మేలు కార్తవీర్యార్జునుం
డంబికాధవుఁగూర్చి యమిత తపము
సేయ నా హరుఁడు మెచ్చితిఁ గోరు వరమనఁ
గైలాసమును వీడి కాంచియందుఁ
గాఁపురంబుండి నా కాంక్షఁ దీర్పు మనంగ
నట్టిలే యని శంభుఁ డాన తిచ్చె
నది యటులుండ దాక్షారామమున సతి
దక్ష యజ్ఞంబున దగ్ధ యగుటఁ

గీ. గాంచి శంకరుఁ డా విశ్వకర్మ మదిని
వేదవాక్యార్థములఁ గడు వినుతి సేయ
వేగఁ బ్రత్యక్షమైన నా వేదమయునిఁ
గాంచి మ్రొక్కుచు నిట్లనె గరళగళుఁడు. 85

తే. గీ. కార్తవీర్యుండు వేఁడ నేఁ గంచిపురిని
నుండ నిచ్చితి వరము నిం కొకటి వినుము
దక్షసుత యధ్వరమునందు దగ్ధ యయ్యెఁ
గాన మిం దేమి సేతు నా కాన తిమ్ము. 86

వ. అనుటయు నా లోకగురుండగు విశ్వకర్మ నిజాంశరూపుండయిన శివుని వినయాలాపంబులకు సంతసించి శంకరా! కాంచీపురంబున నీ వేకామ్రేశ్వరుండను నామధేయంబున నుదయింపు మనియు ననంతరము దాక్షాయణీదేవి మదాజ్ఞఁ గామాక్షి యను నామంబున నవతరించి నిన్నుం గలియుననియుఁ బదంపడి యమ్మహాదేవి

కార్తవీర్యార్జునుని స్వప్నంబున సాక్షాత్కరించి యేతద్వృత్తాంతంబు నానతిచ్చుననియుం జెప్పి యంతర్హితుండయ్యె - అంత నా పురాణదంపతులు తదాజ్ఞానుసారంబుగాఁ గాంచీపురంబున శిలారూపంబుల నవతరింప శివభక్తాగ్రేసరుండును జతుస్సాగరపరివేష్టిత భూచక్ర పరిపాలకుండును నగు కార్తవీర్యార్జునుని స్వప్నంబున నమ్మహాదేవి ప్రత్యక్షంబై యేతద్వృత్తాంతంబు సవిస్తరంబుగా నానతిచ్చుటయు నా భూవరుండు ప్రముదితాంతరంగుండై యమ్మహాదేవికి నమస్కరింప నా యుమాదేవియు ముదితాత్మయై యంతర్ధానంబు నందె నంత నా రాజోత్తముండు మేల్కాంచి మహానందంబునఁ దచ్ఛిలారూపంబుల నవతరించిన పార్వతీపరమేశ్వరులకు భర్మమయ ప్రాకారంబులఁ జెన్నారు దేవళంబు నిర్మాణంబు గావించెఁ దత్కారణంబునంజేసి తత్పురవరంబు భూలోక కైలాసంబు నాఁ బరఁగుటయు కాక తదాలయంబుల నే మానవుండు దర్శనంబు చేసికొను నాతండు పునర్జన్మరహితుండై శాశ్వత లోకంబు నెందునని ధర్మపాలాదుల కెఱింగించి మఱియు నిట్లనియె. 87

క. కాంచీపుర సుక్షేత్రముఁ
గాంచినమాత్రమున సకలకలుషము లడఁగుఁ
గాంచికి సరియగు క్షేత్రముఁ
గాంచఁగ వలె నన్న ధరణిఁ గానంబడునే. 88

మ. అన నా సంయమిశేఖరశ్మికి మహాహర్షంబు సంధిల్లఁగా
వినయప్రౌఢి దలిర్ప నిట్లనిరి య వ్వీరాగ్రగణ్యుల్ తపో
ధన మీదర్శనభాగ్య మబ్బుటను జెందంగంటి మిష్టార్థ మో
యనఘా మామక పూర్వపుణ్యమిది శక్యంబౌనె వర్ణింపఁగన్. 89

వ. అని వార లనేకప్రకారంబుల శంకరుం గొనియాడి తన్మునిసహితంబుగా గంగానదికిం జని స్నానంబాచరించి సంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి తమ నివాసంబులకుం జని సబాంధవంబుగ షడ్రసా

న్నంబుల శంకరుం బరితృప్తుం జేసి సుఖాసీనుం గావింప నమ్మౌని
చంద్రుం డానంద కందళిత హృదయారవిందుండై యున్నతఱి ధర్మ
పాలుం డిట్లనియె. 90

క. క్రమ్మఱ మత్పురికిం జని
యిమ్ముగ సద్వస్తువితతి నేర్పడఁ గాంచిన్
సమ్మతిని గాంచి మీా సము
ఖమ్మున కేతెంచెదము సుఖమ్మున మానీ ! 91

క. అని వినయమ్మునఁ బల్కఁగ
ఘనమోదముతోడ మానికాంతుఁడు సనియెన్
మనవీటి కరుగ యత్నము
లనువుగ సేయుఁ డన వార లతిముద మొదవన్. 92

తే. గీ. మిగిలియున్నట్టి వస్తువుల్ దగిన దీన
జనములకు నిచ్చి స్వార్జిత ధనముతోడ
నాగ శకటాదులను దోల్త నడువఁజేసి
చనిరి కళ్యాణ నగరికి సంభ్రమమున. 93

వ. అంత నా ధర్మపాలాదులు నిజ నివాసంబులఁ బ్రవేశించి జనోప
యుక్తంబగు వస్తుజాలంబుల నిర్మాణంబు గావించి కాంచీపుర
సందర్శన కుతూహలాయత్తచిత్తులై యుండ. 94

ఉ. అంత వసంత మొప్పె సలతాంత వనాంతరసీమ కాక నా
సాంత విఘృష్ట బాధిత పికార్భకరమ్య నితాంత రావ సం
క్రాంత దిగంత మాచు రతికాంతుఁడు పాంథుల నైజసుందరీ
స్రాంతముఁ జెందఁజేయు ననివార్యమహత్తర మంత్ర మో యనన్. 95

సీ. చిగురాకు మేసి హెచ్చినకేవిఁ గోయిలల్
దనరెను బంచమ ధ్వను లెసంగ
మంచిపండుల నారగించిన కీరముల్
కలకలంబులు సేయఁ గడఁగె లతలఁ
బూఁదేనె లాని యింపు దలిర్ప మధుపాళి
కావింప సాఁగె ఝుంకారము లను
గ్రొం గ్రొత్త సామగ్రిఁ గొని తీయవిల్కాఁడు
విరహుల బెదరింప మురిప మొందె

గీ. సంతత లతాంత సంతతుల్ సకల దిశల
నబ్బురపుఁదావులను జిమ్మె నాత్మశక్తిఁ
దన బలం బెంతొ యభివృద్ధిదశల నొంద
నలరినాఁ డెంతయేని న య్యామని దొర. 96

సీ. అభినవ మధుర పుష్పామోదములఁ జిమ్మ
ధారణీరుహము లే తట్టుఁ గనినఁ
బ్రసవసౌరభ్య సంపద హాయి నొనగూర్చు
దివ్యమారుతము లే దిక్కుఁ గనిన
నవగాహయోగ్య జలాభిరమ్యంబులై
సుఖమిచ్చు కొలఁకు లెచ్చోటఁ గనిన
నాత్యుష్ణ శీతగుణాశ్రయతఁ బొల్చు
కమ్ర వారంబు లే కడను గనిన

గీ. పల్లవోత్ఫుల్ల సుమ ఫల భవ్య వస్తు
సంపదలు మీఱి మోద మొసంగుచుండె
మాధవుం డేపు మిగిలెను మాధవుండు
పంచబాణున కాత్మీయ బంధు వనఁగ. 97

చ. శరము లొసంగెఁ గంతునకు సారతరామ్రము లంతఁ బంచమ
స్వరముల మించె మూఁకలుగ వర్తిలు కోకిల లెల్ల తాఁగలై
పరగ శుకవ్రజంబు ఫలవత్తరులం దగ నాశ్రయించె బం
భరములు ముద్భరమ్ములయి పాడుచునాడఁగఁజొచ్చెఁ గొమ్మలన్. 98

క. దక్షిణ వాతంబులు నిశి
దక్షములై వీవఁ దొడఁగెఁ దద్దయు వేడ్కన్
దక్షిణులు ప్రియులు తమ మది
రేక్షణలం దనిపినా రభీష్ట రతులచేన్. 99

చ. క్రమమున నవ్వసంత నవరాత్రములన్ బ్రణవప్రయుక్త ది
వ్యమహిత మంత్రరాజముల భవ్యపునశ్చరణంబు లొప్పఁ డెం
దములను గామనేత్రకు మనఃప్రియ మొప్పఁగఁ బూజ సల్పి ర
య్యమర పురోహితాన్వయ సుధార్ణవపూర్ణశశాంకు లయ్యెడన్. 100

వ. అంత నమ్మహాశయులు. 101

క. కాంచీపుర వర యాత్రకుఁ
గాంచన సత్కాంస్య రజత ఘనలోహములన్
మించి బహు చిత్రరీతుల
నంచిత సద్వస్తురచన లటు సల్పి రొగిన్. 102

వ. పిమ్మట ధర్మపాల రుద్రసేను లాత్మీయ మందిరంబునకు సకల
కళాభిజ్ఞుల రావించి. 103

సీ. కులదైవముల నెల్ల వెలయంగఁ బూజించి
మృష్టాన్నమిడి మహా శిష్టతతికి
రజత కాంచన తామ్ర రమ్య కాంస్యాదిక
కృత మహత్తర వస్తువితతి నొసర

తురగ మతంగజ వర శకటంబుల
సంచులఁ దులఁ దూఁచి యెంచి పన్ని
కాంచీపుర ప్రయాణాంచిత మతితోడ
నుండుఁడు దొరకొను మెండు శుభము

గీ. కదలుదము రేపు తగిన లగ్నంబు గానఁ
గాంస్యకరులార యన విని కడుముదమున
నమ్మనీషులు తదనుజ్ఞ నంది వేడ్కఁ
గడఁగి పయనంబు సాఁగింపఁ దొడఁగి రంత. 104

సీసమాలిక.

పళ్లెముల్ కోరలు పాలమండలు దొడ్డ
మెఱుఁగు గంగాళముల్ మేల్గరిటెలు
పాళెము ల్వేన వేల్ పాఱగిన్నెలు రమ్య
ధూప దీపార్తులు దొడ్డగంట
లల నిల్వుటద్దముల్ నిలువుచెంబులు పెక్క
పడగమంచంబులు పొడవులైన
దీపపుఁ గంబముల్ దివ్యభృంగారువుల్
శృంగపాత్రంబులు రంగు దనరు
లోనంచు బిందెలు పానక చషకముల్
సవన పాత్రలు ప్రశస్తంబులైన
పన్నగాభరణముల్ భవ్యవిగ్రహములు
(శ్రీ) చక్రములు గడుఁ జెల్వమీఱు
యంత్ర పత్రంబులు నల గ్రామదేవతా
ఘట సమూహంబులు పటుతరములు
ద్వారపాలక రమ్యతర విగ్రహంబులు
కుంభకోణపు మెడ కుఱుచ చెంబు
లన్నపూర్ణా మూర్తు లక్షయ పాత్రముల్
హరివాణములును సుందరములైన

యాధునికపు జగన్నాథపు లోటాలు
భక్ష్యాదికారక పాత్రచయము
మ్రుగ్గులీగెలఁ బొల్చు మురిపెంపు గొట్టముల్
కరదీపికా తైల కమ్ర పాత్ర

గీ. లమర గజ ఘట పటు శకటాశ్వములను
ముందుఁ దులఁ బూని సమకట్టి పొందుపఱచి
కాంచికాపుర యాత్రాభి కాంక్షు లగుచుఁ
గ్రాలి రప్పుడు తద్విశ్వకర్మ కులులు. 105

ఉ. అంతట ధర్మపాలుఁడు మహా మతిమంతుఁడు భద్రసేనుఁడుః
శాంతుఁడు నింద్రసేనుఁడును జారుగుణాఢ్యుఁడు రుద్రసేనుఁ డ
త్యంత సుధీసుషేణుఁడు పురాంతకు నిశ్చలభక్తిఁ గొల్చి శ్రీ
కాంతను గామలోచన నఖండిత భక్తి భజించి రెంతయున్. 106

వ. పిమ్మట నా ధర్మపాలుండు తన కుమారులగు రుద్రసేన భద్ర సేనేంద్రసేనులతోఁ గూడఁ గాంచీపురంబునకుఁ బోవ నిశ్చయించి యేతద్వృత్తాంతము మీ తల్లియగు సుగుణాంబికకును మీ కుల కాంతలకు నెఱింగింపుఁ డనుటయు వారు వల్లెయని తద్వృత్తాంతముఁ దమ తల్లికిని ధర్మపత్నులకు నెఱిఁగింపఁ దల్లి వారల నాశీర్వదించె. ఆ వనితలు తత్ప్రయాణోద్యమం బాలించి చింతాక్రాంతలైయున్న వారిం గాంచి యో సతీమణులారా! వినుండు మన గృహాంగణంబున నున్న చంపక వృక్షత్రయంబును మమ్ముం బలె మీరు ప్రతి దినంబును బూజ సల్పుచుండుఁడు. అయ్యవి యెంతకాలంబు దనుక పత్రపుష్పసహితంబుగ విరాజిల్లుచుండు నంతదనుక మేము సుఖంబున్నవార మనియు నవి కళాహీనంబు లయ్యేనేని మాకుఁ బ్రమాదంబు సంభవించె ననియు నెఱుంగునది యని వాక్రుచ్చి వారల నోదార్చి ప్రయాణోన్ముఖులై యున్నయంత. 107

గీ. ధర్మపాలుండు కడగొట్టు తనయుఁడైన
యాసుషేణునితోఁ బల్కె నాదరమున
రుద్రసేనాదులను గూడి భద్రముగను
గంచికిం జని వచ్చెదఁ గడు రయమున. 108

చ. వినుము సుషేణ నీవు మది భీతి వహింపక యింట నుండిమీ
జననిని భ్రాతృపత్నులను జక్కఁగఁ జూచుచు సంతసంబునన్
ఘనముగ బంధుమిత్రులను గౌరవ మొప్పఁగఁ గాంచుచుండ సదా
మన ఘన సర్వసంపదల మార్పును జెందఁగ నీక చూడుమీ. 109

వ. అని బంధుమిత్రాదులకు హితవాక్యంబులు సెప్పి పతివ్రతా తిల కంబులగు భార్యకును గోడండ్రకును ధైర్యంబులు వలికి వారి నమస్కృతులఁ గాంచి యాశీర్వదించెఁ ద దనంతరంబ. 110

ఉ. అంగద రమ్య రత్న కటకాంగుళి భూషణ మౌక్తిక ప్రభా
రంగదశేషహార సువిరాజితులై ఘన భూతిరేఖ స
ర్వాంగములందుఁగప్పి వెలయంగ శుభమూర్తులునాఁగ వారలా
భృంగిసమానులై మిగులఁ బ్రీతిదలిర్పఁగఁ గాంచి కేఁగఁగన్. 111

సీ. ఘన దుకూలంబులు పెనుకుచ్చెల లమర్చి
కాసె కోకలు పైని వాసి నునిచి
గన్నెరు పూడాలు గల మేలి సాలువుల్
వలెవాటుగా భుజంబుల నమర్చి
వెడఁద యురంబుల బెడగారు నూతన
రత్నహారంబుల రహిఁ ధరించి
బాలచంద్రుని సౌరు పరగు ఫాలంబులఁ
గుంకుమ తిలకముల్ గుదురు పఱచి

గీ. చెల్వు మీఱంగ నెంతయుఁ జెల్మి మిగుల
ధరణ కోలలఁ జేఁ బూని ధర్మపాల
సుతులు తక్కిన కాంస్యకృత్తతులఁ గూడి
పురము వెడలిరి కాంచికా పురికి నేఁగ. 112

మ. పరిఘల్ చెల్వగు కత్తళంబులు ధనుర్బాణంబులున్ ఖడ్గముల్
గురుచక్రంబులు పట్టుకోలలు మహోక్రూరోజ్జ్వలచ్ఛూలముల్
గరిమం బూని బలంబు నద్దెసలకుం గాపుండెఁ దత్సేనకున్
వరభాస్వద్ధనుమత్పతాక యెదుటన్ వాటంబుగాఁ గన్పడన్. 113

వ. అట్లు రుద్రసేనాదులు కాంస్యపాత్రాది పూరిత ఘన శకట మాతంగ
సంఘంబులతోడఁ జను సమయంబున. 114

క. వెంట నరుదెంచు పౌరుల
నింటికిఁ జనుఁడంచుఁ బనిచి యెంతయుఁ బ్రీతిన్
గంటఁ గనరాని దూరము
మింటికి రజ మెగయఁ జని రమిత వేగమునన్. 115

మ. విరిగొమ్మల్ విలసిల్లు తంగెడు మహీజవ్రజంబు గానంబడెన్
వరుసన్ దీర్చి పయఃపతత్రియు భరద్వాజంబు సవ్యంబుగా
నరుదెంచెన్ శునకంబు నోట నెముకన్ హత్తించి రాఁ జూచి స
త్వరుఁడై పల్కెను రుద్రసేనబుధుఁడంతన్ ధర్మపాలాఖ్యుతోన్. 116

గీ. మొదటి శకునద్వయం బతి మోదకరము
తుది శకున మశుభంబుగాఁ దోఁచె నాకు
దూరయాత్రకు నిందఱితోడఁ జనుట
కంతరంగము వ్యాకుల మగుచు నుండె. 117

వ. అనుటయు. 118

క. శునకంబు శుభకరం బగు
నొనరంగా నెమ్మిఁ గనుట నొగి సత్కీర్తిన్
గొనుదు రనెఁ దండ్రి తనయుఁడు
వినయంబునఁ గాంస్యకార వీరుల కనియెన్. 119

మ. వినుఁ డుద్యోగి కసాధ్య మెయ్యది జగద్విఖ్యాతకృత్యంబులం
దనువర్తింపుఁడు మీరు సంశయసమాయత్తాత్ములౌ వారు వే
చనుఁ డాత్మీయగృహాంతరంబులకుఁ బ్రాగ్జన్మక్రియా ధీనమై
తనరుం గాదె శుభాశుభంబు లెచటం దర్కింప నెవ్వారికిన్. 120

వ. అను నంత నా రుద్రసేను వచనంబులు. 121

క. విని కొందఱు నిజగృహముల
కును నేఁగిరి ధైర్యమునను గొందఱు గుములై
ఘన రుద్రసేన ముఖ్యుల
వెనువెంటం జనిరి యంత విధివశ మనుచున్. 122

వ. అంత నా జగద్గురుకులోద్భూతులగు ధర్మపాలాదులు సన్నాహంబు
తోడఁ జని చని మక్కువలెక్కువలై మీఱుచున్న సుమనస్సంసేవ్య
మానయగు యమునానదిం జేరి మహోత్సాహంబున దేహంబు
లుప్పొంగ జలావగాహనంబు చేసి మగధోత్కల కళింగాది
దేశంబులఁ గతిపయప్రయాణంబుల దాఁటి సింహాద్రిం జూచి యచట
నుండి కదలి పదంపడి మహిత ఖర్జూర జంబీర ద్రాక్షాలతా కదళికాభి
రామంబును దర్శన మాత్రంబున విదళితాశేష పాతకంబును
గోపుర కుక్షిగత మహోత్కృష్టకేతనంబును నక్షీణ సుకృతసంధానాభి
రామంబును నై విలసిల్లు దాక్షారామం బను పుణ్యక్షేత్రంబు నవ
లోకించి నిజభక్తమనోరథప్రదాయకుండును సోమకళాధరుండును
నగు భీమేశ్వరుం దలంచి జోహారు లొనర్చి యాహారంబులం బాసి
తత్కామసంహారునకుఁ గాంచనమయోదంచిత పంచఘంటికావిలా

సోపహారంబు లొసంగి పంచరాత్రంబు లందుండి యచ్చటనుండి కదలి వియత్తరంగిణీమిళత్తరంగసంబద్ధ కదళికావన గంధవాహ సంగతయు మజ్జనమాత్రాపహృతపాతకయు నగు గౌతమీతటంబున విరాజిల్లు రాజరాజనరేంద్రపురంబు సేరి మహామహిమాఢ్యుండైన మార్కండేయేశ్వరునకుం బ్రణామంబు లాచరించి యందుండి కదలి వర రసాల మంజుల మాతులుంగ లవంగ లుంగ వకుళ కుటజ కులక కదళికా జంబీర ప్రముఖ తరు సుముఖంబును రాజీవరాజీవిరాజమాన మహనీయ సరోవర మండితంబును నగు శ్రీరారామమండలంబుఁ బ్రవేశించి యా విశ్వకర్మకులావతంసులు సోమకలాభాస్వరుండగు రామలింగేశ్వరుఁ బూజించి తత్పురవరోత్తరదిగ్విరాజమాన మనో రంజక కనకహర్మ్య నామక జనపదంబుం గని నిత్యకల్యాణవిలసిత మహోత్సవ విరాజితుండగు నగస్త్యేశ్వరు నత్యంత ముదంబున స్తోత్రంబు గావించి యచ్చోటు వాసి కృష్ణవేణిం గృతస్నానులై విజయవాడ దుర్గంబున వసియించియున్న యపవర్గదాననిసర్గ యగు కనకదుర్గ ననర్గళభక్తితోడం బ్రార్థించి యచటనుండి కదలి మహా రణ్య దుర్గంబులఁ గడచి యభ్రంకషంబై హేమనిర్మితంబై వెలుంగు శ్రీశైలశిఖరంబు దర్శించి పునర్జన్మరహితుల మైతిమని సంతసించుచు నంత శ్రీతరుణీవిభు చరణసంజాతయుఁ బంచతాళ నిమ్నయు భూతబేతాళబాధాపహారిణియు నై విరాజిల్లు పాతాళ గంగలో మునిఁగి సంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చుకొని సహస్రాక్ష ప్రముఖ దేవతానమస్కృతయుఁ జితభ్రమరకుంతలశోభితయు నగు శ్రీశైల భ్రమరాంబికాదేవిని మల్లికార్జున స్వయంభూలింగంబును నిగమోక్తప్రకారంబులఁ బూజించి యటనుండికదలి దక్షిణకాశియని ప్రసిద్ధిఁ జెంది లోకైకశరణ్యంబై భూలోక కైలాసంబు నాఁబడు శ్రీకాళహస్తిపురిం జేరి యీశ్వరాలయంబునకుఁ బశ్చిమభాగంబున నుత్తరాభిముఖియై ప్రవహించు స్వర్ణదీసన్నిభ సువర్ణముఖీజలంబుల స్నానంబు సేసి నిత్యోచితకర్మంబుల నిర్వర్తించి దర్శనమాత్రం బున సకలశాస్త్రరహస్యంబులం దెలుపు వివిధశిల్పవిగ్రహప్రదర్శక

చతుర్గోపురోన్నత ప్రాకారమార్గంబును గడచి ప్రమథవిగ్రహ సందోహంబుచే నిండియున్న మంటపంబుల వీక్షించుచు సురాలయ సదృశంబగు నీశ్వరాలయంబుఁ బ్రవేశించి బాలశైవాలోపమ జటావళీ విరాజమాన గంగాతరంగిణీ చంద్రకళా కలాపుండగు శ్రీ కాళహస్తీశ్వరుని నిజ పంచశత ఘంటికా (లిఖ్య) ధ్వన్య మాన శతఘంటికల (?) నొసంగి మహాన్యాసవిధుల నభిషేకంబు గావించి నిర్మలచిత్తమ్మునఁ దుమ్మిపుష్పంబులఁ బూజించి యజ్ఞాన తమఃపటల తటిల్లత యనంబరగు విజ్ఞానపీఠేశ్వరి జ్ఞానప్రసూనాంబను పారిజాతప్రసూనంబులఁ బూజించి యాజగద్గురు కులాగ్రగణ్యులు ముచ్చటగా నచ్చటు గదలి భోజనంబులు గావించి నాఁటిరేయి నిదురించుచున్న ధర్మపాలుని స్వప్నంబున భస్మోద్ధూళితవిగ్రహుం డగు మహాపురుషుండొకరుండు గన్పించి ధర్మపాలా! జగచ్ఛిల్ప నిర్మాణచతురుండగు విశ్వకర్మదేవుండు దర్శనమాత్రంబున సకల జనపాతకహరంబై ముక్తిభుక్తు లొసంగుటకుఁ బవిత్రంబులగు శిలా విగ్రహంబులకు దేవత్వమహత్త్వముం గల్పించె నట్టిమహత్త్వంబు శిల్పకర్మలయం దావిర్భవించి త్రైలోక్యపూజితంబై దేవాసుర మునిజనాభీష్టప్రదంబులగు నష్టసిద్ధులకాస్పదంబై యున్నయది. సర్వ శిల్పంబులు నీకును హస్తగతంబులు గావున నిటకు సమీపంబున నున్న సుబ్రహ్మణ్యేశ్వర నివాసంబగు తిరుపతి మహాక్షేత్రంబునఁ ద్రిమూర్త్యాత్మక స్వరూపుండును రామానుజ పరికల్పిత వేంకటేశ్వ రాభిధానుండునగు సుబ్రహ్మణ్యేశ్వరుని యాలయం బొకటి కలదు. అయ్యది పూర్వదేవతా ప్రతిష్ఠితంబై ప్రాచీనంబగుటచే నందుఁ బూర్వశిల్పాచార్య నిర్మితంబులగు జనధనాకర్షణాది యంత్రంబులు జీర్ణంబు లయ్యె నిక్కారణంబున భూజనంబు లమ్మహాదేవునిఁ బూజించి పాతకల్మషులగుతలంపు క్షీణంబగుటయే కాక యప్పర్వత విపినమార్గంబులఁ గ్రూరమృగోరగ భూతగణంబులును విహరించు చుండెఁ గాన మీర లద్దేవునిఁ బుత్రమిత్రాదులతో దర్శించి దేవాలయంబందుండు జీర్ణయంత్రంబులఁ దెరల్చి నవీనయంత్రంబుల

మయమతాగమోక్త విధానంబునఁ బునరుద్ధారణంబు సేసి తద నంతరంబ కాంచీపురంబు సేరుం డనియు నట్లొనర్చిన సుస్థిరకీర్తు లయ్యెద రనియుం బల్కి యమ్మహాపురుషుం డంతర్ధానంబందె,-నంత ధర్మపాలుండు మేల్కాంచి స్వప్నం బని తలంపక మహాదేవు వాక్యంబులుగా గ్రహించి మహానందంబున నేతద్వృత్తాంతం బంతయు రుద్రసేనాదుల కెఱింగించి యటనుండి కదలి చంద్రగిరి పురంబుఁ బ్రవేశించి యా రాత్రి యందుండి ప్రాతఃకాలంబున సకల వాహనంబులతోఁ గదలి తిరుపతి మహాక్షేత్ర దర్శన కాంక్షా పరవశులై నడచుచు నచలభావంబునఁ జక్రిపర్యంకంబైయున్న చతుశ్శ్రీవంబుగాఁ దోఁచు సప్తోర్వీధర ప్రాకార మధ్యస్థలంబునఁ గైలాసశిఖరోన్నతంబై కన్పట్టు గోపురశిఖరంబుల వీక్షించి తద్దేవాలయంబునకుఁ బశ్చిమభాగంబున మలయమారుతముచేఁ జలించు చందనవృక్షంబుల పరిమళంబుచేఁ గప్పంబడిన నంద నోద్యాన వనంబునఁ బ్రవేశించి యందుఁ గదళికాద్యఖిల ఫలభూరు హంబులఁ గానంబడు శుక పిక మయూరాది కోలాహలంబునకు సంతసించుచు నటనున్న హనుమదాలయ సమీపంబునఁ గల వట వృక్షంబుక్రింద నివసించి పంచమహాపాతక విదారి యగు పంచ పాండవక్షేత్రంబున కరిగి గోగర్భతీర్థంబున స్నానం బాచరించి నిత్య విధులఁ దీర్చికొని షడ్రసోపేతంబుగా భుజించి యా రాత్రి సుఖంబుగా నట నుండి ప్రాతఃకాలంబున లేచి పాపనాశినీ బ్రహ్మతీర్థాకాశ తీర్థంబుల జలకంబు లాడి మార్గమధ్యంబునఁ గానంబడు దీనజనంబు లకు దానంబు లొసంగి సుబ్రహ్మణ్యేశ్వరాలయంబునకు నుత్తర భాగంబునఁ గల పుష్కరిణీసరోవరంబున మునింగి శుభ్రవస్త్రంబుల ధరించి భస్మధారణంబు సేసి సకలదేవతావిగ్రహంబుల కాలయంబై ముని జన విగ్రహంబులకు ముఖ్యంబై సింహశరభశార్దూలాది విగ్ర హంబులచే నవరసాలంకారభరిత చిత్రశిల్పంబులు గల గోపుర ద్వారంబు దాఁటి సింహవృష భమయూర గజవాహనంబులతో నిండియున్న శిలామంటపం బారయుచు గర్భాలయంబున వేదగోష్ఠిం

ప్రవేశించి యద్దేవదేవుని సహస్రనామంబుల బిల్వదళయుతంబుగాఁ బూజించి కర్పూరనీరాజనంబు లర్పించి సకలలోక జన పాతక హరుండును శంఖ చక్ర త్రిశూలాయుధ ధరుండును నభయవరద హస్తుండును నాగాభరణుండునునగు సుబ్రహ్మణ్యదేవునిఁ బూజించు జనసామాన్యంబునకుఁ జింతిల్లి స్వప్నంబునఁ గాంచిన మహాపురుషుని వాక్యంబులు వేదవాక్యంబులుగాఁ దలంచి సకలభూతాధ్యక్షుండగు విశ్వకర్మదేవుని వేదమంత్రంబుల ధ్యానించి భూశోధనంబుఁ గావించి సుబ్రహ్మణ్యదేవుని సన్నిధానంబున జన ధనాకర్షణాది యంత్రంబులు శిథిలంబులగుట గ్రహించి నందనవనంబున కరిగి శుభ గ్రహవీక్షణయుక్త లగ్నంబున నిష్ఠాగరిష్ఠులై జీర్ణయంత్రంబులఁ బునరుద్ధారణంబు సేయం దలంచి పంచలోహంబులచే యంత్రపత్రంబులఁ గావించి సిద్ధమూలికా సారంబులఁ బరిశుద్ధి సేసి మయమతాగమ శిల్ప శాస్త్రోక్త ప్రకారంబున జనధనాకర్షణ వశ్యత్వంబులకు జగన్మోహన గణేశ భైరవాది యంత్రంబులఁ దీర్చి ప్రణవయుక్తంబుగఁ బంచభూతబీజంబులు లిఖించి యఖిలకర్మారంభోపాసనమంత్ర స్వరూపులగు పంచబ్రహ్మల నారాధించి దేవదానవానీకంబున కభేద్యంబగున ట్లక్షీణంబుగా గర్భాలయ మూలస్థానంబున నయ్యంత్రంబుల స్థాపించి క్షేత్రదర్శన కాంక్షాపరవశులగు మానవులకు క్రూర మృగోరగ భూత బాధాపహరణం బగునట్లు మార్గమధ్యంబున నారసింహ గారుడ హనుమదాది యంత్రంబుల స్థాపించి సమీప గ్రామవాసజనంబుల రావించి మహాన్నదానంబులు సేసి నిత్యకల్యాణోత్సవాదులు జరిపి ద్విపక్షవాసరంబు లందుండి తచ్చరిత్రంబు శిలాశాసనంబులఁ జెక్కించి మహానందంబున నటనుండి దిగువ తిరుపతి పురంబు సేరి కపిలతీర్థంబున స్నానంబు సేసి సకలదేవపూజిత చరణకమలుండగు కపిలేశ్వరలింగంబును బూజించి యక్షీణకటాక్షవీక్షణ యగు కామాక్షీదేవిని దృఢభక్తియుతంబుగ సేవించి యప్పురంబున నున్న గోవిందరాజ వరదరాజ దైవంబుల దర్శించి పూజించి యట నుండి యా దేవబ్రాహ్మణ బృందంబు రయంబున నశ్వాదుల నడి

పించుచుం జేని చేని యచిరకాలంబున నమరలోకంబునకన్న మిన్న యగు కాంచీపురి పరిసర ప్రాంతంబున విరాజిల్లు పరిమళ మిళత్ కుసుమాపచయాసక్త సుందరీ పరిచిత లతాభవన సందోహంబగు నుపవనంబు సమీపించిరి. 123

ఉ. సూన మరందపాన పటు శోభిత గాన మదద్విరేఫ సం
తానమహీరుహావళి సదా ప్రమదాజన దోహదక్రియా
నూన విలాస భాసుర మనోహరతారుచి నొప్పుచుం ద దు
ద్యానము భాసిలుః బుధవితానము మెచ్చువిధాన నెంతయుః. 124

సీ. వెలమీఱు జేలతారు తెలిబారు సాలువుల్
చెలువారఁగను దమ తలలఁ జుట్టి
వెదురాకు తుది తీవి నెదిరించు వ్రేళుల
ముద మొప్ప నుంగరాల్ గుదురుపఱచి
యకలంక ముకురంబు నొకచేతఁ బ్రకటింపఁ
బికిలిపిట్టయు వెంటఁ బిలపిల యన
వెల చేడియలతోడఁ బలువేడుకలఁ గూడి
తడవైన నడకలు గడలుకొనఁగ

గీ. వీటి విటులెల్లఁ ద ద్వనవాటియందు
బోటులకుఁ జాటువాక్యముల్ దేటపఱచి
నీటు దనరార విహరింతు రాట పాట
లోటములు రాక విలసిల్ల గోటు మీఱ. 125

క. ఆ రామా విభ్రమ లలి
తారామముఁ గాంచి మెచ్చి యా రామ యశో
న్నారామల చారిత్రులు
వే తెంచక చేరి రందు విహరించుటకై. 126

వ. అంతట. 127

ఉ. మామలు విశ్వకర్మకుల మాన్యచరిత్రులు వచ్చి రంచుఁ దాఁ
బ్రేమ దలిర్పఁ జల్లనగు పీన కరంబులఁ గౌఁగిలించుచున్
వేమఱుఁ బాద్య మీయఁగఁ గృపీటముఁ దేఁ జనెనో యన
వ్యోమ మణిగ్రహుం డపర పుష్కరనాథునిః జేరె రక్తుఁడై. 128

క. మును దన్ను శాణకర్షితుఁ
గను జేసిన విశ్వకర్మ గాంచిన సుతు లీ
ఘను లేమి సేతురో యని
వనధిం బడె ననఁగఁ దరణి వడఁకుచుఁ గ్రుంకెన్. 129

క. పరువడిఁ బశ్చిమశరధిన్
దరణి వడన్ బాడబాగ్ని దర్పముతో వే
యరుదెంచెనో యనంగా
గురు సంధ్యారాగ పటల గుణ మలరారెన్. 130

క. కమలంబులు కమలముపై
నమితములై తనరె నపుడు నమితము లగుచున్
గమలాప్తుం డరిగిన లో
కము విస్తృత తమముచే వికాసము దప్పెన్. 131

చ. మదనుని మామ చెంగలువ మక్కువఁ బెంచెడి చక్కనయ్య చ
ల్లఁదనముఁ గూర్చు వెన్వెలుఁగు లచ్చికి నర్మిలి తోడఁబుట్టు వె
ల్లదిశల సత్సుధార్ద్రరుచులన్ దగు వెన్నెల నింపువూన్కిఁ బ్రా
క్సదమలదిక్కునన్ బొడిచె సారసవైరి తమంబుఁ ద్రోలుచున్. 132

సీ. వెలపెంపు గల కెంపుఁ బలుగుంపుఁ దొలఁగింపు
చెలువంపు జిగిసొంపుఁ జిలకరింప
జక్కవ కవలు పెంపెక్కు మక్కువలు వే
స్రుక్క దిక్కుల కేఁగి పొక్క పొగల

కోరిక లీలఁగాఁ జేరి చకోరముల్
చౌరులై తీర మిఁ దారులందుఁ
బల్వలమ్ములయందు బల్విడిం గల్వలు
వెల్విడి యెంతయుఁ జెల్వు మీఱ
గీ. నంత కంతకుఁ గంతుఁడు సంతసించి
పంతముం బూని పాంథుల స్వాంతముల దు
రంత చింతల నిడఁగ రా జంతఁ బ్రాగ్గి
గంతమున మీఱె సత్కళావంతుఁ డగుచు. 133

క. కుముదంబులకు ముదంబును
గమలంబుల గమికి నిర్వికాసము చెలఁగన్
హిమధాముఁడు దనరెను లో
కము లాలితచంద్రికలను గడు విలసిల్లన్. 134

క. వలతేని మామ యీ కలు
వల ఱేఁ డని పాంథు లెల్ల వలవంతలచేఁ
బలునింద లాడఁ దగె వె
న్నెలలన్ దగ నిడుచుఁ గడలినిసుఁగు నభమునన్. 135

ఉ. ఛాయ యొకింత వేఁడ నిజచాతురి భానుని గం డడంచె న
ట్లే యల తమ్ములెల్లఁ దము నెంతయు నేఁచితి నంచుఁ దెల్ప న
న్నోయనొ విశ్వకర్మ విభు గోత్రజ వర్గ మటంచు భీతిచే
నాయతచింత నందె నన నబ్జుఁడు దోఁచెఁ గళంకమధ్యుఁడై. 136

ఉ. అంచిత హర్షులై యల మహాత్ములు సస్మిత వక్త్రు లౌచు స
త్కాంచన హర్మ్యకూట యగు కాంచినిఁ గాంచి రుదంచితాత్ములై
మించిన చంద్రికాద్యుతి రమించిన మేనుల మార్గఖేదముల్
వంచత నందు నంచుఁ దమ భావములందునఁ దోఁప నంతటన్. 137

సీ. దీపావళుల మీఱు సోపానములఁ బాఱు
ధూపమ్ముల వితాన మేపు మీఱ
రంగన్మృదంగ సన్మంగళ ధ్వనులతో
సంగీత గతులు చెలంగు చుండ
నం దంద నృత్యాభి నందిత మా వార
సుందరీ బృందంబు పొందు గులుక
రాజబంధులు లస ద్రాజ మార్గములందు
రాజత్ప్రభలతోడఁ దేజరిలఁగ

గీ. నీలచేలంపు ముసుఁగు పైఁ గీలుకొనఁగఁ
బూలమాలల మేల్తావి చాలఁ గ్రాల
వాలుఁజూపులఁ బఱచు స్త్రీలోల విటులఁ
గాంచి వీథులఁ గాంచిరి కాంస్య కరులు. 138

సీ. తఱుచైన విరజాజి తతి మల్లె విరులకు
నిరవైన నెఱివంక తురుము జార
బుడుత వేఁడి వెలుంగు గడుఁ ద్రోఁచి నెగడు పా
వడపయిం దొడకాంతి సుడి వడంగ
పాముకూసమువంటి పయ్యెదపై నిక్కి
గురుకుచంబుల కాంతి గునిసి యాడ
విటధీర! యటుఁ బోక యిటు రార! యని పల్కు
చిల్క పెన్వ్రేలిపైఁ గుల్కి యాడ

గీ. ద్వారములఁ జేరి తామ యొయ్యారముగను
నోరచూపులఁ జూచుచు మీఱి కేరు
వారకాంతలఁ గనుఁగొని వార లపుడు
కంచి సింగారమునకు నక్కజము పడుచు. 139

మ. మును పా శంకరుఁ డానతిచ్చిన పురిన్ ముఖ్యంబులౌ మార్గముల్
గనుచున్ వేద పురాణ శాస్త్రనిరతిన్ గమ్ర ప్రసంగంబులన్
ఘనులై భాసిలు ప్రాజ్ఞసంఘములతోఁ గౌతూహలంబిచ్చు న
మ్మునిసద్గేహముఁ జేర నేఁగిరి మహామోదంబు సంధిల్లఁగన్. 140

చ. ఎదురుగ వచ్చు న య్యతికులేశ్వరుఁడై తగు శంకరార్యునిన్
ముదమున న మ్మహామహులు మ్రొక్కులచేఁ దనియింప వారలన్
సదనవరాంతరంబునకుఁ జక్కఁగఁ దోడ్కొని పోయి సత్కృతిం
బదనుగఁ జేసి పీఠముల మక్కువ నుండ నొనర్చి యంతటన్. 141

క. వేగమె యీ యతిఘులకున్
బోఁ గడపుఁడి దారియలపు పొల్పగు వంటల్
బాగుగ నొనరుపుఁ డనుచును
దాఁ గని నియమించె వేడ్కఁ దన శిష్యతతిన్. 142

వ. అని యాజ్ఞాపించి యమ్మునిచంద్రుండు ధర్మపాలు నవలోకించి. 143

శా. మీ దేశంబు సుభిక్షమే కుశలులే మీ పుత్త్రులుం బందుగుల్
మీ దేశాధిపుఁడున్ సుఖంబె ఘనమా మీ శిల్పముల్ లెస్సలే
మీ దైవంబులు మంత్రబద్ధు లగుచున్ మీకుం బ్రసాదింతురే
మోదం బేర్పడఁ జోరవహ్ని భయముల్ పొల్పొంద లేకున్నవే. 144

క. సన్నుత చారిత్రులు సం
పన్నులు నై పెద్దవ్వ పయన మనక నన్
మన్నించి యస్మదుక్తిని
మిన్నఁగఁ దలఁ దాల్చినట్టి మేటులు మీరల్. 145

క. అనిన విని య వ్విరాట్కుల
వనధి శశాంకుండు ధర్మపాలుం డనియెన్
మనసిజ రిపు హిత మతికిన్
జనసన్నుత సుగుణ తతికి శంకరయతికిన్. 146

మ. భవదీయాజ్ఞల నిర్వహింపక పరప్రస్తావన ల్సేయు న
య్యవివేకంబు వహింతుమే యనఘ! నిత్యైశ్వర్యసంధాతయా
సవనధ్వంసి మహాస్వరూపులగు మీ సాంద్ర ప్రసాద స్థితుల్
శివము ల్మాకు సుతాంగనాదితతికిన్ సేమంబు లిచ్చుం గదా. 147

సీ. అన విని య మ్మౌని యాహారము భుజింప
లెండని సచియింప దండి పేర్మి
గళముల పర్యంత మలర జలక మ్మాడి
వెలమిూఱు మడిచేలములు ధరించి
సత్పీఠతలముల సరణిగఁ గూర్చుండి
విపుల భూతిని మేన వెలయఁ దాల్చి
సంధ్యా నమస్కృతుల్ సరసతఁ గావించి
రహి నిష్ఠ దేవతార్చన లొనర్చి

గీ. సకల విద్యా సరస్వతుల్ జాణ లైన
య వ్విరాడ్వంశతిలకు ల య్యతినిఁ గూడి
యుచిత సల్లాపముల హర్ష ముప్పతిల్ల
సారగించిరి విందు ల య్యవసరమున. 148

ఉ. సన్నపు బువ్వ సూపము లసద్ఘృతమున్ బటురమ్య శాకముల్
వెన్న యపూపముల్ దధియు వేమఱు నుంచె భుజించి లేచి బల్
సన్నుతు లీయఁజాలు చిఱుచాపలఁ గూర్చిన శయ్యలందు నా
వెన్నెలరేయి న బ్బుధులు వేడుకఁ జెందిరి నిద్ర నెంతయున్. 149

వ. అంతఁ దెల్లవాఱ లేచి దంతధావనాది సముచిత కరణీయము లాచరించి నిర్నిద్ర కమలముఖులగు నా రుద్రసేనాదులు సకలతీర్థవరేణ్యంబగు నంతర్వాహిని యను తీర్థంబున నిజబంధు వితానంబులతోఁ గూడి స్నానంబు సేయఁ జని రంత. 150

సీ. జలపరిత్యక్త సత్పులినంబు కటి గాఁగ
నబ్జనాళంబులు హస్తములుగ
అతిగభీరావర్త మది నాభి బిలముగా
శైవాలములు శిరోజములు గాఁగ
వారిజకోశముల్ వక్షోజములు గాఁగఁ
గుముదముల్ పృథు లోచనములు గాఁగ
భాసుర ఫేనాళి హాసములై మీఱ
నళినసంశోభ యాననము గాఁగఁ

గీ. బొల్పుమీఱెడి స్త్రీరూపమునఁ దనర్చి
హంస రవముల దూరదేశాగతులగు
శిల్పివర్యులఁ బిలుచుచుఁ జెలఁగుచున్న
త న్నదీ ప్రాంతమునకును దఱిసి రంత. 151

ఉ. అన్నగ నట్టి తీర్థజలమం దవగాహన మాచరించి బల్
సన్నపుఁ బట్టుపుట్టములు చారుతరాకృతు లుల్లసిల్లఁగా
మిన్నఁగ గట్టి వారలు సమీప లసత్సికతా తలంబులన్
జెన్నొదవంగఁ దీర్చిరి సుశీలురు నై తమ కాల్యకృత్యముల్. 152

క. ఆ రుద్రసేన ముఖులగు
వీరులు నేకామ్రనాథు వేడుకఁ జూడన్
శ్రీ రమ్యమైన కోవెలఁ
జేరి ప్రమోదమ్ము హృదయసీమలఁ జెలఁగన్. 153

సీ. గిరిజా మనోనాథ వరభక్తతతికి స
త్ఫల మిచ్చునో యన ఫలము లొప్ప
నమిత శైవకులంబు సుమనో వికాసంబుఁ
గను నన సుమనః ప్రకాశ మలర

హరభక్త వితతికి నమృత మిచ్చు ననంగ
సుమ రసామృత రుచుల్ సొంపు నెఱప
పంచాక్షరీ మంత్ర పాఠక పికముల
నలరించు ననఁ జివురాకు లెసఁగ

గీ. వెలయు నేకామ్రమను మహోర్వీరుహాంతి
కమున విలసిల్లు రత్న వికాస యుక్త
కనకమంటపమున బృహత్కాంతి మించు
పీఠమునఁ బొల్చు విశ్వేశు వేఁడి రిట్లు. 154

సీ. ప్రమథాధి నాథ సత్కార్మిక ధార్మికోద్బోధ
హిమధామ మౌళి యహీనపాద
గురుదాంత హృన్నమ త్స్మర దానవాక్రాంత
వర దానశౌండ భాస్వర సుశాంత
కనకాద్రి సచ్ఛరాసన కాళికావర
సనకాది మునిజనావన విధాన
ధృత ఫాలలోచన శ్రిత పాపమోచన
తత కృపాసేచన శ్రుతి నిధాన

గీ. భాసురాంతక హృద్భయదాసి భాసి
యంబ రాంబర నిర్జిత శంబరారి
రజతగిరిపతి శివ శంకరా! నమోఽస్తు
కమ్ర నిరుపమదేహా! యేకామ్రగేహా! 155

సీ. * శరదభ్ర వితతిభా స్వర దభ్ర వినుతి భా
స్వర విభ్రమద్ధైర్య వైరి శోభ
హార నీలగళ లసత్కరశూల యర్ధాంగ
ధరబాల వరశీల దళితకాల

* "శరదభ్ర వితతిభా సురదభ్ర వితతభా" అని వ్రాఁత ప్రతిపాఠము.

కరిచర్మధర ధర్మపర శర్మకర భర్మ
ధరధర్మ భావిత పరమవర్మ
సురవర్య గిరిధైర్య పరశౌర్య హరవీర్య
భరితార్య గురుజగ ద్భరణకార్య

గీ. దండధర భావ్య చండ ప్రచండ సేవ్య
వితత గుణదివ్య రుచిపుంజ సతతనవ్య
రక్ష మాం రక్ష సుకవీంద్ర రచితకావ్య
పురుషమయ సవ్యభాగ సత్పుణ్య భవ్య. 156

వ. అని యేకామ్రేశ్వరుని వినుతించి యటనుండి కాళికాలయ ప్రాగ్గోపుర ముఖద్వారంబుఁ గడచి దేవబ్రాహ్మణ వితానంబుచే స్వరయుక్తంబుగఁ బఠింపఁబడుచున్న వేదఘోషంబునకుఁ బ్రతిధ్వను లీనుచున్న శిలామంటప సౌందర్యంబున కానందించుచు బ్రహ్మాది మస్తకోపరి స్థల స్థగిత పంచభూతపీఠికపైఁ బరాశక్తిస్వరూపంబునఁ బద్మాసనాసీన యై ప్రకాశించుచున్న కామాక్షీ దేవి నికటంబు నకుఁ జని. 157

మ. నమదాఖండల ముఖ్య దేవ మకుటాంత ర్లగ్న మాణిక్య శు
భ్ర మహాపాద సరోరుహా యభయకృద్బాహ్వజ త్కరాంభోరుహా
విమలాంభోజ సదృఙ్ముఖీ శ్రుతిశిరో వీథ్యంతర వ్యాపినీ
సముదాత్మీయ సువిగ్రహా యనుచు మించన్ మ్రొక్కి రద్దేవికిన్.158

సీ. జిగి గల్గు సొబగొందు నగుమోము నిగనిగల్
తెలిదమ్మి సొగసులఁ దలఁపఁ జేయ
సుమచాపు లలితూపు గమి రూపు నెడబాపు
నిరు లాఁపు కనుచూపు గరిమ మీఱ

లలి రత్నములసొంపు బలు నింపు నురమందు
నలరారు మౌక్తికావళులు దనరఁ
గమనీయ మధుపాళి సమతఁ బూనఁగఁ జాలు
కచబంధమున సుమనిచయ మలర

గీ. నఖిల భువనైక మోహనాయత విలాస
వైఖరి వహించు మృగరాజవాహన నతి
నియతిమైఁ జిత్తములను ధ్యానించి రఖిల
వేదవేదాంత సూక్తుల మోద మలర. 159

వ. మఱియు. 160

ఆ. వె. వరదరాజ దేవ పరిమళ రంగేశ
ముఖ్యులకును భక్తి మ్రొక్కు లొసఁగి
తమ నివాసములకుఁ దడయక విచ్చేసి
భోజన ప్రయత్నములఁ గడఁగిరి. 161

వ. అంత న వ్విశ్వకర్మ వంశ పయ స్సింధు కువలయ బాంధవుండగు
ధర్మపాలుండు సబాంధవంబుగా నపరశంకరుండైన శంకరయతిని
విధ్యుక్తప్రకారంబునఁ బూజించి షడ్రసోపేతంబుగా భిక్ష యొసంగి
భుజియింపంజేసి రుచిరాసనంబున సుఖాసీనుం గావించి య మ్ముని
శ్రేష్ఠు నుద్దేశించి యిట్లనియె. 162

క. ఎచ్చట నంగడి నుంచిన
విచ్చలవిడి సరకునమ్మ వీలగుఁ బురిలో
నెచ్చటికేఁ జేరు జనముం
దచ్చరితము లెల్లఁ జెప్పి దయఁ జూడఁగదే. 163

వ. అనిన విని శంకరుండు శ్రీకామాక్షీ దేవాలయ పరిసరంబు
సముచిత ప్రదేశం బగు ననిన శంకరానుమతంబునఁ గనక రత్నో

ద్భాసితాంబర చుంబిత స్తంభసహస్ర విరాజమాన కామాక్షీమందిర బహిః ప్రాకార సింహద్వారగోపుర పురోభాగ విరాజిత మంటపాంతరంబున మళిగ నెలకొల్పి లోకకుక్షి యగు కామాక్షీదేవి పదకంజములకుఁ బునః ప్రణామంబు లాచరించి కనక కాంస్య రజత తామ్రాది నిర్మల లోహ నిర్మిత చిత్రపాత్రాది వస్తువుల నునిచి భద్రకారులగు రుద్రసేనాదులు తులామానాది విక్రయంబులఁ జెలంగుచుండి రంత. 164

క. పురజనులు చూచి ముదమున
వరవస్తు వితానములను వరుసగఁ గొన నా
సరి రాని వనుల చిత్రత
కెరు దందుచు మూల్యవితతి నరయఁగ వారల్. 165

ఉ. ఎత్తున కిబ్బడిం గలుగు నెన్నిక బంగరుఁ జెప్పినంతనే
క్రొత్త విచిత్ర వస్తువులకున్ ముద మందుచు నిట్టి వెక్కడే
నెత్తఱి రా వటంచు వెల యెంచకయే గొని రా పురంబులో
స త్తరళాయతాక్షులు నిజప్రియులుం గడు సమ్మతింపఁగన్. 166

క. ఈ దర్పణంబు సూపును
మోదంబున వెన్క నున్న ముందఱకుఁ గనన్
నీ దయితు నన:గ నొక చెలి
వాదంబునఁ గొనియె నవుడు వర దర్పణమున్. 167

గీ. నీ పడకటింట వీనిని నిల్పి నంత
నిత్య మోహన దేవత నృత్య వితతి
నద్భుతానందములు గూర్చు ననఁగ నొక్క
వేశ్య కొనియె లసద్వస్తు వితతి నెల్ల. 168

ఉ. ఏ దెసవార లీ చతురు లీశ్వరభక్తులు విశ్వమోహనుల్
మోద మెలర్పఁ జిత్రతరమున్ ధర మున్ గనరాని వస్తువుల్
శ్రీ దనరంగఁ గంచిపురి సీమకుఁ దెచ్చి రటంచు నెంచి య
త్యాదర మొప్ప విల్చిరి త దంతికదేశ నివాస మానవుల్. 169

క. ఇటు లమిత వస్తు సంతతిఁ
బటుధనములకున్ వ్యయించి భవ్యాశయులై
కుటిలగతి లేక కాంచీ
పుటభేదనమందుఁ జెల్వుఁ బొందిరి వారల్. 170

గీ. రాజసము తేజరిల్ల విరాజమాన
సౌఖ్యముల మీఱు తత్పురీశ్వరు కుమారి
చూడికుడుతాఖ్యఁ దనరారు చేడె యొకతె
గారవంబునఁ గామాక్షిఁ గాంచు వేడ్క. 171

క. కామాక్షీ దేవీస్తవ
కామమునఁ జెలంగునట్టి ఘన కామినులం
దా మహిత రాజపుత్రిక
వేమఱుఁ దన నేస్తురాండ్ర వేడుకఁ బిలిచెన్. 172

సీ. తరుణారుణ ద్యుతిఁ బురడించు మేల్జరీ
పట్టు పుట్టంబును బ్రౌఢిఁ గట్టి
గంధానులేపన కాంతిఁ గేరెడు కంచు
కంబు చన్దోయిపై గరిమఁ దొడిగి
నెఱివంక తురు మంత మెఱుఁగు మీఱఁగ దువ్వి
రతనాలకమ్మల రమణఁ దాల్చి
చిన్ని చందురువన్నె నెన్ను నెన్నుదుటిపై
సొగసుగాఁ గస్తూరి చుక్క నిలిపి

గీ. అగరుగంధము మైపూఁత లమర నునిచి
వెలకు మీఱిన నగ లెల్ల వెలయఁ దాల్చి
దండి వేడుక యెదలోన నిండ జగము
తల్లిఁ గామాక్షి నర్చించు తత్పరతను. 173

ఉ. చందనగంధి యత్తఱి నిజ ప్రియ చేటికలన్ ముదంబునన్
సందడి గాఁగ రమ్మనుచుఁ జక్కఁగ బంగరు పళ్ళెరంబునం
దందము మీఱ గంధ కుసుమాభరణాది సువస్తు సంతతిన్
బొందుగ నుంచి హస్తమునఁ బూని నిరంతర హర్ష పూర్ణయై. 174

ఉ. దక్షత మంత్రివర్గములు దారి బరాబరి సేయ నేఁగి స
ద్రక్షణలోన నెచ్చెలుల దాసజనంబుల లోకకుక్షి కా
మాక్షిని గొల్వ నేర్పఱచి యంచితరీతిఁ దనర్చు తత్కృరం
గేక్షణ సూచె ద్వారనిక టేడిత వస్తునికాయ మంతటన్. 175

వ. అట్లు కనుంగొని విస్మయమాన మానస యైన య మ్మానినీ
తిలకంబు తన మనంబున. 176

ఉ॥ వీరల రూపరేఖ లిల వీరుల కెవ్వరి కేని నుండఁబో
వీ రుచిరమ్ము వస్తువుల నెన్నఁడుఁ గన్గొనలే దటంచుఁ దా
సారెకు సారెకుం గనుచు సారసలోచన రాట్కుమారి బల్
కోరిక మీఱ నిట్లనె నకుంఠితశోభ నమాత్య వర్యులన్. 177

గీ. అర్క శతకోటి కాంతుల నవఘళించు
దర్పణమ్ములఁ జూడ ముదమ్ము వొడమె
నర్పణము సేయుమీ మాకు నేర్పు మీఱ
ననుచుఁ గామాక్షి దేవ్యాలయమున కరిగె. 178

క. ఆ సరసిజముఖి పలుకులు
వాసిగ శిరసావహించి వైళంబుగ సం
తోసమున మంత్రి సూరన
భాసురమతి యైన ధర్మపాలున కనియెన్. 179

ఉ. ఆ ముకురంబులందు నగరాధిపపుత్రికి వేడ్కఁ గల్గెన
య్యా మతిమంత యీయఁ దగు నా నలినానన కంచుఁ బల్కినన్
బ్రేముడి ధర్మపాలుఁడును బెంపగు వాని వెలన్ వచించి య
య్యా మళిగందె రొక్కమిడ నౌననిపల్కె నొసంగి యద్దముల్.180

చ. అనుడు నమాత్యవర్యుఁడు పురాధిపుతోడను విన్నవించి మీ
ధనము నొసంగి పంచెదము తత్ప్రభుఁ డోలగమందు నుండువే
ళ నరసి రండు మీ రన బళా యిటుఁ బాత్రల నెల్లఁ బాసి మే
మును జన మేలె మీదు మొగమోటము వర్తకమందుఁ జెల్లునే.181

క. అను ధర్మపాలు వాక్కుల
విని సుంకర సూరమంత్రి వెల యిట్లడుగన్
జేనునె యని రుద్రసేనునిఁ
గొని పోయి నృపాలసభకుఁ గుత్సితమతి యై. 182

వ. దర్పణ ద్వయంబును రాజపుత్రికా మందిరాంతరంబునకుం గొని
పోయి కొంతవడికి రుద్రసేనుని సమీపించి. 183

ఉ. క్రమ్మఱ రేపు రమ్మనుచు గ్రక్కునఁ బల్కెను మంత్రి దానికై
సమ్మతి లేక కాంస్యకర చంద్రుఁడు పల్కె నతుష్టి నిట్టు ల
ద్దమ్ములు దెచ్చి మూల్యమగు ద్రవ్య మొసంగక నన్ను రేపటన్
రమ్మని పల్క నీతియె నరప్రభు మంత్రులకున్ దలంపఁగన్. 184

క. అటు లనిన రుద్రసేనునిఁ
బటుకోపము దనరఁ బల్కె ప్రగ్గడ సరి లే
రెటు లైన నేమి రేపే
యిటు రమ్మి ధనంబు నెల్ల నిచ్చెద నీకున్. 185

క. అన విని నిలయంబునకున్
జని మఱుదినమందు మంత్రి సదనంబునకున్
జని రుద్రసేనుఁ డంతట
ఘనమంత్రినిఁ జూచి పల్కె గౌరవ మొదవన్. 186

క. మీరలు రమ్మను నాఁటికిఁ
జేరితిమి ధనంబు నొసఁగి శీఘ్రముగ మమున్
గూరిమిఁ బనుపుం డన విని
క్రూరుండగు మంత్రివరుఁడు కుత్సితమతియై. 187

ఉ. భూవరు సత్సభాస్థలికిఁ బోయి నృపాలున కిట్లు పల్కె నో
భూవరవర్య యబ్బురము పుట్టెను నేఁటికి నీ పురంబునన్
శ్రీ విలసిల్లు త్వష్ట్రకుల సింధుసుధాకరు లన్యదేశజుల్
కేవల మక్రమ స్థితినిఁ గేరుచుఁ బాత్రల నమ్ముచుండఁగన్. 188

క. మీ మహిత పుణ్యపుత్రిక
కామాక్షిని గొల్వఁ బోవు కాలమునందున్
సోమనిభ ముకుర యుగ్మము
వేమఱుఁ గని కాంస్యకార వీరుల మళిగన్. 189

సీ. మమ్మి నా ముకురముల్ దెమ్మని పలుకంగఁ
దదనుజ్ఞఁ దలఁ బూని తడవు లేక
యా శిల్పివరులతో న య్యద్దముల వెలఁ
జెప్పుఁడీ యన వారుఁ జిత్రముగను

నెత్తు కంచునకు రెం డెత్తులు కనకంబు
నిచ్చి యీ ముకురముల్ పుచ్చుకొనుఁడి
యనిన వారలకు నే నట్టులే ధన మిత్తు
రండని పల్కితి రాజసభకు

గీ. మగువతోఁగూడ ముకురముల్ సొగసు మీఱఁ
బంచితిమి యామె మందిర భాగమునకు
ధనము నిమ్మని నన్ను భూతముల భంగిఁ
బట్టి వదలరు దొర యను భయము లేక. 190

క. ద్విగుణ స్వర్ణము వెల యని
నగరపు ధన మెల్లఁ గొని చనన్ జూచెద రే
నగరేశు కప్పమునకున్
దగఁ జాలునె వీరి మూల్య ధనము ధరేశా. 191

క. దొర లన్న వెఱపుఁ జెందక
మురితో వదరెదరు కాంస్య ముకురంబులకున్
ధర యిబ్బడి బంగారఁట
ధరణీశ్వర యింత గలదె ధర కంచునకున్. 192

చ. క్రమమున నిట్లు వల్కి నరకాంతుఁడు గ్రక్కునఁ గాంస్యకారకా
ధము నిటుఁ దెమ్మటంచు విశదంబుగఁ బల్కఁగ సూరమంత్రి యా
విమలుని రుద్రసేను నటు వే కొనిపోవఁగ వానిఁ జూచుచున్
బొమముడిపాటుతో నపుడు భూరమణుండు వచించె నుగ్రతన్. 193

ఉ. సుంకము లేని వర్తకముఁ జూడము భూతలమందు మీరు ని
శ్శంకను మత్పురంబున నృశాసను నాజ్ఞను ద్రోసి పుచ్చి బల్
బింకముతోడ నమ్మితిరి పెద్దగ రొక్కముఁ గొంచు వస్తువుల్
సుంకముగాఁగ నద్దములసొమ్మును మా కిడి పొందు గ్రక్కునన్. 194

క. వీనులకుఁ దప్తలోహ స
మానము లైనట్టి నృపుని మాటల ధాటుల్
మాని యగు రుద్రసేనుం
డాననమున నగవు దోఁప నాలించి యనెన్. 195

క. ఇలలో నాసేతు హిమా
చల మధ్య స్థలములందు సద్వస్తు తతిన్
వెల కమ్మినార మే నృప
కులజులు సుంకంబు నిటులఁ గొను టెఱుఁగ మిలన్. 196

ఉ. కంచున కించుకేని భువిఁ గల్గునె సుంకము దర్పణ ద్వయం
బెంచియుఁ దత్క్రయోక్తధన మెల్ల నొసంగుఁడు లేక యున్న నీ
వంచనకున్ సహింపఁ గలవారమె భూపతి నీతిఁ దప్పఁగా
నెంచుదురే మహీజనము లిందిర మీ గృహమందు నుండునే. 197

మ. అటు లా కాంస్యకరాగ్రగణ్యుఁ డనఁగా నా మానవాధీశుఁ డు
ద్భటకోపంబున భ్రూకుటిన్ విఱుచుచున్ బల్మాఱు నేత్రంబు లు
త్కట రక్త స్థితి మీఱఁ జేసి కరవేత్రంబున్ సభా పీఠిపైఁ
జటశబ్దం బలరంగ మోఁది పలికెన్ జంద్రాఖ్యుఁడౌ మంత్రికిన్. 198

క. మన్నగరి నున్న శౌల్బికు
లెన్నఁడు నీ రీతిఁ బలుక నెఱిఁగిరె మనలోఁ
బన్నుగఁ గట్టుఁడు కొట్టుఁడు
తన్నుఁడు తలఁ దీయుఁ డితని దర్ప మడంగన్. 199

క. నరనాథుఁ డిట్టు లన జన
మరు దండ సదృశ్యుఁ డయ్యె నాత్మీయ లస
ద్వర యోగరూఢ మహిమను
సురుచిరుఁ డగు ధర్మపాల సూనుం డంతన్. 200

క. గద్దఱికాఁడగు నాతఁడు
తద్దయు నటు గానరామిఁ దబ్బిబ్బులతో
నద్దిర కంచరి చనె నని
గద్దియ డిగి నృపతి మంత్రిఁ గని యిట్లనియెన్. 201

మ. పరివారంబులతోడ వారి నిటకున్ బగ్గంబులన్ గట్టి స
త్వరమే మన్నికటంబుఁ జేర్చు మనఁగాఁ దద్భూపునాజ్ఞన్ దలన్
గరిమన్ బూనియు హెచ్చరింప భటసంఘం బట్టి రా వెంట స
త్వర మాత్మప్రభుజు లున్నచోటి కనకమాత్యశ్రేష్ఠుఁ డత్యుగ్రుఁడై. 202

వ. చని తద్ధర్మపాలాదులతో నిట్లనియె. 203

క. ఘనపాశబద్ధులనుగాఁ
దనరంగాఁ జేసి మిమ్ము ధరణీపు కడకున్
గొనిపోవ వచ్చితిమి మా
జనపతి చోళాంగభూప చంద్రుని యాజ్ఞన్. 204

చ. అన విని ధర్మపాలుఁ డనె నా నృపమంత్రికి దర్పణమ్ములం
గొని వెల నీక సుంకమును గోరుచుఁ గట్టఁగ వచ్చినారలే
శునకముఁ బల్లకి న్నిలుపుచో వెసఁ గుచ్చులఁ బీకునట్టి వ
ర్తనమునఁ బొందు ప్రాణముల రక్షణ చేసికొనంగ నెంచినన్. 205

క. అన విని మంత్రియు భటులుం
బెనఁగొన రాఁ జూచి క్రోధవిస్ఫుట మతులై
ఘను లింద్రసేన ముఖ్యులు
ననిసేయఁగఁ బూని రప్పు డలుక దలిర్పన్. 206

క. కని యన్న నింద్రసేనుఁడు
వినయంబున మ్రొక్కి యన్న వీరలఁ జంపన్
బని పూన నింద చేటికి
ననఁగన్ విని రుద్రసేనుఁ డనికభిముఖుఁడై. 207

మ. అమితోద్రేకితఁ దూఁచుకోలఁ గరమం దారూఢిగాఁ బూని వి
క్రమ మొప్పన్ జిగిమీఱఁ గాసె నడుముల్ గాటంబుగాఁజుట్టి సై
జ మహాదైవములన్ దలంచి భటులన్ జక్కాడి యక్కోలచే
యమలోకంబున కంపె మంత్రియు నధైర్యం బందఁగా వీరులన్. 208

క. సంగర జయలక్ష్మినిఁ గొని
ముంగల జనకాదులకును మ్రొక్కుచు సమరా
భంగుఁ డగు రుద్రసేనుం
డంగడిలో రమ్యపీఠమందు వసించెన్. 209

ఉ. అంత నమాత్యవర్యుఁడు భటావళి పంచత నందఁ జూచి య
త్యంత భయపరికంపిత హృదబ్జముతో వెస నేఁగి ధారణీ
కాంతునిఁ జేరి యిట్లనియెఁ గాంస్యకరాధిపుఁ డొక్కఁడే ధృతి
స్వాంతుల సద్భటావళులఁ జంపెను వారలఁ గట్టఁ బోవఁగన్. 210

ఉ. వారల దైవతాస్త్రము లవారిత శస్త్రము లాకడింది త
ద్ఘోరబలం బసాధ్యము లకుంఠ పరాక్రము లైన భీకరా
కారుల విశ్వకర్మ కుల కంధి హిమాంశుల డీకొనంగ సా
ధారణులైన యీ భటులు తాళుదురే పృథివీతలేశ్వరా! 211

ఉ. సంగరమందుఁ గాంస్యకర సంఘములన్ దెగటార్పకున్నచో
భంగము నిక్కువం బనుచు భండనయత్నము సేయుమయ్య చో
ళాంగధరేశ! కంచెరు లిలాధిపు వీరులఁ గూల్చి రంచు భూ
రంగము మాఱుమ్రోయఁగఁ గరం బపకీర్తి గదా తలంపఁగన్. 212

చ. పనివడి దోఁచు దీర్ఘతర బాహువు లొప్ప మహాస్త్ర శస్త్రముల్
దనర భవద్ధనంబుల సదా భుజియించుచుఁ గొల్వు సేయు నీ
ఘను లగు వీరు లేల యల కాంస్యకరావళి నాహవస్థలిన్
బెనఁగొనకున్న క్షత్రియుల బింకము గాల్పనె పార్థివేశ్వరా! 213

వ అని యిట్లు తెల్పుచున్న చంద్రాఖ్యుని పల్కులకత్యాశ్చర్యంబు గాఁ జూచుచున్న రాజుం గాంచి మంత్రియగు సుంకర సూర నాఖ్యుండు కోపోద్దీపిత వచన రచనల భూపాలునకు సంగరో త్సాహంబు పుట్టించి మఱియు నిట్లనియె. 214

క. స్యందన తురగ మతంగజ
సందోహ పదాతి నికర చతుర బలంబుల్
ముందుఁ గొని వాహినీశుల
సందడితో ననిమొనర్పఁ జను ధరణీశా! 215

మాలినీవృత్తము.

రజతశిఖరి ధామా! రాజితానేక నామా!
విజిత రుచిర కామా! వేదవేద్యాభిరామా!
సృజిత సకలధామా! సేవకానంత కామా!
అజకృత నుతిధామా! యద్రిజా హృల్లలామా! 216

గద్యము. ఇది శ్రీమదమల హరితసగోత్రపవిత్ర బొమ్మకంటి సాంబ శివార్య పుత్త్ర పార్వతీకళత్త్ర కరుణాకటాక్ష వీక్షణపాత్త్ర ప్రభాకరకవి ప్రణీతంబైన ధర్మపాలవిజయంబను మహా ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

ఓం

శ్రీ గురుభ్యో నమః

# ధర్మపాల విజయము

## ద్వితీయాశ్వాసము




హిమవత్తనయామణి
బాహులతాబద్ధ! భక్తపాలన విలస
ద్దేహా! నిరంతర నటనో
త్సాహా! రజతాద్రిగేహా! దళితవిమోహా! 1

వ. అంతన మ్మంత్రివర్యుని పల్కులు ముల్కులై డెందంబున సందడింపఁ ద ద్భూకాంతుండు త దుపాంతవర్తులగు నిత్యశృంగ మహానీలాంజన రాహుత్తు తిరుహొత్తు పౌన్నారు సుబాహు జయశీల వీరబాహు శత్రుభీములను దండనాయక దశకంబు నుపలక్షించి యిట్లనియె. 2

ఉ. వింటిరె వీరులార! సరవిన్ సచివేశ్వరు పల్కు లిద్ధరన్
గంటిరె యిట్టి చిత్ర మొక కాంస్యకరుండు బలప్రచండులౌ
బంటుల నందఱన్ దునిమెఁ బ్రౌఢిమ మీఱఁగఁ దూఁచుకోల న
త్తుంటరు లైన శిల్పులనుఁ దోడ్కొని రమ్మని పంపఁ జెట్టులన్. 3

చ. పెనఁగొనకున్న వారలను బేలగఁ జూతురు భూజనుల్ ననున్
మన రిపు భూమినాయకు లమందగతిన్ జనుదెంచి మత్పురిన్
గనలుచు ముట్టడింత్రు వెసఁ గ్రౌర్య మెసంగ మదీయవంశమం
దనినిఁ బరాజయంబు నెపుడైనను గాంచిరె యేమి సేయుదున్. 4

చ. ముకురధనంబుఁ గాంస్యకర ముఖ్యులతోఁ జెలిమిన్ ఘటించి నేఁ
బ్రకటముగా నొసంగ నగుఁబాటగుఁగాక మదీయ వైరియున్
సకుటిలుఁడౌ కళింగపతి చారులచే విని నేని బల్మఱున్
బకపక నవ్వఁడే మఱి నృపాలురు లోఁబడి పన్నులిత్తురే. 5

ఉ. శాలలఁ గాంస్యవస్తువులఁ జారుతరమ్ముగఁ జేయు కాంస్యకృ
ద్బాలున కోడి మీసముల బాగుగ దువ్వుచు రాజుపేరిటన్
గ్రాలుటకన్న బండ మెడఁ గట్టుక స్వర్ణముఖీ నదీ మహా
భీల జలంబుల న్మునిఁగి వే పొలివోవుట మేలు చూడఁగన్. 6

ఉ. పోరున శత్రులన్ దునిమి పొల్పు వహించుట మేలు లేనిచో
శూర విరోధి సంహరణ శోభిత ఖడ్గ మహోగ్ర ధారచే
శూరతఁ జూపుచుం బడిన సుస్థిర నాకము గల్గు భూస్థలిన్
వీరుఁడు శత్రు సంతతికి వెన్నిడినన్ సరివారు నవ్వరే. 7

వ. అనిన విని యమ్మహీకాంతుని స్వాంతంబు రంజింపఁ జేయం దలంచి సకల గుణాన్వితుం డగు నిత్యశృంగుం డేతెంచి పార్థివోత్తము నుపలక్షించి యాత్మీయ మహాస్త్రబలంబులన్ దెలుపం గోరి యిట్లనియె. 8

మందాక్రాంత వృత్తము.

అత్యాశ్చర్యాధికబల ధరాధ్యక్ష! పల్ మాట లేలా
సత్యాస్త్రంబుల్ గలవు మనకున్ సంధిలన్ బెక్కు మేలుల్
భృత్యుల్ మెచ్చన్ బహుళతరమౌ భీమ సంగ్రామభూమిన్
నృత్యం బాడున్ రిపులశిరముల్ నేఁడు మద్బాణపంక్తిన్. 9

వ. అంతఁ బొన్నారను భటనాయకుండు భూపతిం జూచి. 10

మత్తకోకిల.

ఘోరమైన మహాశిలీముఖ కోటి వింట నమర్చుచున్
జేరి సంగర మధ్యభూమినిఁ గేళి సల్పఁగ నేర్తు బల్
వీరుఁడైనఁ గుమారుఁడైనను వెన్క దీయను గాన్యకృ
చ్ఛ్రారుఁ డెంతటివాఁడు చూడఁగఁ జోళదేశ నృపాగ్రణీ! 11

వ. అనినంత తీవ్ర శౌర్య గాంభీర్య ధైర్యంబులు వెల్లడించుచు రాజ
వర్యుం జూచి. 12

భుజంగప్రయాతము.

మహానీలుఁ డత్యంత మాత్సర్య బుద్ధిన్
మహీకాంతుచెంతన్ బ్రమాణంబు వింటే
రహిం ద్రుంతు నే వారి రాజేంద్ర! వేగన్
సహస్రాక్షభోగా! విచారింప నేలా! 13

వ. అను నంత విజయశీలుండగు జయశీలుం డిట్లనియె. 14

భుజంగప్రయాతము.

గదాయుద్ధమందేఁ బ్రగాఢంపు శక్తిన్
నదీపుత్త్రు నైనన్ గనన్ గూల్తు శత్రున్
హృదిన్ వ్రయ్య లౌ నట్లు లేఁ జీలుతున్ న
న్నెదుర్పంగ ధీరుం డిఁ కెవ్వండు భూపా! 15

వ. అనిన విని యంజనుం డిట్లనియె. 16

పంచచామరము.

తురంగ మెక్కి చెంగలించి దోర్బలంబు మించ సం
గరాంగణంబునందు వాఁడి ఖడ్గ మూని నేను బల్
మెఱుంగు మీఱ నిల్చి చూడ మేటి శత్రు లైననుం
దురంబు వీడి పోక న న్నెదుర్పఁ జాలు వారలే. 17

వ. అంత రాహుత్తుం డిట్లనియె. 18

స్రగ్ధరావృత్తము.

లాలిత్యం బేదిపోవన్ లయసమయ మహోల్లాస రుద్రాకృతి న్నే
ఖేలన్ మల్లాహవంబున్ గినుక దనరఁగన్ గీటడంతు న్విరోధిన్
ఫాలాక్షుం గూడి యున్నన్ బదములు శిరముల్ వట్టి చీరంగ నేర్తున్
జోళాంగా! రుద్రసేనున్ సొరిది యమపురిన్ జొన్ప శక్తుండ నౌదున్.

వ. అన విని తిరుహోత్తుం డిట్లనియె. 20

వసంతతిలక.

నా దివ్యబాణము లనంత మహత్త్వముల్ నే
నాదిత్యవల్లభుల నైన జయింతుఁ బోరన్
ఈ దుష్ట కాంస్యకరు లెంతటివారు రాజా!
భేదింతు యుద్ధమున బింకము మీఱ వారిన్. 21

వ. పిమ్మట సుబాహుండను బలాధిపుం డిట్లనియె. 22

ఉ. పెక్కగు పల్కులన్ రొదల వీనుల నింపఁగ నేల నేఁడు బల్
మక్కువ మీఱ మద్భుజసమాన సువిక్రము రుద్రసేనుతో
మిక్కిలి సంగరం బనెడు మెండగు పండుగ సంభవించె నా
యుక్కును వెల్వరింతు సమరోర్వినిఁ జూడు మహాప్రతాపమున్. 23

వ. అన విని వీరబాహుండను వాహినీశ్వరుం డిట్లనియె. 24

చ. అరయక కాంస్యకార నిచయాధిపు బాహుబల ప్రశస్తి సం
గరరిపు భీకరాస్త్రముల కామగతిన్ ధరణీశుతోడ బల్
బిరుదులు వేడ్కఁ జెప్పెదరు బింకము మీఱఁగఁ బౌరుషేయ భూ
సురు లన నాకు నెంత ఘన శూలధరాచ్యుతులైన లెక్కయే. 25

ఉ. కాన మదీయ కృత్రిమము గానఁబడన్ ధరణీశ! కాంస్యకృ
ద్భానుని నెట్టులైనను సెబాసన మాయల యుద్ధమందు నేఁ
గాని జయింపకున్న మొనగాఁ డనువాఁడనె కాను గా నయా
శే! నరపాల శేఖర కిరీట విఘట్టిత పాద పంకజా! 26

క. తమ తమ ప్రౌఢి దలిర్పఁగఁ
క్రమమున న ద్దండనాయక ప్రవరులు దా
రు ముదమున వదనపంకరు
హము లొప్పఁగఁ బల్కె మానవాధిపుఁ డనియెన్. 27

మ. ఉరు గంభీర విశేష మూలములతో నొప్పారు భూమీజముల్
గురువాతం బిలఁ గూల్చునే విజిత దిక్కుంభీంద్రు లౌ మీరు నన్
గరిమన్ గొల్వఁగ రుద్రసేన విలసత్కాండ ప్రకాండంబు మ
చ్ఛిరముం ద్రుంచునె భూరివాహినులు వాసిన్ జుట్టి కాపుండఁగన్. 28

సీ. సత్య విక్రమ తత నిత్యశౌంగాదిత్య!
నిరుపమబల మహానీలవర్య!
కుంజరోపమ శత్రుభంజన యంజన!
రామాత్తునామ సద్భావభీమ!
మదమత్త దుష్టారి విదళన తిరుహొత్తు!
పొన్నారు దైవప్రసన్న ధీర!
శాత్రవవిధురాహు మిత్రవర్య సుబాహు!
ఘోరపర్వతదేహ వీరబాహు!

గీ. విగతరిపుజాల పటువీర విజయశీల!
మిత్రసమ ధామ భూషిత శత్రుభీమ!
కాంస్యకారులతోఁ గల్గు కదనమునను
వాహినుల శక్తి విజయంబు వఱలు మనకు. 29

వ. అను నంత న చ్చోళాంగ మహీపాలుని పలుకుల కుల్లసిల్లి వాహినీ
పతులు కాహళధ్వనులతో బహుళాహ్వానంబుల మోహారంబునకు
దేహంబు లుప్పొంగ వాహినుల రావించి. 30

సీసమాలిక.

రంగదింద్రధ్వజ రమ్య హేమరథంబుఁ
బొంగుచు నల నిత్యశృంగుఁ డెక్కె
తాళకేతన సమాభీల రౌప్యరథంబు
ఖేలనంబున మహానీలుఁ డెక్కె
దిక్కుంభి సిడముతో నుక్కురథంబుపై
నుత్సాహమునఁ దిరుహాలోత్తుఁ డెక్కె
మిన్నందు కాంస్య ప్రసన్న చంద్రధ్వజ
చారురథంబు పొన్నారుఁ డెక్కె
రుద్రధ్వజోజ్జ్వల ద్రుమ తరుబద్ధ
భద్రరథంబు సుబాహుఁ డెక్కె
మందార సమకేతు చందన స్యందన
వరము మహా వీరబాహుఁ డెక్కె
ముక్తాఫలాభ ద్విరుక్త శంఖధ్వజో
ద్వేలరథము జయశీలుఁ డెక్కె
మిత్రపతాకా విచిత్ర రథంబును
భీకరంబుగ శత్రుభీముఁ డెక్కె

గీ. దశసహస్ర మహారథుల్ త ద్ద్విగుణిత
హస్తియానులుఁ ద ద్ద్విగుణాశ్వికులును
దద్ద్విగుణిత పదాతు లౌద్ధత్యమునను
గూడి వెలసిరి రణసీమఁ గుతుక మలర. 31

ఉ. వింతగ నాజి సేయఁ బృథివీపతి యుండఁగ ధర్మపాలకుం
డంతటఁ జారు నొక్కరుని నాహవముం గనఁ బంచి చోళ భూ
కాంతుని సంగరోత్సుకత గాఢ చమూప మహా ప్రలాప మ
త్యంత రణాగమంబు ముద మావహిలన్ విని యెంచె నీగతిన్. 32

ఉ. దర్పణకోశ మిచ్చి ప్రమదంబున సుంకముఁ గోరకుండ బల్
నేర్పునఁ జెల్మి సేయ కిటు నిష్ఫలమా రణ మేల రుద్రసే
నార్పిత బాణఘాతముల నా నృపసేన కకారణంపుఁ జా
వేర్పడనేల చూడఁగ మహేశ్వర చిత్రవిలాస మిట్టిదే. 33

ఉ. గోరులఁ జీరు కాష్ఠతతి గొడ్డటఁ జీరెద రెంత మూఢు లీ
ధారణిలోన మంత్రులు ముదంబున భూపునిచావు నొప్పఁగాఁ
గోరిరి సంగరక్రియకుఁ గొంక కెదిర్చిన తద్భటావళిన్
గేరుచు మత్సుతుం డొకఁడె గీటడఁగించుట తా మెఱుంగరే. 34

ఉ. కేసరపంక్తిఁ బట్టి గిరిగేహమునన్ నిదురించునట్టి యా
కేసరినిన్ గదల్చునెడఁ గిన్కమెయిన్ గబళింపకుండి నే
బాసనునే యకారణ వివాదమునన్ మముఁ జంప నెంచఁగన్
ద్రాసము లేని యీ మనుజనాథు వధించుట యుక్తమే కదా. 35

వ. ఇట్లాలోచించి నిజ కుమారులం గాంచి. 36

ఉ. కాలము చేరు వయ్యె నృపకాంతునకున్ దలపోయ వాహినీ
పాలుర చేడియల్ జనకవాసములన్ గనుఁదోయి నశ్రుసం
జాలముతో వసింతురు విశాలపరాక్రమ మొప్ప మీర లా
భీల రణోర్వి భూధవుని భృత్యుల సేనలఁ గూల్చుఁ డియ్యెడన్. 37

క. మెండగు శస్త్రాస్త్రము లు
ద్దండ బలప్రౌఢి పొల్చ తనరెడు మీ రీ
దండును గెల్తురు చనుఁ డిఁక
భండనమున కెల్ల స్థపతి వర్యులతోడన్. 38

వ. అన విని భద్రసేనేంద్రసేనాదులు జనకానుమతంబున సంగర
ప్రయాణ సన్నాహంబున నున్నయెడ నింద్రసేనాదులకు రుద్ర
సేనుం డిట్లనియె. 39

సీ. ఒక యజాండముమీఁద నొక యజాండము గూలఁ
దూఁచుకోలను బూన్కిఁ ద్రోయఁగలరు
కల్పాంత భైరవాకారులు మార్కొన్నఁ
దూఁచుకోలను గిన్కఁ దునుమఁగలరు
ఏ మహాజలనిధి నిల ముగ్గి యుండినఁ
దూఁచుకోలను దప్పఁ ద్రోయఁగలరు
అద్భుతప్రతిభ మంత్రాధిదైవములను
దూఁచుకోలను వేడ్కఁ దూఁచఁగలరు
గీ. అట్టి దివ్యప్రభావులరైన మీర
లేఁపికూనల సింగముల్ వాపుకొనెఁ
గుంజరంబులు భూజముల్ గూల్చుపగిది
వెలయ శత్రుల దునుముఁడో వీరులార! 40

వ. అను నంత రుద్రసేనుం గాంచి భద్రసేనాదు లిట్లనిరి. 41

క. భవదీయాశీర్వాదము
శివకర మగుఁగాక కీర్తిఁ జేకొన సమరో
త్సవమునఁ బడఁ గూల్తుము శా
త్రవులన్ నిశ్శేషముగఁ బరాక్రమ మొప్పన్. 42

వ. అని పలుకుచున్న భద్రసేనాదులం గాంచి రుద్రసేనుండు సమర సన్నాహంబునకై నిజ సభాంతరాసీను లగు సానగ సనాతనాహభూన ప్రత్న సుపర్ణ బ్రహ్మఋషి గోత్రసంభవులును నయోదారు తామ్ర శిలా భర్మ కర్మ కౌశలులు నగు నా దేవబ్రాహ్మణుల నుపలక్షించి క్రమంబున నిట్లనియె. 43

మ. గదలున్ గార్ముకముల్ మహాక్షయ నిషంగంబుల్ లసద్బాణముల్
మదమత్తారులఁ గూల్చు ఖడ్గవితతుల్ మర్మాహవాంగీకృతా
యుధముల్ సేయుమ యీ ముహూర్తమున నీయుద్యన్మహామంత్రసం
పదచేతన్ మనుధాతృవంశ జలరాట్పర్వోజ్జ్వలచ్చంద్రమా! 44

శా. రథ్యాభావ మెలర్ప ఖేలనగతిన్ రాణించు నుద్యన్నభో
మధ్యోద్భాసిత రమ్య సూర్యరథ సామ్య స్యందనం బావియ
న్నద్యంభఃకణ చుంబితోన్నతము నీ నైపుణ్య మేపారఁగా
నుద్యద్బుద్ధి సృజింపు మిష్ట మయవంశోద్భూత శిల్పీశ్వరా! 45

మ. తలఁపన్ దైవతనాథ హస్తగతమౌ దంభోళికిన్ సాటియై
పొలుపారందగు నస్త్రజాలము దృఢస్ఫూర్తిన్ దనుత్రాణమున్
వెలయం జేసి పసిండికాంతు లొలయన్ వీక్షించు వైరి వ్రజం
బులకున్ మేను గనంగలేని వెతలం బొందింపు త్వష్ట్రన్వయా! 46

మ. విలస ద్ఘోరతరాస్త్ర దైవ ప్రతిమల్ వీక్షించినన్ వైరి సే
నలు మ్రందన్ దగఁ దేరిపై నిపుణతన్ రంగుల్ విచిత్రంబుగా
వెలయన్ వ్రాసి మహాంజనేయ విలస ద్వీరధ్వజశ్రేష్ఠ మా
దల రాజిల్లఁగఁ జేయు శిల్పికులనేతా! శౌర్య మేపారఁగన్. 47

గీ. ఈవు విశ్వజ్ఞ వంశ్యుఁడ విప్పు డఖిల
కదన సాధన సామగ్రిఁ బొదలఁ జేసి
తగిన సన్నాహ మొనరింపఁ దగుదు యుద్ధ
యాత్ర కో సమరాంగణ సూత్రధార! 48

వ. అను నంత నా పంచబ్రహ్మవంశ శిల్పాచార్యులు. 49.

మ. చలమున్ గారుగఁ బూని కొల్మియు రణత్సొమ్మ గాఁగ రౌద్రాగ్నియున్
వెలుఁగన్ గోపపుఁదిత్తి నూఁది రిపురాట్ ప్రేంఖచ్ఛిరో రౌప్య చా
పల మాలిన్యము డుల్చి పున్కలను సత్పాత్రావళిం జేసి పే
రొలయన్ గొన్కలుగా నొసంగుదుమ యత్యుగ్రంపుభూతాళికిన్.

వ. అన విని నిజప్రభావంబున రుద్రసేనుండు నిజవంశ మూలపురుషులగు
మనుమయాదులకు దైవతర్పణంబు లాచరింపఁ దలంచి విజనప్రదేశం
బునకుం జని పంచర్షిమంత్రంబుల నిష్టకోపధానం బొనరించి యం

దనలంబు ప్రజ్వలింపం జేసి హోమకార్యంబు దీర్చి మను మయ త్వష్ట్ర శిల్పి దైవజ్ఞ దేవతాక మంత్రంబుల స్వయోగ నిరూఢి సంప్రాపిత భక్తిసమన్విత నితాంత నిశ్చల మనోబ్జంబున నొక్కింత తడవు సంస్మరించి రథ శస్త్రాది సంగరోపకరణంబుల సంస్పర్శనంబుఁ జేసె నంత. 51

సీ. ధనువుల్ నిషంగముల్ దగ గదా ఖడ్గంబు
లనువుగా నిర్మించె మనుకులుండు
వజ్రశిలాప్రభల్ వఱలెడు రథములు
రయమున సృష్టించె మయకులుండు
నరిభీకరంబగు హనుమద్ధ్వజంబును
దండిగా నిర్మించెఁ ద్వష్టృకులుఁడు
నందమౌ చిత్రము లందంద రథముపైఁ
జిత్రించె నేర్పొప్ప శిల్పకులజుఁ

గీ. డంత దైవజ్ఞుఁ డలరుచు నలఘు కవచ
మొనరఁగాఁ జేసి రుద్రసేనున కొసంగె
నతఁడు సంతుష్టుఁడై దైవవితతిఁ బూజ
సల్పి మ్రొక్కెను గురుజన సంఘమునకు. 52

వ. మఱియు నా రుద్రసేనుండు. 53

ఉ. సంగర భూషణంబులు భృశంబుగ మేల్ చెలువుల్ ఘటింప స
ర్వాంగముఁ గప్ప మైతొడవు నర్థిఁ దులా మహనీయ దండమున్
రంగుగఁ బూని తామరల రాయఁడు ప్రాగ్గిరి నెక్కు కైవడిన్
జంగున వీర్య మొప్ప రిపుసంహృతికిన్ రథ మెక్కె వేడుకన్. 54

చ. శర ధనురాది సంతతుల సాంద్రరుచుల్ సెలఁగన్ రథంబుఁ దా
నరయుచుఁ ద్రిప్పి తద్వర శతాంగముపై ఘన సారథిన్ దగన్
గరిమను గూర్చి కాంస్యమయ ఘంటలు సంగరయోగ్య సాధనల్
మొరయ రణాంగణంబునకు బోరన నేఁగెను రుద్రసేనుఁడున్. 55

ఉ. ఘోర మహాస్త్ర శస్త్ర రణకోవిదులౌ దశదండనాయకుల్
భూరి భుజోజ్జ్వలద్బల విభూషితకాయులు యోధవర్యులున్
జేరి రనేక వాజి రథ సింధుర వారము లుల్లసిల్లఁగాఁ
బోరొనరించి పుణ్యపథమున్ దగుకీర్తుల నందఁ గోరుచున్. 56

వ. అంత నయ్యెడ. 57

సీ. భేరీ మహాశంఖ భూరి నాదంబుల
భూనభోంతరములు బొబ్బటిలఁగఁ
దురగ సంతతి ఖురోద్ధూత రేణుచయంబు
గాఢంబుగా రవికాంతిఁ గప్ప
మదమత్త మాతంగ మహిత చలచ్ఛ్రుతి
పవనంబు తద్ధూళి పటల మణఁపఁ
జికిలిచే మెఱుఁగారు చేకైదువులు దెసల్
తళుకొత్త మినుకులఁ దనరి వెలయ

గీ. దండనాయక దశకంబు దండుఁ గూడి
భండనమునకుఁ జను మధ్యభాగమందు
నెదురఁ జనుదెంచుచున్న శిల్పీంద్రు రథముఁ
గాంచి రాశ్చర్యమును గ్రోధగరిమ దనర. 58

వ. అంత రుద్రసేనుండు యుద్ధసన్నద్ధులై వచ్చిన సేనానాయకులం
గాంచి తన సారథితో నిట్లనియె. 59

క. మన తేరు మింటి కనుపుము
కనఁగాఁ దగు రిపుల సేనఁ గదలక మున్నే
యన సారథి యటు సేయం
గను మింటను శత్రుసేనఁ గని యిటు లనియెన్. 60

శా. సేనానీకము సంద్రమై తనరఁగాఁ జెల్వొందు నా తేరిపైఁ
బూనం బోతవహత్వ మీవు శిరముల్ ప్రోద్యన్మహామీనముల్
గా నా బాణవితానముల్ వలలుగాఁ గల్పించి వేటాడెదన్
నీ నేర్పొప్ప రథంబుఁ ద్రోలు వడిగా నిర్నిద్ర లీలాగతిన్. 61

వ. అను నంత నా సారథి మహాసారథ్యంబు మీఱ లయకాల మహా
నల తేజో విశాలానిలపుత్ర కేతనంబు వైరిపక్షగణంబులకుఁ జూడ
దుస్సహంబై దీపింప నిమిషమాత్రంబున నా చోళాంగరాజన్య
సేనాసమూహ సమీపంబునకున్ దద్రథంబుఁ బనుపుటయు. 62

ఉ. అంత దవానలంబు శలభౌఘము మ్రింగుతలంపు దోఁపఁగాఁ
బంత మెలర్ప శిల్పికులవర్యునిఁ బట్టుఁడు కొట్టుఁ డంచు దు
ర్దాంత బలంబుతోఁ గదిసి ధైర్యయుతుల్ దశ దండనాథు ల
త్యంత మదోగ్రతన్ గవిసి రమ్మహనీయుని రుద్రసేనునిన్. 63

మ. మొదటన్ బాదచరాళి వెన్కను హయంబుల్ వాని వెన్వెంటనే
మదనాగ ప్రచయంబు వానివెనుకన్ మాద్యద్రథారూఢులున్
దుది బల్దండు నమర్చి దండపతులున్ దోడ్తో రణారంభులై
చేదలన్ దుందుభినిస్స్వనంబు లలరన్ జ్యాఘోషముల్ సేయుచున్.

సీ. నిత్యశృంగుం డేను నీలుండు పదియాఱు
నా ఱాఱు వరుసతో నంజనుండు
తిరుపెబాత్తుఁ డిరుచౌద యిరువది రాహుత్తు
పొన్నారు ముప్పది పొల్పుమీఱఁ

దత వీరబాహుండుఁ దగఁ దొంబదొక్కటి
జయశీలుఁ డఱువది నయము మీఱ
శత్రుభీముఁడు పంచశతము సుబాహుండు
పది పది వేర్వేఱఁ బ్రబల బలము

గీ. శరపరంపర నా శిల్పివరుని మేన
భూరిమేఘాళి హిమగిరి వారిధార
లెడప కెంతయు వర్షించు వడువు దోఁపఁ
గురిసి రుడివోని బీరంబు కుదురు వడఁగ. 65

చ. కురిసిన యంపవాన కొక కొంచెము డయ్యక తూఁచుకోల చే
వఱలఁగఁ ద్రిప్పి విక్రమ విభాసిత రూపము భీతిఁ గొల్పఁగా
గురుతర కార్ముకంబు గుణగుంఫితముం బొనరించి శిల్పకృ
ద్వరుఁడు విరోధిసేనల నవార్యశరమ్ముల నొంచె హేలగాన్. 66

సీ. నిబిడ కాండశతంబు నిగుడించి గడు శృంగ
భంగమై చన నిత్యశృంగు నేసె
మేల్ శరశతకంబు మే నాట వడిఁ గూర్చి
తూలించె నమ్మహాసీలవరుని
తళుకులఁ జిల్కు పల్ ములుకు లెదను నాటి
యంజనాఖ్యుని పెంపు నపనయించెఁ
గాండశతమ్ముచే గాత్రమ్ము నొప్పించి
శత్రుభీముని భీతిపాత్రుఁ జేసె

గీ. నితర సేనాధిపతులను వితత కాండ
పాత భీతులఁ దగఁ జేసి పరబలంబు
గన్బయలఁ జూడనీకుండఁ గాండతతులఁ
గప్పి విలసిల్లె మహానీయ కదనభూమి. 67

క. అక్కాంస్యకరు శరంబుల
స్రుక్కఁచుఁ దత్సైన్యపతు లురుక్రోధముతో
నుక్కఁపొడి వాలు శరములఁ
గ్రిక్కిఱియఁ జొనుప శిల్పకృద్వరుఁ డంతన్. 68

శా. దంభోళిన్ గిరిపక్షముల్ మనుకు వృత్రధ్వంసి చందంబునన్
జృంభచ్ఛత్రు చమూప మార్గణతతిన్ జేఁదూఁచుకోలన్ రణా
రంభుండై పొడి సేసి దండధరులన్ రంగద్ధనుర్జ్వాలతా
సంభూతారవ మొప్పఁ గప్పుచు మహో చండోరుకాండంబులన్. 69

సీ. వడి నిత్యశృంగుని సిడముఁ దున్కలు సేసె
వరమహాసీలు నశ్వముల నణఁచె
నంజను సారథిన్ బింజపింజగఁ ద్రుంచె
రాహుత్తువీరుని రవ్వ సేసె
తిరుహొత్తురథము నేర్తెఱ మొరమ్మొనరించె
పొన్నారు సారథి సున్న సేసె
భావంబు గలఁగించె బలవత్సుబాహుని
వీరబాహుని దెసల్ పాఱఁ జేసె

గీ. నేలఁ బడఁద్రోఁచె జయశీలు నిర్భయముగ
శత్రుభీముని విదళితగాత్రుఁ జేసె
బలము భేదించె శిల్పప్రభావ మెసఁగ
వెలయు చిఱునవ్వు మోమునఁ గలయఁబర్వ. 70

ఉ. బెట్టిదుఁడైన శిల్పివరు పెంపు సహింపక దండనాయకుల్
చుట్టును ముట్టి నల్దెసల శోభిత రౌద్ర మెలర్ప నజ్జగా
జెట్టిని ముల్కులన్ గదల శీఘ్రమ చెందుచు వాఁడికైదువుల్
గుట్టల ముంప నాతఁడును గొంకక సారథిఁ గాంచి యిట్లనెన్. 71

క. క్రూరులగు సైన్యపాలురు
కేరుచు ననుఁ జుట్టు ముట్టి గిటుఁగింపన్
గోరి సేనలచుట్టున్
దేరు నడుపు చక్రగతులఁ దీవ్రత మీఱన్. 72

చ. అనుటయు నంత సారథి మహాగ్నులఁ జొచ్చి వెలుంగుకాష్టముల్
గొని వడిఁ ద్రిప్పన ట్లోరులకుం గనిపించు విధంబు దోఁప వా
హినులకుఁ జుట్టునున్ రథము హేలఁగఁ ద్రిప్పఁ దదీయసైన్యమున్
ఘన పరివేషబద్ధ శశి కైవడిఁ దోఁచెను; రుద్రసేనుఁడున్. 73

మ. గరిమన్ గేల నమర్చి కార్ముకము నాకర్ణాంత కృష్టజ్యతన్
బరగన్ బాదము లూని లక్ష్య మొదవన్ బాటించి వజ్రాగ్రభా
సుర సన్మార్గణకోటి వృష్టిఁ గురిసెన్ జోశాంగధాత్రీతలే
శ్వరు సైన్యంబులపై భుజోజ్జ్వల బలప్రావీణ్య మేపారఁగన్. 74

వ. అప్పుడు. 75

సీ. మాతంగ సంఘముల్ మహిత శైలేంద్రముల్
సైకతంబులు మహాస్యందనములు
ఘనతర రథ్యముల్ గ్రాహ వర్యంబులు
మస్తక వితతి కూర్మ ప్రకరము
ఫేనపుంజంబులు పెంపారు మొండెముల్
శైవాలములు శిరోజాత తతులు
కేతన మాలికల్ ఖేల త్తరంగముల్
స్రుక్కిన నేత్రముల్ శుక్తిచయము

గీ. గాఁ దనరు రక్తజలనిధిఁ గాంచి వేడ్క
భూత బేతాళ పుంజంబు బొబ్బ లిడుచు
రక్తమాంసాతిఖాదనాసక్తి మీఱ
రమ్యముగ నాడె నా రణరంగ భూమి. 76

మ. అటు లా శిల్పివరుండు శత్రుహననం బత్యంతముం జేయఁగాఁ
బటుబాణాళి విభిన్నులై చెదరుచున్ బాఱంగ నవ్వాహినుల్
భటులన్ జేరి ప్రధాన సైన్యపతి దీవ్యత్క్రోధుఁడై శాత్రవో
త్కట దోర్వీర్యముఁ దా సహింపక మహాక్రౌర్యంబు దీపింపఁగన్. 77

చ. విలయ మహార్క దీప్తియుత భీషణ నేత్రయుగంబునందు ను
జ్జ్వలదనలంబు లుప్పతిల సత్త్వము మీఱఁగ దిక్కరీంద్రముల్
గలఁగి విభీతచిత్తములఁ గంపిలఁజేయఁగ ధాత్రి, శంఖజో
జ్జ్వలితరవంబులన్ జెలఁగి పైకొనియెన్ వడి రుద్రసేనునిన్. 78

మ. ఘన గంభీర రవంబుతోడ ధరణీకాంతాగ్ర సైన్యేశ్వరుం
డనియెన్ విశ్వకృదన్వయాగ్రణికి నీ యాయోధనాటోపముల్
గన నే నింతకు సైఁచి యుంటి నలుకన్ గాలాగ్ని రుద్రాకృతిన్
బెనఁగన్ వీరుఁ డొకండు నాకు సరిగాఁ బెంపొందునే పోరునన్. 79

క. బాలుఁడవు ఘోర మార్గణ
జాలంబు సహింపఁగలవె చేను వేగిర మా
భీలాహవమునకుం దగు
మీలో బలమున్న యొకనిమీఁదఁ గడఁగెదన్. 80

ఉ. కేరుచుఁ బల్కు దండపతికిన్ వినిచెన్ జిఱునవ్వు మోమునన్
మీఱఁగ ధర్మపాలజుఁడు మించఁగలాఁడవు గా ననున్ మహా
శూరునికితిఁ బల్కెదవు చూడక మద్బల శౌర్య ధైర్యముల్
మీఱి నుతించుకొంచు నిను మేదిని వీరులు చూచి నవ్వఁగన్. 81

శా. "శత్రో శ్శేష మశేషయే" త్తను వచస్సామ్యంబుగా బాల్యయు
గ్గాత్రున్ వే ననుఁ గూల్చి మత్సహజులన్ గాఢాహవక్షోణిలో
క్షాత్రం బొప్ప జయించితేని పతికిన్ సౌఖ్యంబు గాదేని నా
మైత్రిం గోరి యశక్తతన్ వడిగఁ బొమ్మా! మాట లింకేటికిన్. 82

చ. అలుక వహించి యిట్లనఁగ నా మహసేయ బలాధిపుండు విల్
వెలయఁగఁ బూని హస్తమున వేమఱు శింజిని కర్ణపార్శ్వముల్
గలయఁగ లాగి ఘోరతర కాండచయంబును వానిమోమునన్
జెలకఁగ నాట బ్రహ్మకుల శూరుఁడు రౌద్రరస ప్రదీప్తుఁడై. 83

చ. పిడుగుల మించు బాణముల బెట్టుగ నా రణవీరు మేనిపై
వడి నిగుడింప వాని గురువక్షమునం దిరు వాఁడికోలలన్
గడిఁది మగండు దండపతి గాడగ నాటఁగ రుద్రసేనుఁడున్
సిడె మొక తూపునన్ దునుమ సేనలఱేఁడు మహోగ్రమూర్తియై.

క. ఘన రుద్రసేను సారథిఁ
గని ఘోరశరంబు లేయఁ గాంచి యతఁడు క్ర
న్ననఁ గార్ముకమును ద్రుంపఁగఁ
గినుక బలాధీశ్వరుండు కెరలుచు నంతన్. 85

శా. ఘోరాత్యుజ్జ్వల పత్రిసంచయములన్ గ్రోధాత్ముఁడై శౌల్బికో
దారస్వర్ణ విరాజమాన సుతనుత్రాణంబు భేదింపఁగాఁ
గ్రూరుండై లయకాల రుద్రునిగతిన్ గోలన్ బ్రయోగించి స
ద్వీరుండా ఘన రుద్రసేనుఁడు వడిన్ వెల్గొందెఁ జండప్రభన్. 8౬

క. అది నడుమ మహాసీలుఁడు
విదళన మొనరింప ఘోర విపుల శరాళిన్
మది రోషజలధి పొంగఁగఁ
బదపడి యా రుద్రమూర్తి ప్రౌఢిమ మీఱన్. 87

ఉ. ఆతని సూతునిన్ దునిమి యశ్వములం దెగటార్చి ఘోరకృ
త్యాతత బాణపంక్తుల బయల్పడ దీప్తులు రౌద్రమూర్తియై
కేతనమున్ వెస న్నఱికి క్రీడ దలిర్ప బలంబు మీఱఁ గ్రూ
రాతతబుద్ధిఁ ద్రుంచెను శరాసనమున్ జిఱుతున్కలౌ నటుల్. 88

ఉ. వేఱొక సారథిన్ హరుల వింటిని గైకొని క్రోధమూర్తియై
ఘోరశరాసనంబున నకుంఠిత బాహుబల ప్రతాపముల్
బీరము మీఱ నారి ఘన భీకర రావ మొనర్ప వేసి వే
కేరుచు వాహినీశ్వరుఁడు గేలి శరాళిని నగ్రజన్ముపై. 89

క. అనలంగ భూత సంతతి
వడి దహనాస్త్రంబు నొక్క వాఁడి శరంబున్
గడు నారిఁ బోసి రవిగతి
తడయక విడువంగ నది యుదగ్రత మీఱన్. 90

సీ. నిర్ధూమ కీలయాగ్ని నిర్ఘాత విస్ఫుర
ద్వితత సత్తార్చులఁ జేర్చి వెలుఁగ
చటచటారవము లుత్కటకేతిగా మింట
సుడివడు కీలలఁ గడలుకొనఁగఁ
గడువేఁడి కోర్వక యమవీథి వేల్పులు
వడి నేఁగఁ బాదముల్ తడఁబడంగ
పరిఘముల్ కుంతముల్ వర కుఠారంబులు
చక్రముల్ శూలముల్ శర చయములు

గీ. నడరి వెల్గొంది నలుదెసల్ తొడరి నిండి
బెడిదముగ రాఁగఁ దాఁ జూచి భీతి వడక
రుద్రసేనుండు లయకాల రుద్రమూర్తి
హృద్రవ త్క్రోధవార్ధి నక్షుద్రుఁ డగుచు. 91

ఉ. వారుణ నామకాస్త్రము నవార్యజవంబున నారిఁ గూర్చి త
ద్ఘోర హుతాశనాంబకముఁ ద్రుంప రహిన్ విడువంగ మంత్ర సం
స్కారము మీఱఁ దచ్ఛర ముఖస్థితమై తనరారు నంబురా
ణ్ణీరము భూ నభోంతరము నిండఁ దనర్చె నుదగ్రవై ఖరిన్. 92

సీ. ఊర్జితకీలాల పర్జన్య సంఘముల్
గర్జిత ధ్వానముల్ గడలుకొనఁగ
విద్యున్మహోలతల్ ప్రద్యోత దీప్తులై
కన్దోయి చెదరంగ గరిమ మీఱ
వడిమించు పిడుగులు జేడి జేడి రాలంగ
నుడివోని కరములు సుడివడంగ
కడలేని సుడిగాలి తడయక వీవంగఁ
గడువెత నెడఁదలు నడలుచుండ

గీ. వారిధారా శరంబులు వరుసఁ గురిసె
సైన్యముల కెల్ల దైన్యంబు సంభవించె
దహన బాణాళి బొగ్గులై తనరె నంత
దండనాయకు లెల్ల వితాకు వడిరి. 93

ఉ. అంత బలాధిపుండు విపులానిల బాణము నారి వోసి దు
ర్వాంతతఁ బంపఁ దచ్ఛర మవార్య లయోజ్జ్వల వాతజాతమై
సంతతవృత్తితో నపర సాగర మధ్యముఁ జేరఁ గాంస్యకృ
త్కాంతుని వారుణాంబక వితానముఁ ద్రోచె విజృంభితాకృతిన్. 94

క. ఆ రుద్రసేను శరమును
నీరధిఁ ద్రోయంగ మగుడ నిరుపమ విజయ
శ్రీ రమ్యమూర్తి యాతఁడు
గేరుచుఁ దద్వాయుశరముఁ గీటడఁగింపన్. 95

క. కేల విలసిల్లు బలు తుల
కోలను బంధించె గాడ్పుకోలన్ మంత్రో
ద్వేలబల మొప్ప నపు డా
భీలానిల మణఁగ నంత బింకము వెలయన్. 96

చ. ఉరుతర నాగకాండముల నుజ్జ్వల కార్ముకమందుఁ బూన్చి బల్
గరిమను డాయ నేయ బలకాంతుఁడు వాని మహోగ్రనాగ స
చ్ఛరములఁ ద్రుంచె నా గరుడ సాంద్రశరంబులఁ గిన్కఁ గాంస్యకృ
ద్వరుఁ డటు వోక సైన్యము లవార్యరణోద్ధతి మీఱ నత్తఱిన్. 97

మ. యమకాండంబును వింటఁ బూన్చి వడి వేయన్ సైన్యనాథుండు దా
నమితోద్రేకిత శూలిబాణమున మధ్యన్ దాని ఖండించె, న
ర్యమ దోస్స్వీర్యము మీఱ శౌల్బికుఁడు నుగ్రాస్త్ర ప్రతానంబులన్
గ్రమ మొప్పం బఱపెన్ జమూనిచయముల్ గంపింప భీమంబుగన్.

సీ. వాహినీపతి దైత్యవర్యాస్త్రతతి దీప్త
వైష్ణవంబునఁ ద్రుంచె బ్రహ్మకులుఁడు
నద్దండనాయకుం డమిత పైశాచాస్త్ర
వారముం బనుప నవార్య శక్తి
బేతాళ శరము విఖ్యాతి నారి నమర్చి
ఖండించె నవ్వానిఁ గాంస్యకరుఁడు
సారమంత్రాన్విత సాంద్ర బాణంబుల
వడి విడువఁగ ధర్మపాల సుతుఁడు

గీ. మేలి తులకోలఁ జేఁ బూని లీల మీఱి
ఖేల దుష్టాంశు బాణాళి గీటడంచి
రూఢి నొప్పెడు లయకాల రుద్రుఁ డనఁగ
దండి విలసిల్లె నుద్దండ భండనమున. 99

చ. ఇరువురు దైవతాస్త్రముల నిట్లనిసేయఁగ రామ రావణుల్
నర రవిజుల్ సురేంద్ర బలనాముకు లల్ల కుమార తారకుల్
గరిమఁ దనర్చి పోరుగతి గాంచఁగ నయ్యెను వారి దోర్బలం
బరయుచు వేల్పు లాకసమునందున వేడుకఁ జూచి రయ్యెడన్. 100

ఉ. అంతట నగ్రసైన్యధవుఁ డంతకుఁడో యన సంగరావనీ
ప్రాంతమునందు స్వీయమగు భవ్య మహాస్త్రము లన్నియున్ గడున్
బంత మెలర్పఁ ద్రుంచి యనిఁ బావకుభంగి వెలుంగు కాంస్యకృ
త్కాంతుని వైభవంబుఁ గనఁగాఁ దరమే యని ఖిన్నచిత్తుఁడై. 101

ఉ. లోకము లన్ని మొత్తముగ లోఁగొని మ్రింగ వెలుంగు నారసిం
హైక మహాస్త్రముం గొనుచు నద్భుతవైఖరి నారిఁ గూర్చి తా
దీకొని విశ్వకర్మకుల ధీరునిపై నిడె నంత శత్రురా
డ్భీకరమూర్తి యాతఁడు వడిన్ నృహరీషువుఁ ద్రుంపఁ గోరుచున్.

శా. ఘోరాఘోర మహాస్త్ర మయ్యెడను దాఁ గోపించి బల్వింటి పె
న్నారిం బూన్చి నిగుడ్చ వైరిశరమున్ నాటన్ లయోజ్జృంభితా
కారాగ్నుల్ వెలుఁగొంద విష్ణుశరమున్ ఖండించి తత్సైన్యమున్
దేరున్ భస్మము సేసె దూదికొఱిగెన్ దీప్తాగ్ని చందంబునన్. 103

క. అటు నిత్యశృంగుఁ డని మొనఁ
బటు దావానలమునందుఁ బడిన మిడుత నా
దిట వణఁగి శంకరాస్త్రో
ద్భటశక్తిన్ ద్రుంగ దెసలఁ బర్వెన్ సేనల్. 104

క. ఆలమున నిత్యశృంగుఁడు
గూలఁగ నిజసేన దిగులు గొని పాఱ మహా
నీలుఁడు గని సంగర కృత
శీలుండై బాహుబల విజృంభణ మెసఁగన్. 105

చ. వెఱవఁగ నేల బ్రహ్మకుల వీరుని మస్తకమున్ గదాహతిన్
వెఱఁగు పడంగ ద్రుంతు రణవీధిని సైనికులార దిక్కులం
దరుగక రండు వే రథము నంటి రణంబొనరింపుఁ డీ యెడన్
గురుతర మద్భుజోర్జ్వల దకుంఠిత శౌర్యము వేడ్కఁ జూచుచున్.

క. అని సేనలఁ బురికొల్పుచు
దన రథమున్ జుట్టఁ బనిచి తద్దయు శీవిన్
ఘనభుజుఁడు మహాసీలుఁడు
వనరుహ మధ్యస్థ భృంగ వైఖరి వఱలెన్. 107

క. మున్నీరును మందర విల
సన్నగముం గూడుకొనిన చందమున బలం
బన్నరవీరుని రథమును
జెన్నొదవఁగఁ గూడి రుద్రసేనుని దాఁకెన్. 108

చ. ఉరువడిఁ దాఁకు సైనిక మహోహాన్నతికిన్ దగినట్టి చేఁతలన్
గరిమ నెదుర్చెఁ గాంస్యకరకాంతుఁడు పొల్పుగ నత్తఱిన్ రిపుల్
గిరిపయి వారిదంబులు వికీర్ణగతిన్ విమలాంబు ధారలన్
గురిసినరీతి బాణముల గుప్పఁగఁ జేసిరి రుద్రసేనుపై. 109

చ. తన తులకోల కేల సతతంబుఁ జలింపఁగ మించి యుగ్రతన్
గనలుచు నేకలక్ష్యమునఁ గాంచి చలింపని శత్రువాహినిన్
ఘన శరపంక్తులం దునిమి కాంస్యకరైకవరుండు కార్ముకం
బునఁ దగ నారి పెంపలరఁ బూన్చి భుజోద్ధతి మీఱ నయ్యెడన్.

క. జేడి జేడిఁ బడు వడిపిడుగుల
కడువానల వడువు మీఱ ఘన శరవృష్టిన్
బడఁజేసి సైన్య నికరం
బడలఁగ నా రుద్రసేనుఁ డార్చెన్ బెలుచన్. 111

వ. అంత. 112

దండకము. అకాంస్య కృతాంతు దోర్వీర్య మావంత సైరింపకే
పంతముల్ మీఱ దుస్సాంత మేపారఁగా నంతకాకారులౌ సైని
కుల్ మంతనం బొప్పఁగా నంతటన్ మీఱుచున్ గంతులన్ వేయు

చున్ గుంతముల్ ద్రిప్పుచున్ గ్రూర నారాచముల్ మీఱి యా
తేరిపై భారమై దూరఁగా నాటుచున్ మారసంహారు బల్ ధీరతన్
గేరుచున్ మొత్తుచున్ సంగరోన్మాద మొప్పారఁగా నార్చుచున్
బేర్చుచున్ పోకు పోకంచు బల్ భీకరాకారులై నాకమున్ ముట్టఁగాఁ
గేకలన్ మీఱుచున్ మూఁకలై డాయుచున్ డీకొనన్ వేగ పై
దూఁకుచున్ దేకువన్ బాటవం బొప్పఁగా మేటిచక్రంబులన్ ధాటి
గా నేయుచున్ వాటమౌ నీటెలన్ బోటులన్ సూటిగా నాటుచున్
వ్రేటులన్ గేరుచున్ దూలుచున్ సంగరోత్ఖేలనం బొప్పఁగా మేలి
పల్ శూలముల్ గేళులం ద్రిప్పుచున్ గోలలన్ గాంస్యకృద్బాలుపైఁ
దూలఁగా నేయుచున్ మేరుతుల్యంబులై మీఱి పెంపొందు బల్
వారణాస్త్రంబులన్ గేరివర్తించు బల్ శూరులున్ వీరుపై ముద్గరం
బుల్ గదాదండముల్ గత్తులున్ గోరబల్లెంబులున్ దోమరంబుల్
మహోద్దామ శూలంబులున్ దూపులున్ దండిగా మీఱు బల్ భిండి
వాలంబులున్ నీటుగా మీటుచున్ సూటి నీరీతి బల్ మేటి యా
సైనికుల్ పోరునన్ మీఱఁగా ధీరుఁడైనట్టి సచ్ఛూరుఁడౌ కాంస్య
కృద్వీరుఁ డా నీలునిన్ ధీరతన్ బొల్చుచున్ మీఱి వేగన్ దులా
ఘోర దండంబునన్ భండనాసక్తితో మెండు దీపించు బల్ దండి
యవ్వీరులన్ గుండెలన్ జీరుచున్ దుండముల్ వేడుకన్ గండలన్
జేయుచున్ నిండి వర్తించు బల్ దండు నశ్వంబులన్ ధాత్రిపైఁ
గూల్చుచున్ ముందు వర్తించు నా స్యందనౌఘంబు నింతింతగా
ముక్కలౌ నట్టులన్ జేద్వడం గూల్చుచున్ దేరులన్మ్రఱు నా సార
థుల్ రక్తవారాన్నిధిన్ దేలఁగా మేదినిన్ గూల్చుచున్ లక్ష
సైన్యంబులన్ దక్షతన్ ఘోరయుద్ధంబునన్ గూలఁగాఁ జేయ
నవ్వేళ నాలోల జిహ్వాజ్వల ద్భూత బేతాళముల్ బ్రహ్మరక్ష
స్తతుల్ తీవ్రరూపంబునన్ రక్తపానంబు నాసక్తితోఁ జేయుచున్
మాంసఖండంబులన్ మెండుగా మెక్కుచున్ గాల్వలైపాఱు నా
రక్తపూరంబున న్మగ్గి యుద్వృత్తి బల్ నృత్యముల్ సేయఁగాఁ
బుత్రమిత్రాదులన్ బాసి యొక్కమ్మడిన్ భూరియుద్ధంబునన్ బ్రందఁ

గా వ్రాసెనే ధాత హా! దైవమా! యంచు బల్ దీనవాక్యంబులన్
బల్కు నా సేన లా నేలపైఁ గూలి పొర్లాడ మధ్యాహ్న మార్తాండ
బింబ ప్రభోద్దండ రూపంబునన్ మండి వెల్గొందె నా రుద్రసేనుండు
పల్ మర్మముల్ నాటఁగా ఘోరబాణావళుల్ శేషమౌ సైన్యముల్
దైన్యముం బొందుచున్ స్రుక్కి నల్దిక్కులం బాఱఁగా నేఁగెడిన్. 113

వ. అప్పుడు. 114

ఉ. కూలుబలంబు దిక్కులకుఁ గొంకక పాఱెడు సేనలన్ మహా
నీలుఁడు సూచి వాహినుల నేర్పులయంగను బోరఁ బిల్చి యా
భీల రణోత్సుకత్వ మది పెంపెసలారఁగ వీర కాంస్యకృద్
బాలుని దాఁకి శింజినిరవం బెసఁగన్ బెడబొబ్బ వెట్టుచున్. 115

చ. అఱువది క్రూరమార్గణము లా మయవంశ్యుని మేన నాటఁగా
వెఱ పొక యింత లేక రణవీరుఁ డతండును నెమ్మొగంబునం
దరుదగు లేఁతనవ్వున ఖరాంబక సప్తదశద్వయంబుఁ ద
న్నరపతి సైన్యనాథుమెయి నాటె నకుంఠిత దోర్బలంబునన్. 116

చ. అతఁ డటుఁ బాఱకెంతయు రయంబ రణోద్ధతిఁ జూపి కాంస్యకృ
చ్చతురుని వక్త్రమందు దృఢసత్త్వ శరత్రయ మేయ నంతఁ ద
త్కృతిని సహింపఁ జాలక వికీర్ణముగాఁ దను వర్ధచంద్రకాం
డతతుల భీప్రదంబుగ హుటాహుటి నాటెను సూటి మీఱఁగన్.

శా. అంతన్ సైనికకాంతుఁ డంతకుఁడునా నా కాంస్యకృత్సారథిన్
బంతం బేర్పడ మేను జర్జరితమై బల్ రక్తమా స్యందన
ప్రాంతం బార్ద్రగతిం దలిర్ప విలసద్బాణావళిం గొట్టి దు
స్స్వాంతం బేర్పడ రుద్రసేనుఁడు లసజ్జ్యాఘోష మేపారఁగన్. 118

మ. ఉరు బాణమ్ముల సారథిన్ వరుసగా యోధావళిన్ వాజులన్
గురుకాండాసన మెక్కువెట్టి కడఁకన్ గోపించి చెండాడి దు
ర్భర తత్కేతువుఁ గూల్చి వేగ నిజ దోర్గర్వంబు దీపింపఁగా
గరిమన్ వాఁడిమెఱుంగుటమ్ముఁ బరపంగా నంత సాటోపుఁడై. 119

క. మది రోషవహ్ని రగులఁగఁ
బదపడి తత్సైన్యపతియు బాహుతలమునన్
గదఁ బూని రుద్రసేనుని
మద మణఁపఁగఁ బంపె ముఖసమక్షంబునకున్. 120

క. అటు లడరు వాహినీపతి
పటుతరగదఁ దూఁచుకోలఁ బాణితలమునన్
జటులగతిఁ బూని త్రిప్పుచు
మటుమాయ మొనర్చె శిల్పిమాన్యుఁడు కడఁకన్. 121

ఉ. వేఱు గదాయుధంబుఁ గొని వీరుఁడు క్రోధ సమగ్ర మూర్తియై
పోరు దలిర్పఁ గాంస్యకరపుత్త్రుని కంఠతలంబు నాట నే
పారఁగ నేయ శైల్పికకులాగ్రణి తద్గదఁ బూని కేల బల్
నేరుపునన్ గదాహవ వినిశ్చల దోర్యుగ లాఘవంబునన్. 122

ఉ. వే రణరంగ భీముక్రియ వీరరసోల్లస దుగ్రమూర్తియై
దారుణభంగిఁ బై నడర దర్పమెలర్పఁగ సైన్యనాథుఁడున్
భూరి గదాయుధం బొకటి పూని కరంబున నార్చి కాంస్యకృ
ద్వీరునితో గదాహవముఁ దేటపడంగను జేసె నత్తఱిన్. 123

ఉ. దండయుగంబుఁ బూను యమదైవతమో యన రుద్రసేనుఁ డు
ద్దండ భుజాంతరంబుల గదల్ గుమురంగ నమర్చి సాళ్వరా
ట్చండపరాక్రమం బలర సైనికవల్లభుఁ దాఁకె ఠీవి మై
మెండుకొనన్ సుయోధను సమీరకుమారుఁడు దాఁకు నేర్పునన్.

మ. గిరియుగ్మంబును గేసరి ద్వితయమున్ గీనాశ దైవేశులున్
వర సూర్యేంద్రసుతుల్ జరాసుత బకఘ్న ద్వంద్వమున్ దీవ్రతన్
గరమున్ బోరినభంగి దోర్వ్యగ లసద్గర్వోన్నతిన్ శిల్పకృ
ద్వర సైన్యేశులు పోరి రయ్యెడ గదాదండంబులన్ గేరుచున్. 125

సీ. కఠిన గదాదండ ఘట్టన సంభూత
విస్ఫులింగంబులు ప్రస్ఫురింప
మహిత సవ్యాసవ్య మండల గమనముల్
సింహాచంక్రమణంబు చెల్వు మీఱఁ
గదిసి డాసియుఁ బాసి గడఁగి డగ్గఱి వేగ
ఖేటవీధికి నేఁగి క్రిందుఁబరగ(గి)
హెచ్చు రౌద్రస్ఫూర్తిఁ జెచ్చెఱ మిన్నంటు
సింహానాదంబులు సెలఁగుచుండఁ

గీ. బటు గదాదండ సంతతార్భటులు నిగుడ
సురలు నభమునఁ జూచుచు వెఱఁగు పడఁగఁ
బోరి రిరువురు నన్యోన్య భూరిసమర
జయములను గోరి మహనీయ శౌర్యధనులు. 126

ఉ. చూపినపోటుఁ బెన్గదను సోఁకఁగ నీయక క్రిందఁ ద్రోయుచుః
రూపడఁగించి సవ్యసుకరోద్ధతి ఘోరగదాభిఘాతముల్
దీపితశక్తి నాఁపి వెనుదీయ కొకించుక పేర్చి యుగ్రులై
బాపురె! ప్రేటు పోటులను బ్రాఢిమ మీఱఁగఁ బోరి రిర్వురున్. 127

చ. ఇరువురి భేద మన్యులకు నించుకయుం దెలియంగనీక పెం
పరయఁగ విభ్రమంబుల సమగ్ర గదైక విఘట్టనంబులన్
దఱచుగ ఠంగుఠంగు మను దారుణరావ మెలర్ప మింటిపై
నురవడిఁ బోరి రయ్యెడ మహోన్నతి మీఱఁగ దోర్బలంబులన్.

క. అంత మహాసీలుఁడు బల్
పంత మెలర్పంగ సవ్యబాహువున గదన్
వింత గొనఁ గాంస్యకర జన
కాంతునిపై విడిచె నతఁడు కనలుచు వడిగన్. 129

గీ. తద్గదాహతి కొక్కింత దలఁకకుండ
దండపతితల రక్తసిక్తంబు గాఁగ
నిజ గదాదండమున నేయ నిర్భయముగ
న మ్మహాసీలుఁ డడరి పెల్లార్చి కదిసి. 130

మ. తనదా మేల్గద కాంస్యకారవర మస్తంబందు సంధించినం
తన తచ్ఛిల్పకరాన్వయాగ్రణి మహీధ్రప్రాయమా తద్గదన్
దునియల్ సేయఁగ సైన్యపాలుఁడు లసద్దోర్గర్వ మింపార బి
ట్టున వేఱొక్క గదన్ వడిన్ బనుప నాటోపంబునన్ వానిపై. 131

ఉ. తప్తఘృతంబునన్ సలిల ధార వడన్ గడు మండునర్చి నా
దీప్తుల మీఱి విశ్వకర దివ్యకులాంబుధి సోముఁడున్ బల
ప్రాప్తిని గ్రక్కునన్ శిరము వ్రయ్యలుగా నిలఁ గూల మర్త్యరా
డాప్తునిఁ ద్రుంచె నగ్గదను నా హరి వృత్రునిఁ గూల్చు కైవడిన్. 132

క. రణమునఁ దత్సైన్యేశుం
డణఁగఁగ నా యంజనాఖ్యుఁ డతుల బలంబుల్
దనుఁ జుట్టి రాఁగఁ గిన్కం
దన యరదము రుద్రసేను దరికిన్ బఱపెన్. 133

క. రమ్ము మహాసీలునితో
సమ్మతిగాఁ జెలిమి నీకు సంధించెద నీ
దిమ్మణఁగించెద ననిలో
నమ్ము మనన్ బ్రహ్మకులుఁడు నగి రమ్మనఁగాన్. 134

వ. అయ్యంజనాఖ్యుండగు సేనాపతి యిట్లనియె. 135

ఉ. శాలలఁ గాంస్య మిత్తడియుఁ జయ్యనఁ గాఁచుచు సుత్తెవ్రేటులన్
దేలుట గాదు కాంస్యకర! తీవ్రశరంబులఁ బోరు సల్పుటల్
మేలనుకొంటివే సమరమేదినికిన్ బలిగా నొనర్చి యీ
ఖీలరణంబునన్ మనిమి వేరు వహింతు నరాధినేతచేన్. 136

క. అన నన్నిటు దెగటార్చినఁ
గానసాగును నీదుకోర్కె కొమరొప్ప ధరన్
విను సేనాధీశాధమ!
యని యుగ్రకులుండు పల్కె నల బలపతితోన్. 137

సీ. రథములు ధనువులు రాజశస్త్రాస్త్రముల్
మేటి కేయూర కిరీటములును
నుదకుంభ పాత్ర గృహోపకరణములు
శాలలు ఘనమగు సౌధములును
నఖిల సస్యాధార హల సాధనంబులు
భవ్య భద్రాసన పరికరములు
పత్నీ పతిత్వ సంబంధ మాంగల్యముల్
పూర్ణ రత్నోజ్జ్వల భూషణములు

గీ. చిత్రసభలు సర్వ శిల్పంబు లూహింప
వెలయుఁ గాదె సుత్తె వ్రేటువలన
సృష్టి విశ్వకర్మ సృష్ట పంచబ్రహ్మ
కారణంబు తెలియు మోరి దుష్ట! 138

వ. అని. 139

చ. మదిఁ గడుఁ బొంగి బాహుబల మత్సరుఁడై ఘన శింజినీ ధ్వనుల్
చేద లడరంగ మ్రోయఁ దన చాపము నేర్పరయన్ శరవ్యమున్
గుదురుగ నింప నంజనుఁ డకుంఠితశౌర్య మెలర్ప శాత్రవుల్
మది చెదరంగ వక్షము సమగ్రశరంబుల నూటి నాటఁగన్. 140

వ. అంత నా రుద్రసేనుండు. 141

మ. వెలయన్ హాస మొకింత నెమ్మొగమునన్ విల్లంది కర్ణాంతమై
పొలయన్ శింజిని లాగి వాఁడిశరముల్ పుంఖానుపుంఖంబుగాఁ
గలయం బేర్కొని వైచి వైరిశరముల్ ఖండించి తా వేగమే
యలుకన్ మీఱుచుఁ గంకపత్రములు శస్త్రౌఘంబు చేఁబూనుచున్.

మ. ప్రళయోజ్జృంభిత భైరవాకృతిగ నార్భాటించుచున్ వేల్పులున్
బళిరా! యంచు బహుస్తుతుల్ వలుక స్వర్ణప్రాజ్య చాపంబునన్
దళుకుల్ మీఱ నమర్చి ముల్కు లలుకన్ దద్రక్త ధారాఝరుల్
వెలయం జేయుచు రుద్రసేనుఁడు రణోర్విన్ వీరునిన్ వ్రేయఁగన్. 143

క. సలలిత రక్త సుమావళి
విలసిత కింశుకము పోల్కి వెలయుచు నరరా
డ్బలపాలుఁ డర్ధబలుఁడై
చల ముడుగక సంగరంబు సలుపుచు నుండెన్. 144

ఉ. అంతట వింత దోఁపఁగ బలాధిపుఁ డా రమణీయ కాంస్యకృ
త్కాంతుని కార్ముకంబు శరధారలఁ ద్రుంచియు నత్తఱిన్ గడున్
బంత మెలర్ప మైమఱువు భగ్న మొనర్పఁగ వాఁడు దోర్బలం
బెంతయు లేకయున్నఁ జల మేర్పడ నంజనుఁ డార్చి పేర్చినన్. 145

చ. విఱిగినవింటఁ దామ్రకర వీరుఁడు ఘోర శిలీముఖావళిన్
దఱుచుగఁ బూన్చి రథ్యముల ధాత్రినిఁ గూల్చుచు నుగ్గునుగ్గుగా
నరదముఁ ద్రుంచి తుత్తునియలై పడ నేయఁగ సైన్యరాజు తా
విరథత నొందుటన్ మఱొక వింతరథంబున నుండి వెడియున్. 146

శా. నారిం గూర్చి వడిన్ మహోగ్ర విలసన్నారాయణాస్త్రంబునన్
ఘోరధ్వానముచే నుడుప్రకరముల్ గూలంగ సూర్యాదులున్
మేరల్ దప్పి చరింప బెట్టిదపు బల్మిన్ శీర్షలక్ష్యంబు గా
శ్రీరామాపతి గాఢభక్తి నెదలోఁ జింతించుచున్ వేసినన్. 147

మ. అది బల్తూపులు చక్రముల్ పృథుల శస్త్రాళిమల్ కుఠారంబులున్
గదలుం బ్రాసములున్ సుతోమరతతుల్ గాఁ బొల్చి పెన్మంటలన్
జెదరం గప్పఁగ రుద్రసేనుఁడు సమిత్సింహుండు ప్రత్యస్త్రమున్
మదిలో నెంచి యొకింతకాలమున సన్మాన్య ప్రభాటోపుఁడై. 148

చ. చతురత నొక్క పాశుపత సంజ్ఞ శరం బరివోసి భూరికాం
డతతులఁ ద్రుంపఁ బూన ఘోర దారుణ బాణవరంబు వైష్ణవో
ద్ధితశరపంక్తిఁ ద్రుంచి శరధిన్ దగ నస్త్రము సేరఁ గుంభినీ
పతి బలపాలకుండు గత పంకజనాభ మహాస్త్రుఁడై వెసన్. 149

మ. పటుచాపంబునఁ గూర్చి ఘోరబగళా బ్రహ్మాస్త్రరాజంబు ను
త్కటదోర్వీర్యము మీఱ శిల్పివరు మస్త్రంబున్ శరవ్యంబుగాఁ
బెటపెట్లాడి యజాండకోటి వగులన్ బింకంబునన్ ద్రేయఁగా
మిటమిట్లుర్వి వణంకెఁ జుక్క లురలెన్ మిన్నెల్ల నింకెన్ వడిన్. 150

క. అత్తఱిని రుద్రసేనుఁడు
మొత్తరె బగళాస్త్రమునను ముఖ్యంబగు బా
ణోత్తమము మదాయత్తము
చిత్తంబున నెకదీక్షఁ జింతన సేతున్. 151

క. అని ప్రత్యస్త్రము నిడకయె
ఘన బగళాబీజపంక్తిఁ గడు వ్యత్యస్తం
బునఁ గూర్ప నమ్మహాస్త్రము
వెనుదిరిగి బలేశు నంట వేగమ చనియెన్. 152

క. అరదముతో బలపాలుని
గుఱుతుగ భస్మ మ్మొనర్చి ఘోరాకృతిగా
నరుదెంచె బ్రహ్మపదమున
కురుజవమున నమ్మహాస్త్ర మున్నత దీప్తిన్. 153

చ. చలమున నిట్లు సైన్యపతి చంద్రుల ముగ్గురఁ గూల్చి ఘోరదై
త్యులఁ దెగటార్చు శూలిగతి దోర్బల మొప్ప రణాంగణంబునన్
వెలయఁగ విశ్వకర్మకుల వీరుఁడు చోళమహీశు సైన్యముల్
కలఁగి దిగంతవర్తులయి గ్రక్కున బిక్కమొగాలఁ బాఱఁగన్. 154

సీ. తిరుపెూత్తు రాహుత్తు ధీరుఁడు పొన్నారు
వీరబాహు సుబాహు ఘోరబలులు
శత్రుభీముఁడు జయశాలియు వరుసతో
వేర్వేఱ బలముల వేళ్కమీఱ
వెఱవకుఁడో యని కరములు వీచుచుఁ
బురికొల్పి యనిసేయ బుజ్జగించి
గారుడవ్యూహంబుఁ గల్పింపఁగఁ దలంచి
యిరుపక్షములయందు నిరువురుండి
ఫాలభాగంబున వరుసగా నిర్వురు
కంఠతలంబున గరిమ నొకఁడు

గీ. శత్రుభీముండు ముఖసమక్షమున నుండ
మధ్య జయశీల సైన్యసమ్రాట్టు నిలిచె
సమరసన్నాహ మేపార సకల బలము
పక్ష వక్ష స్స్వరూపముల్ పరగ నిలిచె. 155

చ. అటుల వభేద్యరీతి గరుడాకృతి సేనలఁ బన్ని కాంస్యకృ
త్కుటిలగతిన్ దెరల్చ ఘన ఘోష మెలర్పఁగ సైన్యనాథు లు
త్కటగతిఁ దాఁకినంత వరదంబున సూతునిఁ గాంచి మించి తా
నిటు లనియెన్ ధరామరుఁ డభీప్సితకర్మకు యుక్తమై తగన్. 156

మ. గరుడాకారముఁ బూనె సైన్యము మహాగాఢస్థితిం జూడఁగా
నరుదా శ్యేనగతిన్ దనర్చు రథ మయ్యారే! యనన్ గాంస్యకృ
ద్వరుతో నిట్లను సూతవర్యుఁడు మహోత్సాహంబు సంధిల్ల స
త్వరుఁడై భవ్యమతిం దలంచి మిగులన్ దత్కాల యోగ్యంబుగన్

చ. బలముల ముందు గూల్చి బలశాలురు దుర్బలులై చలంబునన్
గెలువఁగ లేక ముందె బలనేతలతో ననిసేయ నస్త్రపుం
బల మణఁగున్ మదిన్ బలము ప్రాభరణం బొనరింప గెల్చుటల్
గలుగవు, సేనలన్ మనుమఁగా విగతాస్త్రుఁ డశస్త్రుఁ డౌఁ గదా. 158

చ. అన విని మద్భుజోద్ధతి మహత్త్వ మెఱుంగఁడు వేఱ పల్కఁగా
మన మది యెట్టిదౌనొ యని మన్ననతో నటు సేయ రమ్యమా
నని పలుకన్ జగత్కర కులాంబుధి చంద్రుఁడు సైన్యసన్నిధిన్
జన నరదంబు సూతుఁడును జాతురితోఁ బఱపెన్ రయోద్ధతిన్. 159

మ. బలువిల్ కేల నమర్చి బాహుబల దర్పం బేర్పడన్ జ్యారవం
బులు మిన్నంటఁగ దళుక్కునన్ మెఱయు మేల్ ముల్కుల్ మెయిన్నాటుచున్
బాలియంజేయుచు శత్రుసేనలను దద్వ్యూహాల్లసత్పత్తిరా
డ్వాలసద్వక్త్రిముఁ జీల్చి మధ్యకుఁ జనెన్ వీర్యప్రభావంబునన్. 160

వ. అంత. 161

సీ. మద మలినాంగమౌ మాతంగ సంఘంబు
రక్త సిక్తంబుగా రాలె భువిని
ఘోటక శిరములు సూటిగాఁ దెగ వ్రేయ
నోలిమై మేనులు నేల వ్రాలె
మదమత్త వీరుల పదములు ఖండింప
జానుల దోఁగాడి చనిరి మిగుల
రథికుల నిజ మనోరథములతోఁ గూడి
యరదముల్ భగ్నమై యవనిఁ గూలె
గీ. పరగి మధ్యాహ్న మార్తాండ భాసమాన
మండల సమాన వక్త్రుఁడై మొండు వెలసె
భండనంబున విపుల దోర్దండుఁ డగుచు
రుద్రసేనుండు లయకాల రుద్రుఁ డనఁగ. 162

ఉ. పక్షములందు నుండు బలపాలురు ప్రాగపరాంబుధుల్ సుమే
రుక్షితిభృద్వరంబు పడఁ ద్రోయఁగ దాఁకినరీతి ఘోర ఫా
లాక్ష నిజాంశ జన్ముని షడాననుఁ బోలిన రుద్రసేన హ
ర్యక్షముఁ దాఁకి రుద్ధతి నవార్యబలంబులఁ గూడి యత్తఱిన్. 163

ఉ. సూదిని దూర్పసందిడని చోద్యపుఁ బెన్మొన వాఁడిముల్కులన్
వే దనుమాడుచున్ భువనవీరుఁడు కాంస్యకరుండు కోలఁ దా
మోద మెలర్పఁ జక్రగతి మ్రోయఁగఁ ద్రిప్పిన మాఱువీరుఁడీ
మేదిని లేఁడటంచు నుతి మీఱఁ దలంచుచు వాహినీశ్వరుల్. 164

చ. వడిఁ దగు ముల్కులన్ విపులవక్షమునన్ రుధిరంబు గ్రక్కునన్
వెడలఁగ మేను గాడివడఁ బెద్దఁగ నాటిన రుద్రసేనుఁడున్
ముడివడఁ గన్బొమల్ గనకపుంఖ శిలీముఖపంక్తి వారలన్
వడి వడిఁ గప్ప నొక్కఁ డనివార్యశరంబుల నుగ్గుసేయుచున్. 165

చ. అడరుచు రుద్రుఁ డాసి నిశితాంబక కోటుల ముంచుచున్ వడిన్
సిడము సుధాంశుఁడై వెలయ శీఘ్రముగా శరపంక్తిఁ బంచి తా
నుడుగక మించి శౌల్బికుని యుజ్జ్వలదోర్బల మెల్ల డిందఁగా
బెడిదపు టమ్ములన్ దనువు భీషణుఁడై వడి గ్రుచ్చి యార్వఁగన్. 166

క. శరలాఘవమ్ము వీనికి
గరిమన్ విలసిల్లె నితనిఁ గదనస్థలి నేఁ
బరిమార్తు నవశ్యంబని
గురుమతియగు రుద్రసేని కుపితుం డగుచున్. 167

సీ. తన తులాదండంబు ఘనబాహు యుగమున
వడిఁ ద్రిప్పి వానిపై వైచినంత
నా కోల తద్భటాధ్యక్షుని వడిఁ గూల్చి
వసుధపైఁ బడఁ జూచి భటుఁ డొకండు

కడువేడ్కఁ జేఁ బూని గ్రక్కున జయశీలుఁ
డనుబలాధిపునకు సమర నొసఁగి
యిది మనకడ నున్న పదపడి యా వైరి
నిగ్రహింపఁగ లేదు నేఁడు మసల

గీ. ననుచుఁ బలుకంగ నతఁ డది యరసి దాఁచి
దంపునందువ దండిగా నుండి వెలిఁగి
భండనమునకుఁ దన పెద్ద దంపు గూర్చి
దాఁకె నా రుద్రసేనుని ధైర్య మెసఁగ. 168

క. ఆ నాఁడు రుద్రసేనుఁడు
'నానాశక్తులఁ జెలంగు నా చేకోలన్
బూనిరి శాత్రవు లికనా
ప్రాణము విడనాడ' రనుచు భయము దలిర్పన్. 169

శా. రాహుగ్రస్త దివాకర ప్రతిముఁడై రంగన్మహా సంగరో
త్సాహంబున్ విడనాడి యాత్మహితమా సద్దండ హైన్యంబునన్
బాహాద్వంద్వము సంచలింపఁగ గళద్భవ్యోగ్ర తేజంబునన్
మోహాబద్ధత నుండ వానిధనువున్ బోఁగొట్టి యా సైన్యపుల్. 170

చ. ఘనతర బాణజాలముల గ్రక్కున రక్త మెలర్ప గ్రుచ్చి త
జ్జననుతు సారథిన్ నిశిత సాంద్ర శిలీముఖపంక్తి నేసియున్
మన మలరంగ నేమి యిఁక మ్రగ్గెను గాంస్యకరుండనంగఁ దా
వెనుకకుఁ ద్రిప్పె బ్రహ్మకుల వీరుని సారథి తేరు భీతిమై. 171

క. దుందుభి రవములు దిశలన్
దం దం ధణ యనుచు మొఱయ దండాధీశుల్
డిందెను గాంస్యకరుండని
సందడితో బొబ్బలిడిరి జయశోభితులై. 172

క. అటు లడర సైన్యపాలురు
పెటిలిపడుచు రుద్రసేని బీరముతోఁ దా
. నిటు లనియెన్ సారథితోఁ
బటుగర్జిత కంఠ రావ భాస్వరుఁ డగుచున్. 173

చ. అరదము వెన్కఁ ద్రిప్పి రిపులందఱకున్ వెనుజూపి నవ్వఁగాఁ
బరువున వచ్చితీవు బలవంతుల లక్షణమే ధరాస్థలిన్
ద్వరితము దూఁచుకోలఁ బ్రమదంబునఁ దెచ్చి జయింతు నాజి నే
నురువడిఁ జేర్పుమా! రథము నున్నతశత్రుసమీప భూమికిన్. 174

క. అన సారథి యరదంబును
జనఁ జేయఁగ రుద్రసేని చయ్యన సమ్మో
హన నామకాస్త్రవర్యము
తన వింట నమర్చి వదలెఁ దత్సేనలపై. 175

వ. అప్పుడు. 176

ఉ. సేనలు మోహనాస్త్రహతిఁ జేడ్పడి మత్తున దిక్కు దోఁపకే
మేనులు సంచలింపఁ బడమిం బడెఁ గొందఱు భీతి నాత్మలం
బూని వంశబుఁ దప్పి తమ పొల్పగు చేష్టలు దక్కి రంత్య కా
లీనుల పోల్కిఁ గొంద అచలీకృత దేహులు నైరి యంతటన్. 177

క. ఆ రుద్రసేనుఁ డనియెన్
సారథితోఁ దూఁచుకోల చయ్యన నీ వీ
భూరి బలంబులలోపల
నేరుపుతో వెదకి తెమ్ము నిర్భీతుఁడవై. 178

క. వారల సిగలను ముక్కుల
ఘోర మనక కోసి రమ్ము గొంకక వేగన్
గ్రూరుల నేమి యొనర్చినఁ
జేరదు పాపంబు మనకు సేమమె తనరున్. 179

క. అన జయశీలు రథమ్మునఁ
దనరెడు నా తూఁచుకోలఁ దాఁ గొని వేగ
మ్మున ముక్కుసిగలు గోసియుఁ
దన పతికిన్ గోల యొసఁగెఁ దత్సూతుండున్. 180

ఉ. కేతువిముక్తుఁడై కళలఁ గేరెడు కల్వలరాజుచెల్వునన్
ఖ్యాతిగ దూఁచుకోలఁ గరకంజమునం ధరియించి మించి ప్ర
ద్యోతరుచిన్ వెలింగెను మహోన్నతి శైల్పికవర్యుఁ డత్తఱిన్
పీత మహాస్త్రమోహము లగు వీరులఁ బద్మలనాథులందఱున్. 181

క. ముక్కుల సిగలను గోసెను
జక్కడఁపక వీని వదలి చనఁ దగ దనుచున్
గ్రిక్కిఱిసి చుట్టు ముట్టినఁ
జెక్కుం జెదరకయ శత్రుసేనలఁ గనుచున్. 182

ఉ. ఎన్ని విధంబులన్ సమర మెన్నికఁ జేసిన మ్రుంద వైరి యీ
పన్నినసేనఁ బ్రాణములు వాపెద నట్టుల సేయకున్నచోఁ
గ్రన్ననఁ దూఁచుదండమునఁ గంఠము గ్రోల్పడు వాఁడఁ గోలయే
పన్నుగ సాక్షి యంచు లయభర్గునికిన్ దనర్చి యుగ్రతన్. 183

మ. బలు విల్లా హరిచాపకీర్తిఁ గన శింపా జ్యాలతా నాదముల్
పలు మేఘధ్వనులై చెలంగ నృపతి ప్రాంచద్బలానీకమున్
విలసత్ క్షాత్ర పవిత్ర శిల్పుల మహా వీర్యాంబుధప్రౌఢి ను
జ్జ్వల దర్ధేందు సమాన కాండ సలిలాసారంబులన్ ముంచెదన్. 184

వ. అని పల్కు నంత. 185

క. కినుకన్ జయశీలుం డా
తని వెనుకన్ దాఁగి కుటిలతన్ జాపంబున్
ఘనశరముల దునుమాడఁగ
వెనువెంటనె రుద్రసేన వీరుఁడు పెలుచన్. 186

క. అరదము డిగి సింగమువలె
నరనాథ బలేశుఁ బట్టి నరకేసరియా
హరి కనకకశిపు నామక
సురవైరినిఁ జీల్చుపగిది శూరత మెఱయన్. 187

క. తొడ యొకటి ద్రొక్కి పదమున
పిడికిటఁ గా లొకటి పట్టి పెడకమ్మను జీ
రెడురీతి రెండు వ్రయ్యలు
నడిమికిఁ దెగఁ జీరి రథమునకా జేరు తఱిన్. 188

చ. కడిమి మగండు సేనలును గ్రన్ననఁ జుట్టును ముట్టడింపఁగా
నడుమను బెట్టి కాంస్యకర నాయకునిన్ బిడికిళ్లఁ గిన్కచే
వడి వడి గ్రుద్ది మేటి కరవాలమునన్ దెగ నాటి యార్వఁగా
నుడుగక రుద్రసేనుఁడు భుజోజ్జ్వలశక్తిఁ దనర్చి యార్చుచున్. 189

సీ. తన తూఁచుకోలను గినుకతోఁ ద్రిప్పుచుఁ
జక్రభ్రమంబునఁ జండవృత్తి
ముష్టిపాతంబుల మోఁదుచు నుడివోక
పదములఁ గొందఱఁ జదును సేసి
కుత్తుకలను బట్టి మొత్తుచుఁ గోలచే
నెత్తు రుప్పతిలంగఁ దత్తరింపఁ
దొడలను బడఁగూల్చి నడుములఁ గడు ద్రుంచి
యెడలేక శిరములఁ బొడిచి విఱిచి
గీ. మాఱు మసలంగ నీయక పోరిలోన
ఘోర శాత్రవ సేనలఁ గూల్చి వైచి
వీర లయకాల భైరవాకారుఁ డనఁగ
మీఱి విలసిల్లె సంగర ధీరుఁ డగుచు. 190

వ. ఆ సమయంబున. 191

క. మిగిలిన సేనలు మదిలో
దిగులు వడుచు రణమువదలి దిక్కులఁ బాఱన్
మగవాని నొకని నేనిం
దగ దండునఁ గాంచ కతఁడు తనరెం బ్రభతోన్. 192

సీ. తిరుపాహాత్తు రాహుత్తు ధీరుఁడు పొన్నారు
శత్రుభీముఁడు చండమిత్రసముఁడు
హతశేషులైనట్టి శతయుగరథికులు
పంచ శతాశ్వికుల్ ప్రబల కుంభి
యానులు ద్విసహస్ర మానిత పదచరుల్
బలములతోఁ గూడి బ్రతుకుఁ జావు
రెండింటిలోపల నొండెద్ది యేనియు
సంభవించు నటంచు సంభ్రమమున

గీ. ధర్మపాలక పుత్రుని దర్ప మడఁప
బాణవర్షముఁ గురియింప భండనమున
మిన్ను వడఁకఁగ దోఃప్రౌఢి మిగుల వెలసె
రుద్రసేనుండు మహనీయ రౌద్రమునను. 193

క. ఘన సైన్య బాణ జాల
మ్మునకును లక్ష్యంబు గాక పూని యతండున్
గనకోజ్జ్వల మగు రథమునఁ
జని నిలిచి యవార్య గర్వ సంరంభమునన్. 194

పంచచామరము.

మెఱుంగు వాలుఁదూపు లల్ల మేటి నారిఁ గూర్చుచున్
దుఱుంగలించి పోరిలోనఁ దొట్రిలంగ సైన్యమున్
గరంబు రక్తధార లొల్కఁగా ఘటించుచున్ వియ
చ్చరోప భోగ కాంతలన్ వెసన్ వరింపఁ జేసెదన్. 195

వ. అనుచుండ. 196

ఉ. అంతట శత్రుభీముఁడు లయాంతకు రీతి వెలింగి కాంస్యకృ
త్కాంతుని ఘోర బాణముల గాడఁగ నేయఁగ రుద్రసేనుఁ డ
త్యంత పరాక్రమంబున శరాళులఁ జాతురి మీఱ మధ్యనే
పంత మెలర్పఁ ద్రుంప బలపాలుఁడు చక్రము వైచె వానిపై. 197

ఉ. చక్రము రుద్రసేను గళ సన్నిధికిం జనుదేరఁ గాంచి ని
ర్వక్రతఁ దూఁచుకోలఁ దగఁ బాణితలంబునయం దమర్చి బల్
విక్రమ మొప్పఁ జక్రమును వింతగ ముక్కలు చేసి పిమ్మటన్
శక్ర సముండు రుద్రుఁ డొగిఁ జారు శరాసన మెక్కు వెట్టుచున్.198

క. అర జాబిల్లిగఁ దనరెడు
శర మొక్కటి విడిచి శత్రు శాసనుఁ డగు త
న్నరపాల సైన్య నాథుని
శిరమున్ దునుమంగ నతఁడు క్షితిపైఁ గూలెన్. 199

ఉ. కూలిన సైన్య నాయకుని గుండెలు వ్రయ్యఁగఁ గాంచి వాహినీ
జాలముతో నశేష బల శాసను లయ్యెడ వేగఁ గాంస్యకృ
ద్పాలుని దాఁకి నల్దెసల బాహుబలోద్ధతి పిచ్చలింప నా
భీల శరంబులన్ బఱపి వీర్య మెలర్పఁగఁ బోరు సేయఁగన్. 200

క. ఆలస్య మేల వీరలఁ
దూలించెద నంచుఁ గ్రోధ దుర్దాంత మహా
కాలుఁ డగు రుద్రసేనుఁడు
భ్రూలత లదరంగ భూరి భుజబల యుతుఁడై. 201

మ. మది వేల్పుల్ బెదరంగ మిన్ను వగులన్ మంత్రించి యా శాంభవిన్
వదలన్ దన్మహనీయ శక్తి శర మా ప్రత్యర్థి సైన్యావళుల్
బెదరన్ సైనిక దేహముల్ రుధిరముం జిమ్మంగ గాత్రంబులున్
బదముల్ హస్తములున్ గళంబులుఁ దృణప్రాయంబుగాఁ ద్రుంచుచున్.

వ. అతిసాంద్ర విలయ కాలాభీల మహానల జ్వాలలు వెలుంగఁ బ్రత్య
ర్థ్రుంబుల సంహరించుచుఁ ద త్సైన్యేశుల సకల సేనా సమన్వితంబు
గాఁ జుట్టుం గప్పి యొక్క ముహూర్త మాత్రంబునఁ జక్కడంచె
నంత. 203

సీ. కమల సంతతి లేని కమలాకరము మధ్య
నలరు స్వర్ణస్తంభ మనఁగ నొప్పి
శత్రు సంతతి లేని సంగర భూమిలోఁ
దన రథం బొక్కటి ఘనత వెలయ
నారయ లక్షలౌ యఖిల బలంబుల
దండనాథులతోడ ధరణిఁ గూల్చి
విపుల లోకఖ్యాతి విజయలక్ష్మినిఁ గూడి
భండనధాత్రిలో మెండు వెలసి

గీ. రక్త మాంస కపాలముల్ రక్తి మీఱఁ
దృప్తి నొనరింప నస్త్రాధి దేవతలకుఁ
బందెమునకైన మాఱొక్క భటుఁడు లేక
రుద్రసేనుఁడు విలసిల్లె భద్ర మొదవ. 204

ఉ. అంతట దుందుభిధ్వనుల నభ్రపథంబును నిండఁ జేసి సు
స్వాంతులు వేల్పు లెల్లరు నవస్ఫుట కల్పసుమాళి కాంస్యకృత్
కాంతుఁడు రుద్రసేనుపయిఁ గౌతుక మొప్పఁగఁ జల్లి రయ్యెడన్
వింతగ నమ్మహాత్ము పటు వీర్యము మెచ్చుచు నెమ్మనంబులన్.205

చ. అసురుల గెల్చి శక్రుఁ డమరావతికిన్ జనుకేతి శిల్పకృ
ద్విసర సభాస్థలంబునకు వీర జయాగత లక్ష్మి మోమునన్
మసలఁగ రుద్రసేనుఁ డతిమాన్యతతోఁ జని ధర్మపాలకున్
వెసఁ గని పాదముల్ తలకు వేఁడుకు సోఁకఁగ మ్రొక్కి యిట్లనెన్.

క. భవదీయాశీ ర్మహిమన్
శివ మలర నపార శత్రు సేనల వరుసన్
బవరమునఁ దునిమి యధికో
త్సవ మొప్పఁగఁ గంటి మిము ముదంబునఁ దండ్రీ! 207

క. అని సంగర వృత్తాంతము
వినయంబునఁ జెప్పి వేడ్క వెలయఁగ రత్నా
సనమందు రుద్రసేనుం
డనుపమ సౌఖ్యంబు మీఱ నంత వసించెన్. 208

వ. అంత నచ్చట. 209

క. హతశేషు లైన సైనికు
లతి విహ్వల మతులు మానవాధిపుని మహో
న్నత మందిరమునకుం జని
పతితో ని ట్లనిరి నమ్ర వక్త్రము లొప్పన్. 210

సీ. నిరుపమ బలుఁడైన నిత్యశృంగుం డీల్గె
వడి మహాసీలుఁడు పుడమిఁ గూలె
నంజనుం డనువాఁడు ననిలోనఁ దెగటాఱెఁ
దిరుహొత్తుఁ డా యమపురముఁ జేరె
రావుత్తు నశియించె రణరంగమునయందుఁ
బొన్నారు ప్రాణముల్ సున్న యయ్యె
వీరబాహుఁడు దివిఁ జేరి రంభను గూడె
ధర సుబాహుని యస్థితతులు డుల్లె

గీ. విజయశీలుండు రణమందు వ్రేటు వడియె
శత్రుభీముఁ డడంగెను సమరమందు
సకలసేనకు నాశంబు సంభవించె
రథ గజాశ్వ చయంబులు రాలె భువిని. 211

ఉ. తూఁచెడు కోలఁ బూని పటు దోర్బల మొప్పఁగ రుద్రసేనుఁడే
వీఁచ మడంచె సైన్యములఁ బెంపఱఁ జంపె మహోగ్ర దివ్యనా
రాచములన్ జమూపతుల రాజవరేణ్య! తదీయ యుద్ధ వి
ద్యాచతురత్వమున్ మహిత దైవతశక్తి వచింప శక్యమే. 212

చ. అతని మహాస్త్రశక్తి విపులాంబక లాఘవయుక్తి సద్భుజా
ద్భుత బలసక్తి వీరరణ ధూర్వహతాద్యనురక్తి భూరి సం
తత గిరితుల్య ధీరత గదాప్రధనోద్ధతి యెంచి చూడఁగా
దితిజవిరోధి యేని నెటు దీటగు వానికిఁ బార్థివేశ్వరా! 213

గీ. అనఁగ ధాత్రీశ్వరుఁడు మూర్ఛ నంది లేచి
రుద్రసేన పరాక్రమ రూఢి వెఱపుఁ
గొలుప సేనాపతులు నేలఁ గూలుటకును
గరము దుఃఖించి గెలు పెకఁ గలుగ దనుచు. 214

క. భటులకు శోకభరంబున
నిటు లనియెన్ సైన్యపతుల నెవ్విధమునఁ ద
త్కుటిలుఁ డగు రుద్రసేనుఁడు
గట కట తెగటార్చె నిట్లు కడిమి మగండై. 215

క. అన విని తద్భటుఁ డంతట
వినయంబునఁ బల్కె సమరవిధ మంతయు న
జ్జనపాలుఁడు చోళాంగుఁడు
తన మంత్రులఁ జూచి క్రోధ తత్పరుఁ డగుచున్. 216

ఉ. మంత్రు లటంచు మిమ్ముఁ గడు మన్నన మీఱఁగ నమ్మి మీదు దు
ర్మంత్రముచేతఁ గోల్పడితి మానిత యోధుల సైన్య మంత నే
తంత్రము నైనఁ బన్ని తగుదారిఁ గమింపఁగఁ జేయకున్న మీ
మంత్ర మహత్త్వమింక నవమానము పాలొనరించు మమ్ములన్. 217

క. ముందేమి జరుగునో వా
రందఱు ననుఁ గూల్చి పురమునందలి ధనమున్
సందడిఁగఁ గొందు రేమో
పొందుదుమో యెట్టి ఘోరపుం గష్టమ్ముల్. 218

క. యమ తుల్య సైన్యపతులున్
సమసిరి యా రుద్రసేన సంగరమునఁ ద
త్సములైన వాహినీశ
ప్రముఖులు భువిలోన నాకుఁ బ్రాప్తింతు రొకో. 219

మ. * హరుఁడో పంకజనాభుఁడో వరుణుఁడో యబ్జోద్భవుండో పురం
దరుఁడో కాక మఱొక్కఁ డిన్ని బలముల్ దాఁ ద్రుంపఁగాఁ జాలునే
నరుఁడా యాతఁడు చింత సేయఁగను నానా దేవతా శక్తులా
వర పంచానన వంశపావను నెడన్ వర్తించి దీపించెడున్. 220

క. అన విని మంత్రివరేణ్యులు
వినయంబున దోసిలొగ్గి వినతాననులై
యని రిట్లు తమ రొనర్చిన
పనియే సరిగా నొనర్పఁ బని యా మాకున్. 221

క. మీరెఱుఁగని దేమున్నది
నేరము మాయందుఁ జూప నేఁటికిఁ గలిగెన్
బోరాడ నూహ గలిగినఁ
దీరుం జెప్పితిమి యపుడు తిరముగ భూపా! 222

---

పాఠాంతరము

* మ. హరుఁడో పంకజనాభుఁడో వరుణుఁడో యబ్జోద్భవుండో పురం
దరుఁడో యాఁతడు చూడ నిన్ని బలముల్ దర్పంబునన్ ద్రుంపఁగా
నరుఁడే చక్రి యటంచు భారత కథల్ నానాఁటికిన్ విందుమీ
వర పంచాననవంశ పావను నెడన్ వర్తించె దత్ప్రోషిమల్.

ఉ. ఆరయ హేమ కాంస్య రజతాది సమంచిత లోహవస్తువుల్
కూరిమితోడ తన్ సరకుఁ గూర్చుచు నమ్ము విదేశవాస సా
ధారణ కాంస్యకారు లని తద్దయుఁ దోఁపఁగ విత్తకాంక్షచేఁ
జో రొనరింప నెంచితిమి ప్రన్నుతితో ధరణీతలేశ్వరా! 223

చ. పరుసపుఁ బల్కులన్ సచివవర్గము దూఱుట గాదు ధర్మ మా
దరమున నగ్రజన్ములకు దక్షిణమూల్య మొసంగకున్న సం
గరము ఘటిల్లె గెల్చి తిల గ్రక్కున నోడిన మమ్ము మెచ్చరే
దరమున గెల్పు లోటములు ధూర్జటి మూలమునం గదా ప్రభూ!

క. ఇసువృత్తికిం జనుమ మొన్నఁ జను
వజలము తత్త్వ త్సుకర్మ వశమునఁ దనరున్
వర దర్శనార్థ మగు నీ
గురు కారణమున బలంబుఁ గోల్పడితి నృపా. 225

క. ఈ చతుర కాంస్యకారుల
వే చని నిర్జింపకున్న వీరత్వంబే
రాచకుమారుల కనుచున్
నీ చతురత మున్నుఁ జూపి నిందించుటలే. 226

క. వినయమున సచివరత్నము
లన విని యిటు భూమినాయకాగ్రణి పలికెన్
మనమునఁ గోపము భయమును
వనజమునను మంచు పొదవు వైఖరిఁ దోఁపన్. 227

చ. గత మగు కార్యముం గుఱించి కంఠము వ్రయ్యుగతిన్ వచింపఁగా
హిత మొనరించునే యది సహింపను ముందిఁకఁ జేయు కార్యముల్
గుతుక మెలర్పఁగాఁ బలికె కూర్పుము మే లన లేచి మంత్రులం
దతి చతురుం డొకండు వినయంబునఁ దత్పతితోడ నిట్లనెన్. 228

ఉ. క్షేమ మెలర్ప శిల్పికుల సింహుల నేక్రియ నైనఁ బన్ని బల్
సామముచే జయించుటయె సత్కృతి వేఱొక మార్గ మానినన్
గామిత కార్యసిద్ధి తమకంబునఁ గాదని తోఁచె నాకు మున్
భీముఁడు భూరిసామమునఁ బేర్కొని ద్రుంపఁగ లేదె మాగధున్.

క. అన విని తత్సామం బే
పనుపునఁ జేయంగ నగును వారలతోడన్;
మనవి యొనర్పం డన సూ
రనమంత్రి వచించెఁ దా ధరారమణునితోన్. 230

వ. రాజోత్తమా! ఆగ్రహింపక నా మనవి సాకల్యంబుగా వినుము. కాంస్యకార వీరమహనీయుల చరిత్ర రహస్య విశేష విషయంబులు శ్రీమచ్ఛంకర గురునకుఁ బూర్ణంబుగాఁ దెలిసియుండు నాతనిం బిలిపించిన సర్వంబును విశదంబు కాఁగల దన నంత భూవరుండు సంతసంబున శంకరాచార్యుని రావించి భక్తిపూర్వకంబుగా నమస్కరించి సమరచారిత్రం బంతయు విన్నవించి యజేయులగు విశ్వకర్మాన్వయుల వధించు నుపాయంబు సత్యంబుగా నానతీయుండని ప్రార్థించిన శంకరుం డంతరంగమునఁ గొంత తడ వాలోచించి సత్యంబుగాఁ బల్కినఁ బ్రాణాపాయంబు నిక్కువం బైనను రుద్రసేనాదుల మాహాత్మ్యంబు భూలోకంబున శాశ్వతంబుగా నుండుటకు నిది యొక దైవకారణంబుగాఁ దలంచి నిజంబునే పల్కెద నని కృతనిశ్చయుండై వారల లోకోత్తర మహిమంబును మహాస్త్ర ప్రభావంబునుఁ గొంత బోధింపఁ దలంచి నృపాలున కిట్లనియె. 231

క. బ్రహ్మాస్త్ర ధరులు పంచ
బ్రహ్మలసన్మంత్రరాజ పారాయణులున్
బ్రహ్మ ముఖోద్భవులగు సద్
బ్రాహ్మణు లీ కాంస్యకార వరులు దలంపన్. 232

సీ. అంగషట్క సమన్వి తామ్నాయ తత్వార్థ
సారకోవిదు లైన సరస వరులు
విశ్వకర్మోద్దిష్ట విపుల పంచక్రియా
నైపుణ్య భూషిత నైజ మతులు
ఆశ్రిత వివిధ మంత్రాది దైవ మహాస్త్ర
లక్ష్మీ విరాజిత లలిత యశులు
చాప గదా ఖడ్గ చక్ర ముష్ట్యాద్యాహ
వక్రియా పారగుల్ వంశకర్త

గీ. లరయ నీ విశ్వకర్మ లటంచు వింటి
మీరు వాగీశ హరి హరాకారములగు
తేజములు గాఁగ నెమ్మదిఁ దెలియఁ బడిరి
మనుజ మాత్రులె యెంచఁగా మనుజ నాథ! 233

క. సులలిత బాలా దుర్గా
లలితా బగళాంబికాది లాలిత శక్త్యు
జ్జ్వల దివ్య మంత్ర మహిమలు
గల వారలు వారు మంత్ర కారులు దలఁపన్. 234

ఉ. శూలి కరంబునన్ మెలఁగు శూలము విష్ణుని చేత నొప్పు నా
భీల సుచక్ర మింద్రుకర పీవర వజ్రము వాని తూఁచు బల్
కోలకు సాటిగా వరులు కుంతితు తొమరు కేలఁ బూనినన్
గేల ధరింపకున్న నని గీటణఁగింపఁగ శక్య మా నృపా. 235

క. దండమున మను కులార్యుల
భండనమందుం జయింప బ్రహ్మములకున్
గుండెలు చెదరును మీరలు
చెండాడఁ దలంపఁ గీడు సిద్ధము సుమ్మా. 236

సీ. శుక్రవారమున నిర్వక్ర తులాదండ
మమరంగ యంత్రంబునందు నునిచి
గురుసర్వశక్తు లం దిరవుగా స్థాపించి
సురుచిర పూజల గరిమఁ జేసి
మఱునాఁట నుద్వాస మంత్రసంస్కృతిఁ జేసి
తాము ముట్టుదు రిది తథ్య మరయ
సితవారమున దానిఁ జే పట్టఁగాఁ గోర
రా దినంబున వారి నేది యేని
గీ. సామ మొనరించి యీ సభాస్థలికిఁ బిలువ
వశ్య లౌదురు వారల వధ మొనర్ప
వచ్చు నిటు గాక మనకును వశులు గారు
చోళ భూవర ! విను మయ్య సుస్థిరముగ. 237

వ. నీవు ప్రియశిష్యుండవు గావున నిక్కంబు వచించితి. వారలకుఁ గీడు దలంచుట సకలారిష్టంబులకు మూలకారణంబు వారలు మహా కారణజన్ము లని యెఱుంగు మన వల్లె యని తత్క్షణంబ శంక రుని నిజాశ్రమంబునకుం బోవ నియమించి తన మనంబునఁ దనరు కపటోద్యోగంబున నమ్మానవాధీశుండు మంత్రియగు సుంకర సూరన్న కి ట్లనియె. 238

ఉ. సుంకపు టాశ వీడి యతి సుందర దర్పణ హేమ మిచ్చియున్
బొంకమునన్ బహూకృతు లపూర్వముగా నొనరింప రాజు తా
బింకము మాని రమ్మనియెఁ బ్రీతిగ సమ్మతి నంచు వారి నే
వంకను నైన మన్నిలయ వాసులఁ దప్పక చేయు మి య్యెడన్. 239

క. ముకురముల ధనము నీయక
ప్రకటితముగ ధర్మ మగునె పన్నడుగంగన్
వికలుష వృత్తి నొనర్పఁగ
సుకరములగు కార్యములును జోద్యముగఁ జెడున్. 240

ఉ. కాన జగత్కరాన్వయ ప్రగల్భుల పాదము లాశ్రయించి స
న్మానమునన్ మదీయ వర మందిరసీమకుఁ దోడితెమ్ము నీ
ప్రాణము మాన మీ క్షణమ పాపుదు నట్లొనరింప కుండినన్
న్యూనత లేదు మంత్రివర! న్యూనత భూపతినైన నాకగున్. 241

మ. అను రాజేంద్రుని శాసనంబు సచివుం డాలించి యెంతే మనం
బున దుఃఖించుచు రుద్రసేనుకడకుం బొల్పొందఁ బోకుండినన్
జని యవ్వీరుల మద్వచః ప్రతతిచే శ్లాఘించి తే కుండినన్
జననాథుండు మదీయ మస్తకము నిచ్చం దీయుఁ గాన న్వడిన్. 242

క. వారలకడ కేఁ బోయెదఁ
గోరిక కొనసాగదే నకుంఠిత శక్తిన్
వారలతోఁ బో రొనరిచి
ఘోర తులాదండ నిహతిఁ గూలెద ననుచున్. 243

వ. నిశ్చయించి. 244

మాలిని. పంచముఖ విలాసా! భవ్య కైలాస వాసా!
చంచ దఖిల భాసా! శాశ్వ తామ్నాయ భూసా!
అంచ దఘ వినాశా! యద్రిజా హృన్నివేశా!
పంచశర వినాశా! బ్రహ్మవంశ ప్రపోషా! 245

గద్యము. ఇది శ్రీమదమల హరితసగోత్రపవిత్ర బొమ్మకంటి సాంబ
శివార్యపుత్ర పార్వతీకళత్ర కరుణాకటాక్ష వీక్షణపాత్ర
ప్రభాకరకవి ప్రణీతంబైన ధర్మపాలవిజయంబను మహా
ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

ఓం

శ్రీ గురుభ్యో నమః

# ధర్మపాల విజయము

## తృతీయాశ్వాసము



రమ్య చంద్ర భూషణ!
కారుణ్య సుధా ప్రపూర్ణ! గౌరీ రమణా!
పారీణ వ్యాకరణ వి
చారణ మహితాంజనేయ సన్నుత చరణా! 1

ఉ. ఆ చతురుండు మంత్రి వినయంబు నటించుచు వారి పాలికిన్
వే చని ధర్మపాల ముఖ వీరుల పాదములందు వ్రాలియున్
గాచుఁ డటండు మ్రొక్కుచును గద్గద కంఠరవంబు మీఱఁ గా
ర్యోచితరీతి నిట్లనె మహోన్నత కీర్తికి ధర్మమూర్తికిన్. 2

ఉ. మందర ధీర చోళపతి మక్కువ మీ ముకురార్థ మిచ్చి బల్
విందు లొనర్చి పీడియము వేడ్క నొసంగి బహూకరింపఁగాఁ
బొందుగఁ దోడి తెమ్మనుచుఁ బుచ్చఁగ వచ్చితి నయ్య! రాజు మీ
కందఱకున్ నమస్కృతులు హర్ష మెలర్పఁగఁ జేసె వాసిగన్. 3

క. మీ రటకు రార యేనిన్
ఘోర తులా దండ నిహతిఁ గూల్చుఁడు నన్నున్
శ్రీ రమ్య పదముఁ జెందుదు
భూరమణుఁడు సంప జిత్త వోర్వదు నుర్విన్. 4

చ. శరణను వారి రక్షణము సల్పుట మీ కులమందు సత్యమై
వఱలును మున్ను భార్గవు నవార్యరణోద్ధతి కోడి హైహయుల్
గురు లగు యుష్మదీయ కుల కూట నివాసులఁ జేరి వేడఁగాఁ
గరుణను బ్రోవలేదె యటు గావుఁడి మీరు దయార్ద్ర దృష్టితోన్. 5

క. జరిగిన నేరము లెంచక
మురువున నా మనవి వినుఁడి ముఖ్యంబుగ భూ
వరుఁ డిక మన్ననఁ గైకొని
గురు బహుమానంబు లందికొనుఁడీ మీరల్. 6

మ. అటు లా మంత్రి యపూర్వవాక్యజలధారాళిన్ లస త్కాంస్యకృ
త్పటుకోపాగ్ని నడంచి చిత్తముల నొప్పన్ దా దయాబీజ ము
త్కట వృద్ధిన్ దగ సేయ నేర్పు వెలయంగా ధర్మపాలుండు దా
నిటు వల్కెన్ సుత వర్యులన్ వరుసగా నీక్షించి సానందుఁడై. 7

చ. బిరుదులు బీరమున్ మిగుల బింకములున్ విడనాడి నేఁడు భూ
వరుఁడు బహూకరింపగను బంచెను మంత్రినిఁ బోవకున్నచోఁ
బరు లిల నవ్వరే మనలఁ బార్థివు చెంతకుఁ బోయి చూడఁగా
వెఱచి రటంచుఁ బోఁ దగును వే నృపు కొల్వునకంచుఁ బల్కఁగన్. 8

ఉ. అంతట రుద్రసేనుఁడు మహాగుణభద్రుఁడు భద్రసేనుఁడున్
శాంతుఁడు నింద్రసేనుఁడును సమ్మతితో జనకాజ్ఞ యంచు వి
శ్రాంతి గృహాభిరక్షణము సల్పఁగ నచ్చటఁ దండ్రినుంచి య
త్యంత ముదంబుతోఁ జనిరి యత్తఱి మంత్రిసమేతులై వడిన్. 9

క. చని వారలు మది మోదము
కొనసాగఁగ మిగులఁ గొల్వుకూటమున మహా
సనమున విలసిలు నృపతిన్
గనుఁగొనఁగా నృపుఁడు లేచి కడుఁ బ్రీతుండై. 10

క. సురుచిర పీఠ త్రయమున
వఱలఁగ వసియింపఁ జేసి వారల నంతన్
బుర మెచటఁ బేరు లెయ్యవి
వర వంశం బెద్ది తెలుపఁ బ్రార్థింతు ననన్. 11

వ. వారలలో రుద్రసేనుం డను వీరుండ వ్వసుమతీకాంతున కిట్లనియె. 12

సీ. మహి మించి విలసిల్లు మాళవ దేశంబు
నందున మేటి కల్యాణ నగర
మస్మన్నివాస మే మగ్ర వంశజులము
ధర్మపాలుండు మా తండ్రి దనరు
రుద్రసేనుఁడ నేను భద్రసేనుఁ డతండు
నింద్రసేనుఁ డితండు నెల్ల చోట్లఁ
గాంస్య పాత్రాదులఁ గ్రమముగా నమ్ముచు
నృప పూజనము లంది నియమ మెసఁగఁ

గీ. గంచి కామాక్షి నేకామ్ర కాంతుఁ గొలిచి
ధరణిఁ బాలించు మిముఁ జూడఁ దలఁచి రాఁగ
దయ దలంపక మీ రనాదరముతోడఁ
జూచుటయు మాకు నెంతయుఁ జోద్య మయ్యె. 13

వ. అంత భద్రసేనుండు పృథ్వీశున కిట్లనియె. 14

సీ. ఘన విశ్వకర్మ జగద్గురు రాజిత
పంచ ముఖోద్భవ బ్రహ్మ ఋషులు
తత ఋగాది త్రయాథర్వణ ప్రణవాఖ్య
పంచ వేదాంచిత బ్రహ్మ ఋషులు
చయన సాంతపనాది సర్వ యజ్ఞాళి ని
ర్వహణ ధూర్వహ పర బ్రహ్మ ఋషులు
నాయస దారు తామ్రాది లోకాధార
పంచ కర్మలు గల బ్రహ్మ ఋషులు

గీ. నరయ బ్రహ్మ విష్ణు హర పాక శాసన
భాస్కర స్వరూప బ్రహ్మ ఋషులు
సృష్టి కాది పురుష సింహు లవ్వారి స
ద్వంశమందుఁ బుట్టి పఱలి నాము. 15

వ. పిమ్మట నింద్రసేనుండు భూధవున కిట్లనియె. 16

ఉ. పూని సమస్త లోకములఁ బొల్పుగ సృష్టి యొనర్పఁ బ్రోవ సు
జ్ఞాన విశుద్ధ మార్గముల సంతతమున్ ఘటియింపఁ బొల్చు స
న్మానిత కీర్తి సానగ సనాతన ప్రత్న సుపర్ణ నామకా
భూన ఋషుల్ ప్రవర్తిలిన పూత మహీసుర వంశమో నృపా! 17

వ. అనినంతఁ జంద్రాఖ్యుం డగు మంత్రి విశ్వకర్మ సముద్భూతు లైన
ఋషివర్యుల విస్తృత చరిత్రం బానతీయుం డన భద్రసేనుం డమ్మహీ
పతితోఁ దమ వంశానుక్రమం బి త్తెఱంగునఁ దెలుపం దొడంగె.

గీ. ఆ విరాడ్విశ్వకర్మ పంచాననంబు
లమరు చుండును వామదేవాది నామ
ములఁ దదాస్యంబులను సముద్భూతు లైరి
సానగాదులు జ్ఞాన విజ్ఞాన నిధులు. 19

సీ. మొదట సద్యోజాత ముఖ సంభవుండగు
సానగ బ్రహ్మ ఋక్శాఖ వాఁడు
వామదేవ ముఖోద్భవ సనాతన బ్రహ్మ
సంస్తుతామల యజుశ్శాఖ వాఁడు
అల యఘోరాస్యజుం డహాభూనుఁ డను బ్రహ్మ
జగదీడితుఁడు సామశాఖ వాఁడు
తత్పురుషాననోద్భవుఁడు ప్రత్న బ్రహ్మ
సరవి నథర్వణ శాఖవాఁడు

గీ. పరగ నీశాన ముఖజ సుపర్ణ మౌని
ప్రణవశాఖ జనించి రీ పంచశాఖ
లందునన్ నూట యిరువది యైదుగు రగు
బ్రహ్మ ఋషులు తదన్వయ బ్రాహ్మణులము. 20

చ. చెలిమి యొనర్పఁ బ్రాణములు చేకొన నిచ్చెద మయ్య యో నృపా
బలిమి నడంప నెంచ నరపాలకు లైన భయంబు లేదు మా
కులగత ధర్మ మిట్టి దని కొంకక పల్కఁగ విశ్వకర్మ స
త్కులజులు నమ్మనట్లుగను గూర్మి నను న్నరపాలుఁ డయ్యెడన్.

వ. ఓ మహాత్ములారా! మున్ను భార్గవునకు భయంపడి శరణాగతులైన భూపాలుర నాదరించిన మీ యాశ్రిత వాత్సల్యంబు వర్ణింప శక్యంబు గాదు. కావున నా యపరాధంబుల సైఁచి నా చేయు సత్కారంబులం గైకొనుం డని ప్రార్థించి. 22

సీ. మంత్రివర్యునితోడ మానవాధీశ్వరుం
డిట్టుల వచియించె నింపు మీఱ
ని మ్మహీసురులకు నిమ్ముగాఁ దల లంటి
యిష్ట మృష్టాన్నముల్ తుష్టిఁ గుడువ
యత్నంబు సేయుమీ యని యాజ్ఞ యిడి తాను
బ్రాజ్ఞులౌ వారి యనుజ్ఞ నంది
తన మందిరాంతరంబున కేఁగ సచివుండు
తగు యత్నము లొనర్చి మిగుల వేడ్క

గీ. జెట్టివారలఁ బిలిపించి శీఘ్రముగను
రమ్య మైనట్టి సౌవర్ణ రత్న పీఠ
ములను మాణిక్య మంటపస్థలి నమర్చి
యడఁకువను శిల్పి వరులతో ననియె నిట్లు. 23

క. సురుచిర విశ్వకృ దన్వయ
వరులారా! జలక మాడ భవ్య స్థితితో
గురుపీఠముల వసింపుఁడి
యరుదగు నృపు వాంఛఁ దీర్పఁ దనఁగా వారల్. 24

క. ముదమునఁ బీఠ త్రయమున
నదనుగ వసియింప నాపితాళులు వరుసన్
సదమల తైలము శిరముల
తుద నంటిరి చూడ నగరు ధూపము లలరన్. 25

గీ. అంత మంత్రీశ్వరుఁడు కోప మడర ధర్మ
పాల సూనుల శోభన శీల యుతుల
దుష్టుఁ డగుచును వంచింపఁ దొడరి భటులఁ
జుట్టు ముట్టంగ నియమించి యిట్టు లనియె. 26

శా. సుంకం బీయుఁడి కాంస్యపాత్ర తతికిన్ జూడంగ నెచ్చోటి కే
వంకం బోయెద రెంచఁగా శలభముల్ వహ్వారె! మత్పాణులన్
బొంకం బెంతయుఁ బాసి చిక్కితి రిఁకన్ బోల్పొందు మీ ప్రాణముల్
గ్రుంకం జేసెద మెట్లొనర్చినను మీకుం దిక్కు లే దిచ్చటన్. 27

వ. అను నా సూర నాఖ్యుతో నొండొక మంత్రి దర్పణంబుల మూల్యం
బలంతియే కదా వీట నమ్మిన కాంస్య వస్తు జాతమ్మునకుఁ గరంబు
కోటి నిష్కంబు లగు నాకరంబు చెల్లింపకున్న వీరి ప్రాణంబులు
దీయుటయే కర్తవ్యం బనుచున్నంత నా భద్రసేన శిల్పి యిట్లనియె.

శా. ఈ రీతిం గర మీయు మం చడుగఁగా నెట్లీయఁగా వచ్చు నే
దూఱం దూఱెదఁ గ్రమ్మఱన్ గళములన్ ద్రుంపంగ నేఁ ద్రుంతు ని
ట్లే రా జే నెపుడైన నే నగరమం దీ కాంస్య రూపాళికిన్
దోరంబౌ కర మిమ్మటంచు నెచటన్ గోరంగ లే దారయన్. 28

క. అన విని మంత్రి వరేణ్యులు
జనపతి కడ కేఁగి వారి సంగతిఁ జెప్పన్
విని నరనాథుఁడు మంత్రుల
కనియెన్ డెందమునఁ బొదలు నతికోపమునన్. 30

మత్తకోకిల.

తూఁచు కోలలు లేక యున్నవి దుర్బలత్వము శక్తియుక్
గాచదున్ సితవార మాటను గాంతుఁ జంపఁగ వారలన్
గోఁచు లుంచి త్రిగోపురంబుల గొంతుబంటిగఁ బూడ్చి మా
రాచవారి చలంబు మీఱ బిరానఁ ద్రుంపుఁడు శీర్షముల్. 31

క. త్రుంచెదు నప్పుడు ముమ్మా
అంచితముగఁ గరము నీయఁ డని యడుగుఁడి వా
రెంచి కర మిచ్చి వేఁడినఁ
బంచుఁడి శిఖ లైనఁ గోసి ప్రతికర్మముగాన్. 32

వ. అను నంత నచ్చట సంతత డోలాయమాన మానసులై భద్రసే
నేంద్రసేనులు మంత్రి కృత దుర్మంత్రంబునకుఁ బ్రతీకారంబు చింతింప
నేరక విచారించుచున్న యెడ రుద్రసేనుండు సహజన్ముల నుపలక్షించి
యిట్లనియె. 33

సీ. భార్గవదిన మిది భద్రముల్ పెంపొందఁ
దూఁచుకోలల పూజఁ దొలుతఁ జేసి
యమరంగ నుంచితి మవి దాఁకగా రామి
నిట్లు వచ్చితిమి యదృశ్య కరణ
శక్తియు నితరాస్త్రశక్తి దీక్షాయుక్త
మి వ్వారమం దేవి నివ్వటిలవు
నుంకంబు నొసఁగిన బింక మంతయుఁ బోవు
నిల జనంబులు శౌర్య హీను లనరె

గీ. దోర్బలంబున మద మత్త దుష్ట భటుల
నిగ్రహించుట శక్యమే నిరుపమాన
బలముగల మువ్వురము లసత్ప్రౌఢి మీఱ
నస్త్రములఁ దూఁచుకోలలు నమర కున్న. 34

వ. అని గాఢంబుగా నాలోచించి మఱియు నిట్లనియె. 35

క. మును శక్తి వర మొసంగెను
ఘన భక్తిని వేఁడ మీఁదు కంఠములు రిపుల్
సునిశిత ఖడ్గం బుల చేఁ
దునుమఁగ నిలఁ బడక మృతిని దొలఁగుదు రనుచున్. 36

సీ. సితవార మిది శాస్త్ర సిద్ధాస్త్రములఁ బన్నఁ
గులముఁ గూల్చును దేవి కుపిత యగుచు
ధరణికోలలు లేవు తగ శత్రులను గూల్ప
దోర్బలం బిఁకఁ జూప దుస్తరంబు
సర్వ సేనల నిప్డు చయ్యన ద్రుంచియు
సుంక మా నృపునకు సొరిది నొసఁగ
మును గొన్న గెలు పెల్లఁ జను నిరర్థక రీతి
బింకంబు మీఱునే యింక మనకుఁ

గీ. గాన మంత్రులు శిరములఁ గడఁగి త్రుంప
మింటి కేతెంచు నవి తెల్వి మీఱఁ గాంచి
ధర్మపాలుండు మన తండ్రి తడవు లేక
శాంభవిని వేఁడి బ్రతికించు సత్వరముగ. 37

వ. అని యా భూదేవత్రయ జ్యేష్ఠుండు సోదర ద్వయంబునకు ధైర్యంబు గఱపి మనకుఁ బునర్జీవిత్వంబు సిద్ధాంతంబని మంత్రులారా! వేగంబ మీ రాజాజ్ఞ నిర్వర్తింపుఁడు. ఆపై జరుగు విశేషం బారయుదురు గాక యను నంత. 38

సీ. రుద్రసేను నొకండు భద్రసేను నొకండు
నింద్రసేను నొకండు నెనసి పట్టి
కరము శాలాద్వార వర గోపురంబుల
ముచ్చోటఁ గొని పోయి మచ్చరమున
గోతులఁ ద్రవ్వించి నీతిమంతుల శిల్ప
కారులఁ గంతాల కడకుఁ బూడ్చి
ఖడ్గముల్ పైకెత్తి కాంస్యకారకులార
పన్నీయరా యని పలుక నంత

గీ. మువ్వు రొకరీతిఁ బల్కిరి నొవ్వ కుండఁ
బ్రాణ మేటికి మానంబు వాసె నేని
సుంక మీయము మృతి భీతి సుంత లేదు
తలలఁ గొట్టుఁడి రాజాజ్ఞ తలఁబఁ దాల్చి. 39

వ. వెండియు నా రుద్రసేనాదులు క్రమంబున నిట్లనిరి. 40

సీ. నిరపరాధులఁ బట్టి నిర్దయతోఁ జంప
యత్నించువాఁ డెట్టి యవని వరుఁడు
మఱు మాయ కాండ్రగు మంత్రుల మాటలు
విను నట్టివాఁ డెట్టి మనుజ విభుఁడు
భండనంబున నరి బారికి వెఱ పొంది
శరణను వాఁ డెట్టి క్షత్రియుండు
నెమ్మని విందుకై రమ్మని పిలిపించి
తల లూచ్చు వాఁ డెట్టి ధరణి నేత

గీ. యిట్టి దుర్మార్గ గమన విహీన బుద్ధి
యిట్టి నీతి విదూరుఁడు నిట్టి నీచుఁ
డిట్టి వంచకుఁ డిల నిఁకఁ బుట్టఁ డనుచు
మనమునం దెంచుఁ డో దుష్ట మంత్రులార! 41

సీ. ఎదిరించి పోరిన మద మడంతు మటంచు
మది నెంచితిరె మాయ మంత్రులార!
యెకిమీఁడు మీ కంద ఱకు మ్రొక్క రం డంచుఁ
గొని వత్తురే మమ్ము కుజనులార!
యెన్నఁ డేనియు మీకు నెగ్గొనర్చితిమె మే
మరయంగఁ గపట దుష్టాత్ములార!
యిల నేలి నట్టి భూతల నేతలందు నిం
తటి మూర్ఖుఁ డుండెనే కుటిలులార!

గీ. కన మిఁ కింతటి నీచు మందునకు నైనఁ
గట్టుకొనుఁ డింకఁ దలపైనిఁ గాంచిపురము
గాంచెదము మేము శాశ్వతాగణ్య యశము
సత్యమే వృద్ధి యగుఁగాత! జగతియందు. 42

క. శాత్రవ శేషము తగ దని
ధాత్రిని వచియింతు రార్య తతి సతతము మీ
గాత్రము లిలపైఁ గూల్చినఁ
బాత్రుల మగు మాకు నింత ప్రాప్తించు నొకో. 43

వ. అని రుద్రసేనుండు నిశ్చల చిత్తంబున నొకింత కాలము కామాక్షీ దేవినిఁ దలంచి జ్ఞానదృష్టిచే సర్వంబు నెఱింగినవాఁడై యోరి మంత్రీ! సూరనా! యీ ఘోరకృత్యంబునకు నీవు మూలకారణంబుగా నిల్చి శంకర వాక్సాహాయ్యంబున భూపాలు నాజ్ఞ వడసి యస్మచ్ఛిరో హరణంబుఁ గావింపఁ దలంచితివి కావున ధర్మహర్మ్యంబులతో విరాజిల్లు కాంచీపురంబున మీ రాజభవనాది సర్వంబును భస్మం బగు ననియును మఱియు మీ రాజేంద్రునివలన నకారణంబుగా నీ శరీరంబు ఖండ ఖండంబులుగాఁ జేయంబడి కాక గృధ్రంబులకు విందొనర్పంబడు ననియు ధర్మదూరుం డగు నీ రాజేంద్రునకు రాజ్య పద భ్రష్టతయు వంశం బీతనితో నంతంబును మిత్రత్వంబు మఱచి

మా ప్రాణంబులు దీయు పరము రహస్యంబు రాజునకుం దెల్పిన శంకరాచార్యునకు మతేతరులవలన దుర్మరణంబును నాతని పీఠంబున కపూజ్యతయు శాశ్వతాపయశంబును నగుట సత్యం బనియును శపియించిన నంత మంత్రులు కోపోద్దీపిత మానసులై యిట్లనిరి. 44

ఉ. సేనలఁ జంపి సైన్యపతి సింహులఁ గూల్చిన మిమ్ముఁ ద్రుంపఁగా
నూనిన మా నృపాలుఁ డఘ మొందఁ డటం చని వాఁడి ఖడ్గముల్
పూనుచు ధర్మపాల వర పుత్త్రుల కంఠములన్ ద్రిభూములన్
బూనికఁ ద్రుంప రక్త మటు పొంగి స్రవించె భయంకరంబుగన్. 45

క. అటు దునుమఁగ నా శిరములు
పటుగర్జిత రావ మొదవ బహు రయమున భ్రూ
కుటు లదర నెగసె మింటికిఁ
బొట పొట యని రక్త ధార భువిపైఁ బడఁగన్. 46

క. అతిభీతి నొంది మది దు
ర్గతి నణఁగును రాజుఁ బురముఁ గల సంపదయున్
వెత లిట్లు గలిగె మన కని
మతి వగచిరి మంత్రు లట్టి మహిమం గనుచున్. 47

సీ. కర్ణాంత విశ్రాంత కాంత నేత్రంబులు
ఖరకర కిరణాళి గరిమఁ దనర
బ్రహ్మాండ కుహరంబు ప్రతిరవంబులు సేయ
గర్జిత ధ్వానముల్ గడలు కొనఁగఁ
బ్రళయ కాలాభీల భాను దీప్తులఁ బోలు
బెడఁ గగు వెలుఁగు లెల్లెడలఁ గలయఁ
గంఠమాత్రోదిత ఘన నాసికా వాత
జాలముల్ మేఘాళిఁ గూలఁ ద్రోయఁ

గీ. గంఠములనుండి నెత్తురు ల్గారు చుండ
వీటి జను లెల్లరుం జూచి వెఱఁగు పడఁగ
నాకసంబున ఖగముల ననుకరించి
భ్రమణ మొనరించె శిరములు భయద రీతి. 48

క. నరపతి యవ్విధ మంతయు
నురువడి విని భటులవలన నొంది భయంబుం
దిరిగెడి శిరములఁ గని తన
శిర మెంతయు వంచి దుఃఖచిత్తుం డయ్యెన్. 49

ఉ. అంతట ధర్మపాలుఁడు సభాంతరమందు ఘనారవంబుగా
స్వాంతమునందుఁ దోఁప నటు చేయ్యన లేచి వియత్తలంబునన్
వింత వడన్ భ్రమించు సుతవీరుల మస్తక పంక్తిఁ జూచి ప్రా
ణాంతము గాఁగ మూర్ఛిలి మహాత్తర శోక సముద్ర మగ్నుఁడై. 50

సీ. హా రుద్రసేనాఖ్య! హా భద్రసేనాఖ్య!
హా యింద్రసేనాఖ్య! హా గుణాఢ్య!
హా వేదవిదులార! హా వీర వరులార!
దీపిత రవికోటి రూపులార!
దుర్మార్గుఁ డగు రాజు దుస్తంత్ర మెద్దియో
కల్పించి శిరములు గడఁగి ద్రుంచె
నే నేల పో నైతి మానవేశాధము
మందిరంబునకును మతి దొలంగె

గీ. ననుచు నడలుచుఁ గన్నీళు లతిశయింప
ధర్మపాలుఁడు సుతులను దలఁచు కొనుచు
శంకరాచార్య మానీంద్రు సదనమునకు
వేగ విచ్చేసి యతి కిట్లు విన్నవించె. 51

మ. యతివర్యా! భవ దాదరంబునను మే మా వేళ నిప్పీటిలోఁ
గుతుకం బొప్పఁగ వస్తు విక్రయమునన్ గూర్మిన్ వసింపంగ భూ
పతి సత్పుత్రిక దర్పణంబుఁ గొనె; ద్రవ్యం బీయుఁడీ యన్న మ
త్సుత శీర్షంబులఁ ద్రుంచె రాజు తగునే దుర్నీతి హర్షింపఁగన్. 52

క. ముకురార్థ మీయ నొల్లక
సకుటిలుఁడై సుంక మిచ్చి చనుఁ డని పలికెన్
వికటమతి నృపుఁడు మే మా
ముకుర ధనంబునకుఁ బోర, మూర్ఖత మీఱన్. 53

చ. ఇరువది మంది శూరులను నీ పురనాథుఁడు మమ్ముఁ ద్రుంపఁగా
నురువడిఁ బంప మత్తనయుఁ డుజ్జ్వలుఁడై తెగటార్చె వారలన్
గరిమ ననేక సేనలను గ్రమ్మఱఁ బంపినఁ గూల్చెఁ, బెగ్గడల్
సురుచిర సామ వాక్యముల సూనుల వే కొనిపోయి యంతటన్. 54

క. నరపతి శాలాంతరమునఁ
గరవాలాగ్రమునఁ ద్రుంప గగన తలమునన్
దిరుగుచు నున్నవి చూడుఁడు
వరుసను శీర్ష త్రయంబు పరమ మునీంద్రా! 55

వ. అని విలపించు ధర్మపాలునకు ధైర్యంబు గఱపఁ దలంచి శంకర
మౌని యిట్లనియె. 56

సీ. సకల శాస్త్ర జ్ఞాన సంపదచేఁ బొల్చి
ఘన మనీషుల మెప్పుఁ గాంచినావు
వేద విధ్యుక్త మౌ వివిధ కర్మల నెల్ల
జేజేలు మెచ్చఁగాఁ జేసినావు
ప్రీతి దాయక మైన భూత హితంబుచేఁ
బుడమిని సత్కీర్తిఁ బొందినావు

బ్రహ్మాదులకు నైనఁ బడయఁగా రాని శ్రీ
కామాక్షి సత్కృపఁ గాంచినావు

గీ. కాని సుతులు ఋణస్థులు గా నెఱింగి
బ్రహ్మవేత్త వనంగను బ్రతిభ నెగడి
చింత కెడ మీయఁ దగునె నీ చిత్తమందుఁ
జావు పుట్టువుల్ దేహికి సహజమె కద. 57

వ. అని మఱియు నమ్ముని చంద్రుండు చోళ భూపాలునకుం దెల్పిన
సత్యవచనంబులు రుద్రసేనాదుల శిరో హరణంబునకుఁ గారణం
బయ్యెనే యని మనంబున వగచుచు గగనంబునఁ దిరుగుచున్న
శీర్షంబులం జూచి రుద్రసేనాదుల ప్రభావంబున కచ్చెరు వంది
మహాత్ములగు నీ పుత్రుల నీ యిష్ట దైవం బగు కామాక్షీదేవి లబ్ధ
జీవులనుగాఁ జేయుట నిక్కువంబు. కావున శ్రీ కామాక్షీ దర్శనం
బావశ్యకం బనుచు ధర్మపాలునిం దోడ్కొని భువనకుక్షి యగు
కామాక్షీదేవి యాలయంబునకుం జని సకల లోక శరణ్య యగు
నద్దేవి పద జలజంబులకుం బ్రణమిల్లి నితాంత భక్తి సమన్విత చిత్తుండై
యిట్లు వినుతింపం దొడంగె. 58

క. జ్వలితేందీవర పతి శత
తులితే! సద్భక్త దురిత తూలాగ్నినిభే!
దళితేంద్ర వైరి మస్తక
లలితేందు కళా కలాప లసితే! లలితే! 59

క. సుగళే! పర్వత నిభ కుచ
యుగళే! నతభక్త వర మహోన్నత యత హృ
న్నిగళే! లోల కచస్థ
స్రగళే! గగనస్థ సోదర గళే! బగళే! 60

క. భర్గేంద్రాబ్జజ హరి సుర
వర్గేశ్వరి! మహిష దైత్యవర మర్దని! స
ద్వర్గే! భక్త త్రాణ ని
సర్గే! దుర్గే! మునీశ సంస్తుత మార్గే! 61

క. బింబోష్ఠి! చికుర జిత రో
లంబే! జగదేక జనక లాలిత సుత హే
రంబే! సైకత రుచిర ని
తంబే! హృత ఘోర దైత్య దంభే! అంబే! 62

క. (శ్రీ) లేఖర్షభ ముఖ సుర
పాలే! అర్ధేందు తులిత ఫాలే! రక్షః
కాలే! పాలిత వర ముని
జాలే! దాక్షిణ్య గుణ విశాలే! బాలే! 63

క. రుద్రేప్సిత దాయిని! అ
క్షుద్రేంద్రాజాది వినుత సుగుణే! విగళ
న్నిద్రే! కర సురుచిర చి
న్ముద్రే! కరుణా మహా సముద్రే! భద్రే! 64

క. కామాక్షి! సకల దివి సుత
భీమాక్షీణ ప్రతాప భీరు సుభక్త
ప్రేమాక్షిప్త కటాక్షే!
రామాక్షి! ముకుంద సేవ్య రాజిత రూపే! 65

వ. అనుచు నిట్లనేక ప్రకారంబుల నమ్మునిచంద్రుండు మనోరంజకంబుగా వినుతింప నంతఁ దరుణారుణ కిరణావహ చరణాభరణ మంజీర మంజురవ సంజాతానంద ప్రదాయిని యై, కందర్ప కప్ర ప్రభాస్ఫీత నారాచపూరిత తూణీర జంఘాద్వయ శోభాయమాన యై, జృంభ

చ్చాతకుంభమయ రంభా స్తంభ దంభ నిర్వాపణాతిశయ రుచిరోరు ద్వయ విరాజమాన యై, శరత్కాల గంగాతరంగిణీ పరిత్యక్త మహోత్తుంగ పులినలీలా విశాలనితంబబింబోపరి చంచలాంచత్కనక కాంచీ విరాజిత మాణిక్యఘంటా వేష్టిత కన త్సువర్ణ దుకూల యై, మేరు ధరాధర వరాకార పయోధర పరిచ్ఛన్న తారహార విరాజ మాన యై, సురుచిర రుచినికర విరచిత తరుణారుణ కంచుకోపరి భ్రాజమాన కనక భుజబంధ భూషణ యై సమస్తలోక ప్రశస్త సౌందర్య లహరీ యుత ముఖసరోజ విరాజితాకర్ణవిశ్రాంత నేత్రాంచల విస ర్పిత కామేశ్వర మనః ప్రవృద్ధ కామాంకుర జీవనీభూత క్షీరోదధి వీచీ సంకాశ కటాక్ష వీక్షణ సముద్భాసమాన యై, శరచ్చంద్ర చంద్రికా సాంద్ర దరహాస పూరిత హృదయంగమ విద్రుమరాగ సంపాదక తాంబూల చర్వణ క్రియా చలిత పల్లవాధర యై, ముఖపం కజ మరందాయమాన సుకవి వర్ణిత భారతి యై, కందర్ప కోదండ దర్పాపహారి భ్రూలతామధ్య నిర్మిత కస్తూరికారేఖా తృతీయనేత్ర శోభితయై, మహేంద్రనీల మాలా వినీలాలక శోభి ముఖపంకజ యై; వాసుకి విభాసమాన కచశ్రేణీ వినిర్మిత వేణి యై, రాజకీర పంకజ కోక సంకలిత నఖర లాలిత చూతపల్లవ కరకంజ యై, సర్వభక్త హృదయ సింధు చంద్రోపమాన శరీర యై, దివ్య తేజః పుంజ విరాజ మాన యై, విలసిల్లి పూర్వ శిలారూపంబు ద్విగుణితంబు సేసి య మ్మహాదేవి పొడసూపఁ బరమానంద పూరిత హృదయ పంకజుం డగుచు శంకరుండు జగత్కర్త్రియగు తచ్చంద్రకళాభరణ కిట్లనియె.

మ. జననీ! త్వత్కరుణా కటాక్ష మతి విస్తారంబుగా వేనిపైఁ
గొనసాగుఁ భవబంధ మాతనికి వేకూలున్ భవత్సర్వలో
క నమస్కార్య పదాబ్జ సేవనమునఁ గల్యాణముల్ సేకురుఁ
నను ని వ్వేళ నభీష్ట మిచ్చి త్రిజగ న్మాన్యుం బొనర్పం దగుఁ. 67

క. అని వేఁడఁ ద్రిపుర సుందరి
మనమున భక్తానురాగ మహిమ సెలంగన్
ముని కిట్టు లనియె నెమ్మో
మున లేనగ వంకురింప ముద మొప్పారన్. 68

చ. అసమయమందు నన్ను సకలాగమ రూఢి నుతుల్ పొనర్ప నే
మి సభయ భూరి దుఃఖమున మిక్కిలి గుందఁగ నేమి యీ యెడన్
ముసలి యెవండు దీనతను మోమును గ్రిందికి వంచి నెమ్మదిన్
వ్యసనముఁ జెందుచుండె వర భక్తుఁడుగా మదిఁ దోఁచెఁ జూడఁగన్.

వ. అనిన విని య మ్మహాశాంకరికి శంకరాచార్యుం డిట్లనియె. 70

సీ. కల్యాణి! మయకృత కల్యాణపుర వాసి
ధర్మపాలుఁడు విశ్వకర్మ సముఁడు
సుతులు ముగ్గురు వీని కతులిత శక్తులు
వీరలు నలుగురు వేడ్క మీఱఁ
గాంస్యపాత్రల నమ్మఁ గంచికి రాఁ జూచి
చోళాంగు సత్పుత్రి చూడికుడుత
దర్పణ యుగ్మంబు ధర యీక కొని పోవ
నితని పుత్రుఁడు మూల్య మిమ్మనంగఁ
గీ. గట్టి వీరలఁ దెమ్మని కడఁగి రాజు
భటుల నంపంగ వారి దోర్బలము మీఱ
రుద్రసేనుఁడు వీని సద్భద్ర సుతుఁడు
దూఁచుకోలను దెగటార్చె దురమునందు. 71

క. అంతట నీ పురనాథుఁడు
మంతనమునఁ దగిన సేన మార్కొనఁ బంపన్
బంతమునఁ గూల్చె మనుకుల
కాంతుం డగు వీని సుతుడు గడిమి నొకండే. 72

వ. అంత. 73

శా. మాయోపాయము వన్ని వీని సుతులన్ మాత్సర్య భూయిష్ఠుఁడై
వేయల్కన్ దునుమాడ నాకసమునన్ విద్యుత్ప్రభాలీలమై
నో యంబా! తల లాడుచున్న వవిగో! యుగ్రంపుఁ ద్రేతాగ్నుల
ట్లీ యాశ్చర్యకర ప్రభావ మెటు తల్లీ! యబ్బెనో వారికిన్. 74

క. ముకురముల మూల్య మీయక
ప్రకటితముగ సుంక మీయ వలె నని యిట్టీ
యకలుషుల శిల్పి పుత్త్రుల
సకలుషమతిఁ గూల్చె రాజు జగముల తల్లీ! 75

వ. అను నంత శాంకరి శంకరాచార్యుం జూచి నిర్జరాదుల కభేద్యుం బగు మద్భక్తుల శిరోహరణంబునకు మూలాంకురంబు నీవ యైనను మద్భక్తుండ వగుటచే నియ్యది రుద్రసేనాదుల శాశ్వత ప్రఖ్యాతికిఁ గారణంబుగాఁ దలంచి నిన్నుఁ గరుణించితినే గాని రుద్రసేనుండు వచించిన శాపాంకురముల ఫలం బనుభవింపక తప్ప దని, మఱియును.

చ. అనువుగ దేవి యి ట్లనియె హా! మహనీయ మదీయ భక్తులా
ఘను లగు ధర్మపాల సుత కమ్ర శిరంబులఁ గొంక కీ గతిన్
జనపతి గూల్చెఁ గాన నీకఁ జయ్యన మూఁడవ కంటి మంటలన్
దనరఁగఁ జూచి తత్పురము దగ్ధము చేసెదఁ గంటె శంకరా! 77

గీ. ధర్మపాలుండు శ్రుతి హిత కర్మ రతుఁడు
రుద్రసేనాది పుత్త్రులు భద్ర మతులు
శక్తిపూజా ధురంధరుల్ చారు యశులు
వారి రక్షించు టది నా కవశ్య మిపుడు. 78

వ. అని పలుకుచున్న యా జగదంబను వీక్షించి ధర్మపాలుం డిట్లని వినుతించె. 79

దండకము. శ్రీమచ్చిదానంద రూపే, సదా సత్ప్రితాపే, మదేభేంద్ర
యానే, జగత్సేవ్యమానే, పదాసక్త లాక్షోరు పంకోజ్జ్వల ద్బాల
సూర్యప్రభే, దీయమానాఖిలోత్కృష్ట నానా శుభే, సర్వ సిద్ధోరగా-
దిత్య గంధర్వ విద్యాధరాద్యుత్తమాంగోల్లసన్మాల్య సంవాసితాంచ
త్పదే, సర్వ సంపత్ప్రదే, సత్యశీలే, నమ ద్దేవజాలే, జగత్సంఘ
మూలే, లస న్మౌనిపాలే, మహేశాన లోలే, మహా దైత్య కాలే,
కరాంచత్త్రిశూలే, కటీబద్ధ మాణిక్య కాంచీ కనద్భర్మ ఘంటా
కలాంచన్నినాదే, పరబ్రహ్మతత్వానుసంధాన మోదే, లసన్మంత్ర
వర్ణే, మహాకాంతి పూర్ణే,కనద్రత్నపీఠ ప్రదేశోల్లస ద్భార్గవీ భారతీ
రమ్య పాణిద్వయీ బద్ధ దివ్యప్రభోపేత సచ్చామరోద్ధూత బాలా
నిలాలోల నీలాలకాకీర్ణ ఫాలాగ్ర భాగే, జితేంద్రాది భోగే, వశీభూత
యోగే, జగత్ స్తుత్య సౌందర్య సార ప్రశస్తైక కాయే, మహాదేవ
జాయే, మహాయోగి గేయే, మహాచిత్ర మాయే, సుధీబృంద సేవ్యే,
పరాకార భావ్యే, స్తువద్రమ్య కావ్యే, ధరాధీశ కన్యే, విరించాది
మాన్యే, పయోరాశి వీచీభవ న్నైజ దృగ్జాల నిత్యోల్లసత్సద్దయా
పూర్ణ సద్వైష్ణవీ ముఖ్య సన్మాతృకా పూజితే, వాఙ్మనోऽతీత దివ్య
ప్రభావైక విభ్రాజితే, మేరుభూభృన్మహాగర్వ నిర్వాపణోద్యత్కుచ
ద్వంద్వ నిస్తంద్ర చంచత్సుముక్తావళీ మధ్య దీవ్యత్సుమాణిక్య
సంభాసితే, చందనావాసితే, యోగిరాట్పాలికే, వ్యాళ సన్మాలికే,
భక్త దుఃఖాద్రి నిర్భేదనాలోల వజ్రాయమానేక్షణే, లోక సంరక్షణే,
కీర పంకేజసత్కోరకాబద్ధ పాణిద్వయే,అద్వయే, శ్రీమహాకాంచికా
పత్తనైకామ్ర నాథేశ్వర ప్రాంత రాజన్మహాదివ్య మాణిక్య సంస్థాపి
తాశేష మర్త్యావళీ నిత్య పూజోల్లసత్పీఠ బిందు త్రికోణోపరి భ్రాజ
మానాష్టకోణాగ్ర బాహ్యస్థలాజస్ర రమ్యోపరిప్రాంత భాస్వన్మహా
నాగ పత్రోపరిభ్రాజదష్టద్వయాకార పత్రోపరి ప్రౌఢ వృత్తత్రయానంత
సద్వహ్ని చంద్రార్క సంఖ్యాక ధాత్రీ లసద్గేహ భాస్వన్మహామేరు
చక్రస్థితే, దివ్య సౌందర్య సంపూర్ణ సర్వాంగ లావణ్య సమ్మోహితా

శేష లోకైక సంపూజ్య కామేశ్వరాధీన శుంభన్మతే, కాళికే, రమ్యా కాంచీ మహానాయికే, సింహళాధీశి, కాశీ విశాలాక్షి, కాశ్మీర చాముండికే, దక్షవాటీ ప్రయాగా గయా ముఖ్య పుణ్యప్రదేశోల్లస ద్దివ్య నానావిధానూన రూపాభిధానే, లసత్సన్నిధానే, శ్రితానేక భక్తాళి వాంఛాప్రదే, మన్మనోఽభీష్టదే, కామనేత్రే, నమస్తే, నమస్తే, నమః. 80

చ. గగనము సర్వ భూతములఁ గప్పువిధంబు దలిర్ప నన్నిటన్
మిగుల వసించు నీ కొకటి మేము వచింపఁగ నేల సర్వమున్
దగులును నీ మనంబున ముదంబున నన్నుఁ గృపాబ్ధిఁ దేల్చుచున్
సుగతునిఁ జేసి దుఃఖముల స్రుక్కఁగఁ జేయుము లోకపావనీ! 81

చ. అరయ నవ గ్రహంబులు మహార్ణవముల్ తరు శైలముల్ మృగే
శ్వర గజ ఘోటముల్ గరుడ సర్పపతుల్ వర పంచ భూతముల్
గురు భవదీయ సత్కృప నకుంఠిత వృత్తిఁ జెలంగు లేనిచో
వఱలునె సర్వ భక్తకుల వాంఛిత దాయిని! లోక పావనీ! 82

వ. అనుచుం బ్రార్థింపఁ గామాక్షీ కరుణాకటాక్ష వీక్షణంబుల నిర్మలుం డగు ధర్మపాలుం గాంచి. 83

క. అనె దేవి మిగులఁ బ్రియమున
జనపతి శిక్షింతు నిపుడె చతురత శిరముల్
గొని రమ్ము పళ్లెరంబున
నను వొందఁగఁ జెప్పుమా మదాజ్ఞ యటంచున్. 84

చ. అన విని ధర్మపాలుఁ డతిహర్ష మెలర్పఁగఁ బళ్లెరమ్ము చేన్
వినయతఁ బూని తూర్పు నడువీధికిఁ బోయి కుమార శీర్షముల్
గనుఁగొని దేవి మీకు బ్రతుకం దిగి రాఁ దగ నాజ్ఞ యిచ్చె రం
డని పలుకన్ ద్రిమస్తకము లంతటఁ బళ్లెమునందు వ్రాలఁగన్. 85

వ. పుర జనంబులు తమలో ని ట్లనుకొనిరి. 86

చ. పరగఁగ సత్య ధర్మముల భంగ మొనర్చి నితాంత దుష్టుఁడై
నరపతి సచ్చరిత్రుల జనస్తవనీయులఁ గాంస్యకారులన్
శిరములఁ ద్రుంప దేవి తన చెంతకుఁ జేర్చుకొనెన్ దయార్ద్రయై, త
ద్వర గురుహత్య భూపతి కపాయము గూర్చుట నిక్క మారయన్.

వ. అంత. 88

క. పళ్లెరమునఁ గొని తలలన్
మెల్లఁగ న ద్దేవి పద సమీపమునందున్
బల్లిదుఁడు ధర్ముఁ డుంచఁగ
నుల్ల మలర లోకజనని యును నిటు లనియెన్. 89

ఉ. వీరలు చూడ సత్కులు పవిత్రులు శాంభవ శాక్త నిర్మలా
చారులు మ త్పదాబ్జయుగ సక్త విశాల మనస్కు లౌట, నిం
పారెడు వీరి శీర్షముల నందఱు మెచ్చఁగఁ బౌర వీధులం
దారయఁ జూపి రమ్మనఁగ నా మహనీయుఁడు ధర్మపాలుఁడున్. 90

చ. శిరముల పళ్లెరంబుఁ గొని శీఘ్రగతిం జని వీధి వీధి న
ప్పురజను లెల్లఁ జూడ జనపూజ్యుఁడు దేవి పదాబ్జ సన్నిధిన్
మఱల శిరంబు లుంప సుత మాన్యుల మస్తకపంక్తిఁ జూచి భూ
ధరవర కన్యకామణి నితాంత దయారస మొప్ప నెమ్మదిన్. 91

క. వర ధర్మపాల తనయుల
గురు హత్యా కిల్బిషంబు గొబ్బున వైశ్వా
నర రూపంబునఁ గాంచీ
పురిపై వదలంగ నది యపూర్వ విధమునన్. 92

మ. ప్రళయోజ్జృంభిత వహ్ని రూప మొదవన్ బాటించి పెన్ గాడ్పులన్
వెలుఁగుల్ మీఱుచు ధూమ సంచయములన్ వే కప్పి దిక్సంతతిన్
బలు శబ్దంబుల మీఱి మింట దివిజుల్ పైపై వడిం బాఱఁగా
బలిమిం గాల్చెఁ బురంబు నత్తఱి ధరాపాలుండు గుందన్ మదిన్. 93

సీ. నిత్యశృంగుని మేడ నిర్ధూమమై మండె
నేలఁ గూలెను మహానీలు గృహము
యంజను వరగేహ మగ్ని కాహుతి యయ్యెఁ
దిరుహొత్తు సదనంబు విరిగి మండె
రాహుత్తు చావడి రవ్వలై వెలుఁగొందె
హొన్నారు విడిదియు సన్నగిల్లె
వీరబాహుని కొంప విపుల కీలల మ్రగ్గె
భస్మమై పోయె సుబాహు గృహము

గీ. క్రిందఁ బడి మండె జయశీలు మందిరంబు
శత్రుభీముని గృహ మగ్ని హొత్ర మయ్యె
మంత్రివర్యుల భవనముల్ మండి పోయె
నగ్రజన్ములఁ జంపిన యది కతముగ. 94

చ. పెట పెట లాడు మంటలఁ గృపీటజుఁ డొప్పి వెలుంగ నమ్మహో
త్కట గజవాసముల్ మహిషకమ్ర గృహంబులు గోగృహంబులున్
దిటవగు నప్పురాధిపతి తీరగు కోటలు హర్మ్య జాలముల్
పటుతర సత్సభాస్థలులు భగ్గున దగ్గన మండె మెండుగన్. 95

చ. భగభగ మండు ధాన్యతతి పల్మఱుఁ దీయఁగ బోయి మంట సం
దుగఁ బడి కోశకాంక్షి నిలు దూఱఁగఁ గొట్ల హరించు మ్రుచ్చులున్
దుగ లయి దగ్ధకేశు లయి దొడ్డ గృహంబుల నార్పువారలున్
మిగులఁగ మండు మంటలకు మేనులు మండెడువార లయ్యెడన్. 96

ఉ. పిల్లలఁ జంక నెత్తుకొని పీవర లంబ కుచద్వయంబు ల
ల్లల నాడఁ జేడియలు హా! యని రోఁజుచుఁ బౌర వీథులం
దెళ్లుచు బాఱ నశ్వములుఁ ద్రెంచుకు రాఁగను గోవు లార్వఁగన్
గొల్లున ఘోష పెట్టి రిలఁ గూలుచుఁ దత్పురి పౌరు లెంతయున్.

సీ. కల్యాణపురి నుండి ఘన విశ్వకర్మజుల్
కంచికి రా నేలఁ గాంస్య మమ్మ
నంత నీ నృపు కన్య యద్దంబులనుఁ గొని
యొగి ధనం బీయక యుండ నేల
మంత్రులు గృత్రిమ తంత్రంబులం బన్ని
వంచించి శిరములఁ ద్రుంచ నేల
త్రుంచఁగ నవి మింట సంచరింపఁగ రాజు
ధర్మపాలుని వేఁడఁ దలఁపఁ డేల

గీ. వారి వధియించు పాపమే ఘోర వహ్ని
గాఁగ రూపొంది యిప్పురిఁ గాల్చి వైచె
ననుచు నవ్వీటి జనములు గనలి మిగుల
వీధి వీధినిఁ బరువులు వెట్టి రంత. 98

ఉ. అంతట బ్రహ్మహత్య శిఖి యా నృపతిన్ మహిషిన్ బ్రధానులన్
బంత మెలర్పఁ జుట్టుకొని పైఁ బడఁ బోవఁగ నెందు నిల్వలే
కంతము దోఁపఁగా నృపతి యాప్తులు మంత్రులు నేకమై భయ
స్వాంతములతోడ నిట్టు నటుఁ బాఱుచు రోఁజుచు నుండ నత్తఱిన్. 99

ఉ. మంత్రి యొకండు పల్కె నిటు మానవ పాలునకున్ మహోగ్ర దు
స్తంత్రముఁ బన్ని బ్రహ్మకుల ధన్యులఁ గూల్చితి మట్టి దోషమే
యంత్ర మహాగ్ని యో యనఁగ నన్నిఁటిఁ గాల్చుచు నుండె నింక నే
తంత్రము రక్ష సేయదు మహాగ్ని దహించును మమ్ము మిమ్మునున్.

క. కనుకన్ శ్రీ కామాక్షినిఁ
గనుగొని యీ సమయమున నిగాఢపు భక్తిన్
మన మలరఁగఁ బ్రార్థించిన
మనలను రక్షించు నేమొ మానవ నాథా! 101

క. అన నరపతి యా పలుకులు
మనమున యోచించి వేగ మంత్రులతోడన్
దన ప్రాణ దైవతంబుగఁ
దనరెడు కామాక్షి గుడికిఁ దడయక చనుచున్. 102

చ. తడఁబడఁ బాదపద్మములు దట్టపు ఱెప్పల నశ్రు బిందువుల్
జడిగొని రాల మోవి పెలుచన్ బొడి వోవఁగ జిహ్వ నోష్ఠమున్
దడితడిగా నొనర్చుచును ధైర్య మడంగి మహానలం బెటుల్
గడతు నటంచుఁ గోవెలకు గ్రక్కునఁ దాఁ జనుదెంచె నత్తఱిన్. 103

క. కామాక్షి యాలయంబున
భూమీశుఁడు నిల్వఁ ద్వష్టృపుత్త్ర హనన జో
ద్దామాగ్ని తోడఁ జనుచున్
దా మండుచు నెదుట నిల్వ ధరణీ పతియున్. 104

వ. మంత్రులతోడఁ జుట్టు ముట్టుచున్న య మ్మహానలంబునకు సహింప జాలక నిజరూపంబున విరాజిల్లు కామాక్షీదేవి సమీపంబున వేదాంత ప్రతిపాదితార్థ స్తుతులఁ జెలంగు ధర్మపాల శంకరాచార్యుల వీక్షించి లోపలికిం జన నేరక ద్వార బహిర్భాగంబున నుండి య మ్మునితో ని ట్లనియె. 105

క. శంకర! పరమేశ్వర వర
కింకర! మానీంద్రచంద్ర కీర్తిత చరితా!
సంకలిత యోగ శోభిత!
పంకజభవ వినుత చరణ పరశివ రూపా! 106

క. అపరాధు లైన మమ్ములఁ
గృపఁ జూడుమ! యీ మహాగ్ని కీలల కెర లై
విపరీత మరణ మందఁగ
నిపు డుంటిమి మాకు శరణ మీరె! మహాత్మా! 107

క. దైవాధీనము జగములు
దైవము తన్మంత్ర వశము తథ్యమ్మగ భూ
దేవాధీనము మంత్రము
గావున దైవంబు ద్విజుఁడు గనుఁగొన జగతిన్. 108

క. మనుజేశుల దుఃఖంబులు
మునులకు సాధ్యములు వాప మును సంవరణా
దినరేశుల రక్షింపఁడె
ఘనుఁడైన వశిష్ఠమౌనికాంతుఁడు కరుణన్. 109

క. మును భృగురాముని భయమున
ఘనుఁడైన దిలీప భూమికాంతుఁడు గాధే
యునిచేత రక్షితుండై
తన రాజ్యశ్రీనిఁ బొంది తనరఁడె జగతిన్. 110

చ. తెలివి యొకింత లేక కుమతిన్ మహనీయుల శక్తి నెంచకే
బలిమిని దర్పణంబుఁ గొని పన్నుడుగన్ మహితాగ్రజన్ములన్
జలమున నీయకున్న భటసంఘముఁ గట్టఁగఁ బంప వారలన్
జులకఁదనంబునన్ దునిమెఁ జోద్యముగా నొక రుద్రసేనుఁడే. 111

మ. అలుకన్ మంత్రులు వాహినీపతులతో నవ్వేళ న విశ్వాకృ
త్కుల సింహంబులఁ జంపుపూనికఁ జమూకోటి న్నియోగింపఁ ద
ద్బలముం గూల్చెను ధర్మపాల ఘనసంతానాగ్రగణ్యుండు త
ద్విలస ద్విశ్వకరాన్వయార్యుల తలల్ వే త్రుంప దుస్తంత్రినై. 112

క. మును వృత్రహనన కిల్బిష
మనిశము వాసవుని నంటి నటులనె నాకీ
యనిమిష విప్రాత్మజ వధ
జనితాఘానలము నంటె సంయమిచంద్రా! 113

క. అపరాధమ్ములు మాయం
దపరిమితంబులుగఁ దోఁచు నవనీ స్థలిలో
నృపతికి దోషము లరుదే
కృపతో రక్షింపు మమ్ముఁ గృత పుణ్యనిధీ! 114

క. అన విని యమ్మునివర్యుఁడు
మనమునఁ దద్రాజవరుని మన్నన మిగులం
గొని కరుణామయుఁడై గుహ
జననిక్ వినుతించె నిట్లు సంభృత భక్తిన్. 115

సీ. పంకజ నిభ నేత్ర, పరశు మహా వేత్ర!
పన్నగాధిప సూత్ర, భవ్యగాత్రి!
పల్లవ మృదుపాణి, పన్నగేశ్వర వేణి!
పరమపూరుషు రాణి, భద్రవాణి!
సర్వలోకేశ్వరి, సంపద్విభాస్వరి!
విజయ వికస్వరి, విదళితారి!
శత్రు సంహారిణి, సత్య విహారిణి!
పాపాపహారిణి, భక్త తరణి!

గీ. శైలరాట్కన్య, లోకైక శీలధన్య!
యమిత గుణపుణ్య, సర్వలోకాగ్రగణ్య!
భువన యుతకుక్షి, కామాక్షి! భవునిసాక్షి
నిన్ను నుతి సేయ నేర్తుమే నీరజాక్షి! 116

చ. సకల చరాచరావళుల సంతతమున్ విలసిల్లు సృష్టికిన్
బ్రకటగతిన్ నిదాన మయి భాసిలు బ్రహ్మ మటంచు నిన్ను సత్
ప్రకరము వైదికార్థములఁ బ్రస్తుతి సేయుచు నుందు రెప్పుడో
వికచ సరోజనేత్ర! యిఁక వేఱుగ నెన్నఁగ నేల యిత్తఱిన్. 117

వ. అని యనేక ప్రకారంబుల శంకరాచార్యుండు ప్రార్థింప నయ్యుమా దేవి శాంతింప కున్న నందులకుఁ గారణం బెద్ది యని యోచించి శంకరమానిని శాంకరీదేవి శాపం బెఱింగి భూమీశున కిట్లనియె. 118

చ. జగముల లీలమై రచన సల్పఁగఁ జాలు జగద్గురూత్తముం
డగు భువనైకశిల్పి కులమం దుదయించిన ధర్మపాలునిన్
నిగమ విధాన సమ్మతిని నెమ్మి భజించిన నమ్మహాత్ముఁ డీ
పగ విడనాడి వేగిరమ పాలనఁ జేయుఁ గృపార్ద్రచిత్తుఁడై. 119

వ. అని మఱియు ధర్మపాలు నుద్దేశించి. 120

సీ. అఖిల భూతములయం దణుమాత్రముగ నుండి
బ్రహ్మాండరూపుఁడై ప్రబలు నెవఁడు
పుడమి బ్రహ్మాదుల బొమ్మల యట్టుల
నిర్మింపఁ జాలిన నిపుణుఁ డెవఁడు
బ్రహ్మాండముల నెల్లఁ బ్రబలింపఁ బోషింప
సమయింపఁ గలయట్టి చతురుఁ డెవఁడు
యోగారాణ్ణివహ సద్యోగ సమాధుల
ధ్యానగమ్యం బగు తత్త్వ మెవ్వఁ

గీ. డాది మధ్యాంత రహితుఁడై యలరు నెవ్వఁ
డా విరాడ్విశ్వకర్మ దివ్యాంశు లైన
బ్రహ్మఋషుల కులంబునఁ బ్రభవ మైన
ధర్మపాలకనామ! సద్ధర్మకామ! 121

క. నీ మహిమలు వర్ణింపఁగ
శ్రీ మహిళాపతికిఁ దరమె చింతింప నహా!
నా మనవి సత్కృపను విని
భూమీశునిఁ బ్రోవు మయ్య భూసురవర్యా! 122

వ. అని మఱియు నృపాలున కిట్లనియె. 123

ఉ. వీరల దర్పణార్థమును వేగమ యిచ్చి కరంబు మాని మీ
నేరము సైఁచి ప్రోవ మహనీయ గుణాఢ్యుని ధర్మపాలునిన్
గూరిమి మ్రొక్కి సన్నుతు లకుంఠితరీతినిఁ జేయ నాతఁడే
గారవ మొప్పఁ బ్రోవవలెఁ గాని యిఁకేరికి శక్యమా నృపా! 124

క. అన విని నరనాథాగ్రణి
వినయంబున ధర్మపాల పీరుని పదముల్
తన శిరము సోఁక మ్రొక్కుచు
ననియెన్ దైన్యంబు దోఁప నవనత ముఖుఁడై. 125

సీ. సకల చరాచర జాలంబు లెవ్వాని
యిచ్ఛచే జనియించి యెసఁగుచుండు
భూ వాయు సలిలాది భూతపంచక మెల్ల
గుణముల నెవనిచేఁ గూర్పఁ బడియె
బ్రహ్మాండ సంఘంబు పరుఁ డగు నెవ్వని
యోగనిద్రను గూఢ యుక్తిఁ దనరు
జలముల రవివోలె వెలయు నుపాధులఁ
బ్రతిబింబమై తోఁచు ప్రభుఁ డెవండు
గీ. అట్టి పరమైన తేజం బనాది పురుషుఁ
డప్రమేయుండు నచ్యుతుం డా విరాట్టు
విశ్వకర్మయె బ్రహ్మంబు విశ్వమందు
వానిపుత్రులు మీ రంత వారు కారె. 126

క. ఉపకృతిఁ జేసిన వారికి
నుపకారము సేయఁగా మహోన్నతి యగునే!
యపకృతిఁ జేసిన వారికి
నుపకారము సేయఁగా మహోన్నతి గాదే! 127

క. గరిమన్ మిముఁ బ్రార్థించిన
దురితంబు లడంగు మిమ్ము దూఱిన నఘమౌ
శరణాగత రక్షణ మీ
బిరుదమె కద ధర్మపాల! పృథివీస్థలిలో. 128

క. మును భృగురాముని భయమున
ఘనులగు హైహయులు విశ్వకర్మాన్వయులన్
వినయమున వేడగా నా
జనపతులను బ్రోవలేదె చతురత మీఱన్. 129

క. మును విశ్వరూపుఁ దునిమినఁ
బనుపడి యా బ్రహ్మహత్య బాధింప భయం
బున నింద్రుఁడు ప్రార్థించిన
ఘన విశ్వబ్రహ్మ ప్రోవఁగా లేదె కృపన్. 130

క. మును జ్యోతిష్మంతుం డను
మనుజేశుఁడు పుత్రి చంద్రమతినిఁ గరండం
బున నుంచి జలధిలో నిడ
ఘనుఁడు మయబ్రహ్మ ప్రోవఁగా లేదె దయన్. 131

క. విను మయ్య! యా జరాసం
ధుని బాధల కోర్వ లేక తోరపు భక్తిన్
వినుతింప మెచ్చి కృష్ణుని
మును గరుణన్ విశ్వకర్మ ప్రోవఁగ లేదే. 132

క. కులసతికొఱకై రాముఁడు
జలనిధి దాఁటంగ లేక సంస్తుతి సేయన్
నలవిశ్వకర్మ దయతోఁ
బలుసేతువు గట్టి దుఃఖభర మడఁపఁ డొకో. 133

గీ. మను మయ త్వష్ట్ర శిల్పులు మహిమ వెలయు
నట్టి దైవజ్ఞులోఁ గూడి యఖిల భువన
జీవనాధార సృష్టిచేఁ జెలఁగినార
లవని నో దేవ విప్ర కులావతంస! 134

చ. విలసిత పుణ్యవంతులగు వీరుల మీ సుతసింహులన్ వెసన్
జలమునఁ గూల్పఁ బంప భటసంతతి మీ సుతుఁడే తెరల్చెఁ ద
ద్బలముల నంత మంత్రు లతిపౌరుష మొప్పఁగ భ్రాంతిఁ గొల్పి త్వ
ద్విలసిత పుత్ర శీర్షములు వేగమె త్రుంచిరి కృత్రిమంబుగన్. 135

క. అందునఁ బ్రాయశ్చిత్తము
సుందర మగు పురము ధనము సొదఁ బడె జనముల్
మ్రుంది రిదె మిగుల నేనున్
గుందుటలును సిద్ధమయ్యె గుణరత్ననిధీ! 136

చ. బలముల మీ తనూజుఁ డగు బాలుఁడు గూల్చె నటంచు ధాత్రిలో
వెలసెను గీర్తి మీకు ఘనవీరులఁ గృత్రిమ సామ మొప్పఁగాఁ
జలమునఁ గూల్చె భూపుఁ డను సాంద్రతరంబగు దుర్యశంబు మా
కిలఁ దిర మయ్యె సజ్జన సమీడ్య చరిత్రక! ధర్మపాలకా! 137

గీ. ధర్మ పరిపాలనముచేత ధర్మపాలుఁ
డనెడు నామంబు సార్థక మయ్యె మీకు
భూతహితభావ! ప్రత్యక్ష భూమిదేవ!
ప్రాణదానం బొసంగు మో పరమ పురుష! 138

క. అని పల్కు భూపవర్యుని
ఘన దీనాలాపములకుఁ గడు జాలి చెలం
గను ధర్మపాలు మనమునఁ
గనలెడు రోషాగ్ని చల్లఁగా నయ్యెఁ గనన్. 139

మ. కరుణాపూరిత హృత్సరోజ యుతుఁడై కాంచీపురాధీశు నా
దర మొప్పం గని ధర్మపాలుఁ డనె నేతన్మానియుం దేవియున్
వరసాక్షిత్వము గాఁగ నీకరణి నర్థిం బ్రార్థించు నిన్నెంతయున్
బరమప్రీతినిఁ బ్రోతు నెల్లజనముల్ భావంబులన్ మెచ్చఁగాన్. 140

వ. అని ధర్మపాలుండు చోళమహీకాంతుని దహింపంబోవు బ్రహ్మ
హత్యాగ్ని నుపశమింపఁ జేయన్ దలంచి య య్యుమాదేవిం గాంచి.

క. అపరాధి యైన భూపతి
యపచారంబులు క్షమించి యాదర మొప్పన్
గృపతోడఁ బ్రోవు మని తా
నపరిమిత స్తుతు లొనర్చె నగణిత భక్తిన్. 142

వ. అట్లు స్తుతించిన యనంతరంబ. 143

మ. ఘన తద్వహ్ని మహోగ్రకీల దఱియంగా స్రుక్కుచున్నట్టి యా
జననాథాగ్రణి నా మహేశ్వరి దయాంచద్భావ సద్దృష్టిచేఁ
గనె నాసారమునన్ శమించు దహనాకారంబుగాఁ దత్‌క్షణం
బున శాంతించెను గిల్బిషానిలము ద ద్భూపాలకుం డంతటన్. 144

క. కర సరసీజమ్ములు తన
శిరముపయిన్ మోడ్చి దేవిచెంగటను నమ
స్కరణ మ్మొనర్చి యంతట
గురుభక్తిన్ ధర్మపాలకునకున్ మ్రొక్కెన్. 145

వ. అంత శరణాగతవత్సలుం డగు ధర్మపాలుం డుచితాలాపంబులఁ
జోళాంగుని సంతసింపం జేసి యాదరంబున మఱియు ని ట్లనియె. 146

ఉ. దర్పణకోశ మిచ్చి పటుదర్పము వీడియుఁ బన్ను మాని నీ
వోర్పున మత్కులోద్భవుల కొయ్యన భోజన మజ్జనాది సం
తర్పణ వేగఁ జేసి వరధర్మగతిన్ భువి పాలనంబునన్
నేర్పు వహించి సత్యమును నీతి నిఁకన్ విడనాడ కుండుమా! 147

వ. అను నంత ధర్మపాలుని శరణాగత వత్సలత్వంబునకుఁ గామాక్షీ దేవి సంతసించి యిట్లనియె. 148

గీ. ధర్మపాలక సంతత ధర్మ శీల !
నీదు భక్తికి మెచ్చితి నెమ్మనమునఁ
గోరుము వరంబు లొసఁగెదఁ గోర్కె దీర
ననఁగ నిట్లనె నాతఁ డాయంబతోడ. 149

సీ. ఇలను విశ్వబ్రహ్మ కుల దైవతమ వీవ
యఖిల లోకంబుల కంబ వీవ
మత్పుత్ర శీర్షముల్ మహిమ మీఱఁగ నీదు
చరణాబ్జముల ముందు శాశ్వతముగ
నివసింపఁగను జేయ నిక్కథ మఱువక
నిరతంబుఁ బూజింత్రు నిఖిల జనులు
సుత కబంధంబు లిచ్చోటికి రప్పించి
శిరములు ప్రాణముల్ వరుస నొసఁగి

గీ. పాలనము సేయు మని ధర్మపాల శిల్పి
ప్రణతు లొనరింపఁ గామాక్షి భర్గురాణి
యింద్రసేనాది శీర్షమ్ము లింపు మీఱఁ
దనదు పాదాంతికస్థలిఁ దగ నమర్చె. 150

వ. అంతఁ గామాక్షీదేవి దివ్యప్రభావంబున రాజావరణంబున శిరో విహీనంబులై గర్తంబులయం దున్న రుద్రసేనాదులకళేబరంబు లంబరంబున కెగసి సత్వరంబున జగదీశ్వరి యగు కామాక్షీదేవి యాలయ ద్వారంబున కెదుర నిలువంబడిన సకల జనంబులు భయభ్రాంత చిత్తంబులఁ జూచుచుండ నత్యాశ్చర్యంబున యథాపూర్వంబు శిరంబు లుత్పన్నం బయ్యె నంత దివ్యతేజంబునఁ ద్రిమూర్తులుగాఁ బ్రకాశించుచున్న రుద్రసేనాదులు ముప్పురును దయామయి యగు

శాంకరిం గాంచి యుపనిషదర్థ గర్భితంబు లగు బహువిధ స్తోత్రంబు
లొనర్చి నమస్కరించి యిట్లని వినుతించిరి. 151

సీ. ఆది మధ్యాంత శూన్య స్వభావాఢ్య వై
ధీరుల చేర్చకుఁ దెలియ రావు
సర్వాగమామ్నాయ సార మంత్రార్థ వై
యతుల వీక్షింప నలవి గావు
తత భూతపంచకాంత ర్బహి ర్వ్యాప్త వై
యెడఁదల కేపాటి నెఱుఁగ రావు
బహుళ మాయామయ ప్రకృతి కతీత వై
బ్రహ్మాదులకు నైనఁ బడయ రావు

గీ. సార భాస్వత్ప్రభా సహస్రారకమల
కర్ణికోపరి మానసాక మ్మటంచుఁ
గోరి పల్కుదు రార్యు లనారతమ్ము
నిన్నుఁ దెలియంగ నేర్తుమే నేఁడు తల్లి! 152

వ. అని ప్రార్థించుచు నేక దీక్షా భావంబున నిలువంబడి యున్న రుద్ర
సేనాదులం గాంచి మహాపురుషులనుఁగా నెఱింగి శంకరాచార్యుం
డిట్లు వినుతించె. 153

గీ. హరి హర సమాన తేజస్కు లైన మిమ్ముఁ
దెలియ నేరక సామాన్య దేవ విప్ర
శిల్పులుగ నెంచి లోపముల్ చేసినట్టి
వెంగలులఁ బ్రోవుఁడీ! కాంచివీరులార! 154

వ. పిమ్మట నమ్మహాత్ములం గాంచి చోళభూకాంతుండు మఱియు
నిట్లని స్తుతియించె. 155

ఉ. ఘోరతరోరు సేనలనుఁ గూల్చితి రంచును దుష్టబుద్ధి నై
సూరనమంత్రి మాట విని శౌర్య మొనర్చితి ధర్మ మార్గముల్
గూరిమి మోసగించి మిముఁ గూల్చిన పాతకి నంచు నెంచ కో
భూరికృపాత్ములార! మముఁ బ్రోవ సమంచిత దృష్టిఁ జూడుఁడీ! 156

వ. అయ్యవసరంబున నమ్మహనీయుల నపరాధి యైన సూరనా
మాత్యుం డిట్లని ప్రార్థించె. 157

సీ. భువి భారమును దీర్ప భవునాజ్ఞ దివినుండి
పుడమి కేతెంచిన పూజ్యులార!
అంతంబు లేని వేదాంత తత్వార్థంబు
గుఱు తెఱింగిన జగ ద్గురువులార!
భువన ప్రవర్తనోద్భవ భూత హిత పంచ
కర్మ సిద్ధాంత సంకర్తలార!
యపరాధము లొనర్చు నస్మాదృశులఁ గూడ
దయ మీఱఁ గాచు నుదారులార!

గీ. విమల యశులార! యసమాన వీరులార!
కారణాంతర మానుషాకారులార!
భక్తజనలోల కామాక్షి భక్తులార!
ఆదరింపుఁడి, మము నిపు డార్యులార! 158

వ. అంత నా ధర్మపాలుండు జగన్మాతయగు కామాక్షీదేవి ప్రభా
వంబునఁ బునర్జీవితు లగు పుత్రులం గాంచి సంతసించుచు భక్తి
పూర్వకంబుగ నద్దేవి నిట్లని ప్రార్థించె. 159

గీ. అంబ! కచ జిత రోలంబ! యద్రిజాత!
అజ హరీంద్రాది నుత చరణాంబుజాత!
పురజనంబులఁ బ్రోవు మో పుణ్యచరిత!
కాంచిపుర మెప్ప టట్లు నిర్మించు మాత! 160

వ. అను నా ధర్మపాలుని పరహిత స్వభావంబునకు సంతసించి కాంచీపుర
క్షేత్రంబు పునస్సృష్టి గావించి ధర్మపాలున కిట్లనియె. 161

సీ. ఇలయందుఁ గల నీదు కుల మెల్ల ధన ధాన్య
విద్యాభివృద్ధిచే వెలయు చుండు
నాపదల్ వొందిన యప్పుడు మచ్చింత
నము సేయఁ బ్రోచెదఁ బ్రమద మెసఁగ
నీ సుత శీర్షముల్ వాసిఁ బూజలు గాంచు
మత్పాద సన్నిధి మహిమఁ దనరి
యీ చరిత్రము నెల్ల నిరవుగా లిఖియించి
శాసనస్తంభ సంస్థాపనమ్ము

గీ. నీ మహా కంచిపురమున నింపు మీఱ
సకల జనములు చూడంగ జరుప వలయు
నీదు పుత్రులు నీవును నిఖిల భువన
వినుతిఁ గాంత్రు రవీందులు వెలయుదాఁక. 162

వ. అని మఱియు నా జగదీశ్వరి మహా ధ్యాన నిష్ఠచే ముకుళితాంబ
కంబుల స్వాభిముఖులై యున్న రుద్రసేనేంద్రసేన భద్రసేనులం గాంచి
మద్భక్తాగ్రగణ్యు లగు మీకు శిరంబులు ప్రసాదించి పునర్జీవి
తుల నొనర్చితి. మీ కీర్తి చంద్రికలాచంద్రతారకంబుగాఁ బ్రకాశించుఁ
గాక ! యని యాశీర్వదించి, యిఁకఁ గల్యాణపురీ వృత్తాంతంబుఁ
దెల్పెద నాకర్ణింపుఁ డని యిట్లు వచించె. మత్సందర్శనార్థంబు కాంచీ
పుర ప్రయాణాయత్త చిత్తంబుల మీ కళత్రంబుల కానతిచ్చిన
ప్రకారంబున వారలు ముప్పురును నియమవ్రత లై చంపక వృక్షం
బులం బూజించుచుండ మీ శిరంబులు దెగిన మధ్యాహ్న కాలంబున
వారలు పూజింపఁ బోవ నవి కళావిహీనంబై వాడి యుండుటం
గాంచి తద్వృత్తాంతంబు మీ తల్లి యగు జ్ఞానాంబకును మీ సోదరుం
డగు సుషేణునకు నెఱింగించి యపార నిష్ఠాగరిష్ఠ లై మత్పద

ధ్యానం బమోఘంబుగాఁ జేయ నంత మెచ్చి వరంబులం గోరుం డన మత్పతులఁ బునర్జీవులనుగాఁ జేయు మని కోరుటయు నందులకు నే నట్ల చేయుదు నని మద్భక్తాగ్రగణ్యలగు మీ కులకాంతల కాన తిచ్చినయంత నాచే సెల వంది చంపకవృక్ష సందర్శనంబు సేయ నా వృక్షంబులు సంపూర్ణ కళలతోఁ బ్రకాశించుటం గాంచి సంతసం బున మీ తల్లికిని మీ సోదరునకుఁ దెలియం జేయ వారంద ఱత్యా నందంబున నోలలాడుచుండిరి. ఇఁక నాలస్యంబు సేయక కల్యాణ పురికిం బ్రయాణంబై పొందు మీరు జయంబుఁ గాంతు రని యాన తిచ్చిన రుద్రసేనాదులు నమ్మహాదేవికిని ధర్మపాలునకును బునః ప్రణామంబు లాచరించి భయాకుల మానసులై ప్రార్థించుచున్న మంత్రిసూరనాదులను వీక్షించి మీకుం బ్రయోగించిన శాపాక్షరం బులు మిమ్ముం బాధింపక పంపానదీ జలంబుల లీనం బగుట నిక్కువం బని రుద్రసేనుండు వల్కినంత. 163

క. వింతగఁ గామాక్షీ గే
హాంతర్వర్తు లగు వేల్పు లతిముదమునఁ దా
మెంతయు భేరీధ్వనులు ది
గంతములన్ నిండఁ జేసి రందఱు వినఁగన్. 164

వ. అంత షోడశకళా పరిపూర్ణయగు కామాక్షీదేవి ధర్మపాలాదులకు సెల వొసంగి రుద్రసేనాదుల భిన్న శీర్షంబులతోడ సహజ శిలా రూపంబు వహించుటం గాంచి తదనంతరంబ. 165

క. మునివరుఁ డగు శంకరుడును
గన నృపతియు ధర్మపాల ఘన సూనులతోఁ
జని వేగ శాసనాంచిత
కనక స్తంభంబు నుంచెఁ గాంచీమధ్యన్. 166

క. వరుసగ నీ చరితంబును
సురుచిర శాసనమునందుఁ జూచిన పౌరుల్
స్థిరమైన భావముల బం
ధురరీతిన్ స్తోత్రపద్ధతులఁ జెలఁగి రొగిన్. 167

ఉ. అంతట ధర్మపాలునకు నా నరనాథుఁడు దర్పణార్థముల్
సంతస మొంద నిచ్చి కల శైల్పిక వర్యులఁ బిల్చి ప్రీతితో
వింతగ విందొనర్చి కడు వేడుక మీఱఁగ ధర్మపాల సు
స్వాంతునకున్ బహూకృతులు సంస్తుతు లొప్పఁగఁ జేసె భక్తితోన్.

క. కంచునకుఁ గరము లేదని
కాంచన పత్రిక లిఖించి కౌతుక మొప్పన్
బంచ బ్రహ్మాన్వయున కు
దంచితముగ నొసఁగె వేడ్క నవనీశ్వరుఁడున్. 169

క. ఘనుఁడైన ధర్మపాలుఁడు
తనయుల బంధువులఁ గూడి తగ శాంకరినిన్
మనసారంగ స్మరించుచు
ఘనముగఁ గల్యాణపురికిఁ గదలఁ దలంచెన్. 170

వ. అట్లు తలంచి ధర్మపాలుండు శేషవస్తువులను దీనజనాళి కొసంగి గజ తురగ పదాతులఁ గల్యాణపురంబునకుం బంపఁ జోళభూమీశు నకు నియమించి రుద్రసేనుని సమర సన్నాహంబునకై నిర్మింపఁబడిన రథం బాయత్తపఱుపు మని యానతీయ నా భూమీశుండు ధర్మ పాలాదుల వెంటఁ గల్యాణపురంబునకు శంకరాచార్యునిఁ బోవ నియ మించి ధర్మపాలాదులకు నమస్కరించి యెల్లరను స్యందనం బెక్కించి వారిచే సెల వంది వీక్షించుచున్నంత నా రథంబు వాయువేగంబున నభోమార్గంబున నెగయు నంత. 171

సీ. ఇంద్రుఁడో సంపూర్ణ చంద్రుఁడో యీ తపో
ధనుని వర్ణింపలే మనెడువారు
ఈశుఁడో లేక రమేశుఁడో గణుతింపఁ
దరమా యటంచునుఁ దలఁచువారు
శేషుఁడో లేక యా పూషుఁడో చర్చింప
వశమా యటంచునుఁ బల్కువారు
ధనపతియో సుజీవన పతియో తోఁచ
దనుచు మనమ్ములం దరయువారు

గీ. నగుచు నాశ్చర్యముం బొంది రాత్మలందుఁ
బురజనంబులు, పుష్పకంబో యనంగఁ
దనరు నారథ మెక్కి పుత్రకులఁ గూడి
యేఁగు నా ధర్మపాలు నీక్షించి మఱియు. 172

వ. ఆ పుర జనంబులు. 173

గీ. ధర్మపాలుండు మన పైని దయఁ దలంచి
మహిమచే దగ్ధమైనట్టి మన పురంబు
నాది నున్నట్లు సేసె నా యాదిశక్తి
భక్తుఁ డౌటను గాక యెవ్వారి తరము! 174

వ. అనుకొనుచు నభంబువంక వీక్షించుచుఁ దమ తమ నివాసములకుఁ జనునంత వర్షాకాల జీమూత గర్జనంబులతోఁ బోవుచున్న రథ మాహాత్మ్యంబు వర్ణనాతీతంబై యొక్క ముహూర్త కాలంబున సకల కల్యాణయుక్తం బగు కల్యాణపురంబు సేరం గాంచి తత్పుర జనంబులు ధర్మపాలుఁ డపర విశ్వకర్మ యని తలంచుచుండ నంత. 175

సీ. పురజనంబులతోడఁ బుత్రుఁడు బంధుగుల్
గోడండ్రు సతియును గోర్కు లూర
ధర్మపాలాదు లందఱఁ జూడ సంతోష
వనధి నీఁదుచు వేగ వచ్చి రంత

నందఱి సేమంబు లారసి వేగంబ
తన వారలనుఁ జూపి ధర్మపాలుఁ
డమిత ముదంబున ననియె శంకరునితోఁ
బరికింపఁ జాల నబ్బురము గలుగఁ

గీ. బతుల బ్రదికించి రీ పతివ్రతల శక్తి
నరసితివె యనఁ గోడండ్ర యమిత మహిమ
యెన్నఁ గందర్ప సతికన్న మిన్న యయ్యె
ననుచు శంకరుఁడును హర్ష వనధిఁ దేలె. 176

వ. అంత ధర్మపాలుండును కాంచీపురంబునఁ గామాక్షీదేవి తెల్పిన తెఱంగంతయుఁ గోడండ్రగు జ్ఞానవల్లీ వేదవల్లీ హేమవల్లుల వలన విని సంతోషిత స్వాంతుండై కుమారుండగు సుషేణునిఁ గాఁగలించుకొని పురజనుల క్షేమంబు లారసి బంధువర్గంబునకుం దగు విధానంబుగ భోజనంబుఁ గావింపు మని భార్య యగు సుగుణాంబను నియమింప నామె తత్క్షణంబ పాకంబు సిద్ధపఱుప శంకరునితోఁగూడి భుజించి సుఖాసీనులై యున్నంత శంకరమానిని రుద్రసేనాదుల మహా మహిమం బంతయు సకల జనంబులకుఁ దెలియ నుపన్యసించి మఱియుఁ ధర్మపాలుం గాంచి యిట్లనియె. 177

చ. వినుత కులాగ్రగణ్యుఁడవు విశ్రుతకీర్తి విరాజితుండ వీ
వనుపమ విశ్వకర్మ తులితార్యుఁడ వయ్య! గణింప శక్యమే
దినకర తేజ! నీ యశము దిక్కుల నెల్లెడఁ బ్రస్ఫురించు నో
యనిల తనూభవ ధ్వజ! మహాబ్ధి గభీర! సుధర్మపాలకా! 178

క. మీ మేఘవాహ కులజుల
ధీమహిమలు కార్యములుఁ బ్రదీప్త కళా వి
ద్యా మహిత మంత్ర శక్తులు
భూమికి శుభదములు శిల్పి భూసురవర్యా! 179

గీ. మిమ్ము మీ మంత్ర యంత్ర శిల్పమ్ములాది
గాఁ గలుగు శక్తులను నుపయోగపెట్టు
కొనఁగ లేనట్టి మందులు గూలుదు రని
గంట గొట్టి వచించె మీ కథ మహాత్మ ! 180

వ. అని కొనియాడు శంకరమానితో ధర్మపాలుం డిట్లనియె. 181

చ. చదువఁగ వచ్చు శాస్త్రములు చక్కఁగ నర్థముఁ జెప్పవచ్చుఁ దా
సదమల యోగవృత్తి నిల సంతస మొప్పఁ జరింప వచ్చు నే
ర్పొదవఁగ నన్య దుష్ట విమతోద్ధత బుద్ధి మరల్ప వచ్చు నా
పదలను బొందు సాధుజన బాధ లడంపఁగఁ దోఁప దేరికిన్. 182

గీ. కీడు మేలును సమముగాఁ గీలుకొల్పి
చూచినాఁడవు నాటక సూత్రధారుఁ
డనఁగఁ దోఁచితి శంకరా! యవనిలోనఁ
గాంచినారము కీర్తి నీ కారణమున. 183

వ. అని పల్కుచున్న ధర్మపాలాదుల వీడ్కొని కాంచీపట్టణ ప్రయాణోన్ముఖుండై శంకరుండు నభోమార్గంబునఁ బఱతెంచి కాంచీపురంబు ప్రవేశించి చోళాంగభూపాలుని దర్శించి కల్యాణపురీ వృత్తాంతంబంతయు నెఱింగించిన సంతసించుచు శంకరునితోడ సభా భవనంబు ప్రవేశించి మునివరు నుచితాసనాసీనుం జేసి నృపాలుండు సింహాసనాసీనుండై సూరనామాత్యుం గాంచి సచివాధమా! యకారణ సమరంబునకు మదీయ చిత్తంబుఁ బురికొల్పినందున సర్వ సేనా నాశనంబును నపజయంబును సంప్రాప్తం బయ్యె నిదియునుం గాక వేద శాస్త్ర పురాణేతిహాస విద్యా విశారదులును, శతకోటి తటిల్లతా సంకాశ తనుచ్ఛాయా విజిత కందర్పులును, నిరుపమాన సమర పాండితీ షడానన సదృశులును, సకలభూత జీవనాధార పంచశిల్ప

కర్మాచరణ నిరంతర నియమ వ్రతులును, విశ్వనిర్మాణ నిపుణులును, మన్వాది పంచబ్రహ్మ వంశ మహార్ణవ రాకానిశాకరులును, సత్య శమ దమాది సుగుణ గణోపేతులును, భూభృత్సమాన ధీర స్వభావులును, జగత్సాక్షి కామాక్షీ దేవతాక్షీణ వరప్రసాదులు నగు రుద్రసేనాదులకుం జేసిన యపచారమువలన మదీయ వంశంబున కుం జిరాపయశం బావరించుటకు మూలకారణంబు నీవ యని నిశ్చయించి నిన్ను శిక్షింపం దలంచితి నింకుల కేమి వచించెదవని నృపాలుండు వలుక సూరనమంత్రి నిశ్చేష్టితుం డయ్యె నంత శంకర మౌని నృపాలా! ఈ యుద్ధంబు దైవయోగంబున సంభవం బయ్యెం గాని వేఱొండు గాదు. బ్రహ్మాదులకుం బడయరాని కామాక్షీదేవి దర్శనంబు మనకు లభించుటకు మంత్రి సూరనయే కారణంబు. అందుచే నాతఁడు గౌరవార్హుండు గాని శిక్షాపాత్రుండు గాఁడని పల్కిన శంకర వాక్యంబులు దేవీ వాక్యంబులుగాఁ దలంచి సంతోష భరితుండై శంకరునకు నమస్కరించి కొలువు కూటంబు విడిచి నిజ మందిరంబున కరిగె నంత సూరన మంత్రియుఁ జంద్రాఖ్యుండగు మంత్రియు నటనున్న జనంబులును జయజయ ధ్వానంబుల శంకరునిఁ గొనియాడుచుఁ దమ తమ నివాసంబులకుం జనిరి. 184

ఉ. శ్రీ రుచిరమ్ము త్వష్టృకుల సింధుకలానిధి రుద్రసేన సం
చారము ధర్మపాల బుధసత్తమ సత్త్వ గుణ ప్రచారమున్
గారి లసత్సుధా మధుర కమ్ర వచః కరుణా ప్రసార మీ
వీరకథన్ వినన్ జదువ వృద్ధియు సౌఖ్యముఁ గాంతు రెల్లరున్. 185

మ. విలస త్తాండవ వేగ చంచల జటా విభ్యభ్ర గంగా ధునీ
గళదంభ శ్చ్యుత సత్కణ ప్రకర ముక్తామాలికా సంతతా
కుల సర్వాంగ సమార్ద్రితా రుచిర సద్గోత్రాధి రాజాత్మజా
లలనాంగీకృత జాహ్నవీ ధృతి మహోల్లాసోల్లస న్మానసా! 186

మాలిని. సురుచిర గుణశీలా! స్తోత్రకృ ల్లోక జాలా!
వరతను ధృతబాలా! భవ్య సర్గాది లీలా!
పురహర వర శూలా! పుణ్య సంపద్విశాలా!
కరగత కకపాలా! కంఠ సక్తాహి మాలా! 187

గద్యము. ఇది శ్రీమదమల హరితసగోత్రపవిత్ర బొమ్మకంటి సాంబ శివార్య పుత్ర పార్వతీకళత్ర కరుణాకటాక్ష వీక్షణపాత్ర ప్రభాకరకవి ప్రణీతంబైన ధర్మపాలవిజయంబను మహా ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

స ం పూ ర్ణ ము



భారతీ ప్రెస్, తెనాలి — 1958.